# విషయసూచిక

# విషయసూచిక



శ్రీః

శ్రీ రామకృష్ణపరబ్రహ్మణే నమః.

# సంగ్రహభాగవతము

## ప్రథమస్కంధము

క. శ్రీరుచిరంబై విలస
త్సారంబై, సకలమానిజనసన్నుతమై
గోరికలొసగుచు వెలసెడు, శ్రీరామాహ్వయ మహంబు సేవింతు మదిన్.

ఆర్యబాలకులారా! సంగ్రహరామాయణమును, సంగ్రహభారతమును బఠించితిరి. వానివలన నేర్చుకొనఁదగిన విశేషాంశములఁ బెక్కింటిని నేర్చితిరి. ఇఁక సంగ్రహభాగవతమును బఠింపుఁడు. లోకవ్యవహారములుగాక యిందుఁ బరమార్థవిషయములు పెక్కులు గలవు. కావుననే మహాకవిశిరోమణి శ్రీబమ్మెర పోతనామాత్యుఁడు

ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంత కన్నంత, దెలియవచ్చినంత తేటపఱతు.

అని వచించెఁగదా. కాబట్టి భాగవతకథను దెలియుట కష్టతరమని యెన్నఁదగియున్నది. అట్టిదానిని దెలిసికొనినఁ గలుగు లాభము లనంతములని తెలియకపోవు. కావుననే మీరీయుత్తమ

కథను దెలిసికొనవలయును. తెలిసికొనుటమాత్రమే చాలదు. దానిని శ్రద్ధగా మనస్సునందుంచుకొనవలయును. అంత మాత్రమే చాలదు. మది నిలిపిన దానిని సార్థకము చేయవల యును. అంతతో నైనదియా తెలిసినదాని నితరులకు బోధింపవల యును. ఇవన్నియుం జేసినంతనే యైనదియా? ఆరీతి ననుష్ఠించి కృతకృత్యులు గావలయును.

శ్రీరామాయణ భారతకథలవలనఁ బ్రపంచజ్ఞానము గలుగును. నిశ్చయము. నీతియు నలవడును. ఈభాగవతకథ వలనఁ బరమార్థజ్ఞానము గలుగును; గాన లోకజ్ఞానము వశిం పదు. ఈరెండును దీనఁ గలుగునుగాన నీమహాగ్రంథము భువన విఖ్యాతిం గాంచెను. మొత్తముమీఁద నీగ్రంథరత్నత్రయ మునం దుత్తమమధ్యమాధమసంజ్ఞల నేర్పఱుప శక్య మెవ్వరికిం గాదు.

శ్లో. రాజీవమివ రాజీవం జలం జలమివాజని.

అన్నట్లీగ్రంథరత్నము లనన్వయాలంకారముంబోలి సాటిలేక యిల వెలయుచుండు.

ఈభాగవతము రామాయణభారతములఁ జదివినపిద పనే చదువవలయు. ఏలయందురా? ఇందు భక్తిజ్ఞానవైరాగ్య ములఁ దెలుపువిషయము లెక్కువ. కథారూపముల నవ్వాని నెంతసులభముగఁ దెలిపినను గష్టపడియే గ్రహింపవలసి యుం డును. కానఁ దొలుతొల్త పైగ్రంథద్వయముం బఠించి పిదప దీనిం జదివిన మీకుఁ గష్టము తగ్గును. కాన దీని మూఁడవ తడవ వ్రాయవలసినయవసర మేర్పడినది. ఇట్టి యుత్తమగాథను సంగ్రహముగఁ దెలిసికొని యావల భాగవతముం బఠింపుఁడు.

అప్పుడు కవిరత్నమగు శ్రీబమ్మెరపోతనగారియుపదేశమును
గ్రహింపఁగల్గుదురు. కథను వినుటకుముం దొకవిషయమును విని
దాని మనస్సున నుంచుకొనుఁడు.

శ్రీరామావతారమునఁ దాఁజేయవలసిన పనిఁ బూర్తి
నొందించి భగవంతుఁ డగు రామమూర్తి స్వీయలోకమున
కరుగ నిశ్చయించుతఱి నామహాపురాణపురుషుని దివ్యమంగళ
విగ్రహమును గన్నులారఁ గాంచి మునిచంద్రులుకూడ మోహ
పరవశు లైరనియు, ఆవిధ మాత్మ నెఱింగి వారికోరిక యవతా
రాంతరమున సిద్ధింపఁగల దని శ్రీరామమూర్తి తెలిపె ననియు,
దాన ముదమంది విశ్వామిత్రాదిమునులు ద్వాపరాంతమున సత్య
భామాదిరూపములం గాంచిరనియు, నొకకథను గొందఱు
పెద్దలు చెప్పుచుండుట మీరును వినియేయుందురు. అది రామా
యణమునఁ జెప్పఁబడలేదు. కావునఁ గేవల కల్పితమని తలంప
నవకాశము కలదు. నమ్మకుండుటకుం గూడ నవకాశముకలదు.
కాని దానిని మీరు నమ్మితీరవలెను. నమ్మితిరా శ్రీకృష్ణావతార
ఫలము మీకు బోధపడును. నమ్మక లేనిపోని ప్రశ్నములు వేయ
సాగితిరా మీ కీకథామృతాస్వాదనఫలము లభింపకుండుటయే
గాక విపరీతభావములు పొడకట్టును. నాస్తికబాలకులుగాక
యార్యబాలకుల రగుమీ రీకథను జక్కఁగా నమ్మి శ్రీకృష్ణావ
తారకథాపఠనఫలమును బొంది కృతకృత్యులరు గండు. నాస్తిక
వాదములను జేసి నిష్ఫలప్రయత్నులరు గావలదు. ఇఁకఁ గథను
వినుఁడు.

భగవంతుఁ డవతరించుటకు నేదియో గొప్పకారణ
ముండియే తీరవలయును. స్వల్పకారణములు దానికిం జాలవు.

ప్రపంచములో నెప్పుడైనను సరియే యెల్లరుఁ బరిశుద్ధచిత్తులై పరిశుద్ధప్రవర్తకులై యున్నతఱి భగవంతుఁ డవతరించునా? ఆ యవతారమునకు ఫలమేమి? ప్రపంచము జలమయమై యున్న తఱి సృష్టి చేయునవసరము గలిగినపుడు బీజభూతులుగ నున్న ప్రాణుల నుద్ధరించి వారి నభివృద్ధిచేయుటకుగా మత్స్యావతార మొందెను. మఱికొంతకాలమునకు దేవతలకు మహావిపద్దశ సంభవింపఁగా మందరపర్వతోద్ధరణ మొనర్చి వారి కమృతలాభ మును గ్రహించి రక్షించి రాక్షసులబాధలు తొలఁగింపందలఁచి కూర్మావతార మెత్తెను. పిదపఁ గొంతకాలమునకు సాధువులగు దేవతల రక్షించుకొఱకె లోకాంతకుఁ డగు హిరణ్యాక్షుని జంప వరాహావతార మంగీకరించెను. మరల సకలలోకస్థితమ సాధుసంరక్షణార్థమే హిరణ్యకశిపుం జంప నృసింహావతార మవధరించెను. మరల నింద్రునిరాజ్య మపహరించిన బలిని నిగ్రహించుపొంటె నాతండు ధర్మరాశిగాన యాచించుటకంటె నితరోపాయంబు సమంజసముకాదు కావున వామనావతార మూర్తిఁ గైకొనియెను. ఆవల భూలోకమున నవార్యశౌర్యం బున విజృంభిఁగుచు మునిజనుల నేఁచు రాజుల నడంపఁబూని యాకార్య మంత పెద్దదిగాదు గావునఁ బరశురామునియందుఁ దనయంశమును జొనిపి యాకార్యమును సాధించెను. తరు వాత త్రిలోకకంటకుం డగుటయేగాక పతివ్రతల బాధించు చున్న రావణాసురుం బొలియింపఁబూని బ్రహ్మవరమున నాతని నింకొక్కరీతిఁ బొలియింప ననువుపడమి మర్త్యంబున సంపూర్ణ కళలతో శ్రీరామావతార మాశ్రయించెను. అవ్వల దుష్టరాజు

లోకంబు సంహారింపఁబూని యద్దాని నింకొకరిచేఁ జేయించినఁ జాలు నని యెంచి శ్రీకృష్ణావతారము నధిగమించెను.

ఈయవతారములన్నియు లోకవిపద్దశఁ బాపఁబూని నవియేగాని లోకము సుఖసమృద్ధమై సాధుజనుల కేకష్టములు రానితఱి నైనవి కావు కదా. సకలజనులు పరమపవిత్రులై భక్తి గుణప్రధానులై యున్నకాలమున భగవంతుఁ డవతరించె నని యేపురాణమునఁగాని చదివితిరా? వింటిరా? లేదుకదా? కావునఁ బామరులెల్ల భక్తిరసపరిపూర్ణహృదయులై యున్నపు డిదిగో భగవంతుఁ డవతరించును, మహాత్ముఁ డవతరించుననుట పిచ్చితన మని మీకైనం దెలియకయుండునా? కాన నట్టి మాటల నమ్మకుఁడు. అవి జల్పితము లని భావింపుఁడు.

శ్లో. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే.

అని భగవద్వాక్యమే మొదటి విషయము యథార్థ మని ఘోషించుచున్నది. కాఁబట్టి ప్రొద్దుపోనిప్రసంగముల నాలకింపక శ్రీకృష్ణావతారకారణమును వినుఁడు.

భూదేవి ప్రజలచే నిండియుండెను. దురాత్ములు తలయెత్తిరి. వారికిఁ బలుకుబడియుఁ గలిగియుండెను. అట్టివారి మాటల నాలకించి చేయువారును గొందఱుండిరి. మొత్తము మీఁద ధర్మధ్వంసముచేయఁబూనువా రెక్కువమంది భూమిపై వసించిరి. అది భూదేవి కెంతో భారముగాఁ దోఁచెను. భగవంతుఁ డీభారమును దీర్పఁగలవాఁ డని మొఱ్ఱపెట్టుకొని యెను. ఆ మొఱ్ఱ భగవంతుఁ డేమని కెక్కెను. అంతమాత్రమున నయ్యైనా? అవశ్య మీభారమును దీర్పఁ ద్వరపడవలయు నని

యాపురాణపురుషునకుం దోఁచెను. దేవత లామహాపురుషుని తాత్పర్య మెట్లో తెలిసికొని తమతమయంశములచే భూతలంబునం గొందఱం బుట్టించిరి. ముందు పరిచరులు ఆవల ప్రభువుగదా రావలయు. ఆవల శ్రీకృష్ణుం డవతరించెను. తన భక్తాగ్రేసరుండగు నరుని విజయునిగా నవతరింపఁజేసెను. ఇట్లవతరించిన యామునివంద్యపాదారవిందుఁడు శ్రీకృష్ణుఁ డొనరించిన మహాకార్యములే యీభాగవతమునఁ దెలియంబడు. వానిం జదువుటకన్న నెక్కుడుపుణ్యకార్య మేమున్నది.

శ్రీరామావతారమున నా దివ్యమంగళవిగ్రహముని(ఁ) గామించినవారలెల్ల గోపికలుగా నవతరించిరి. వారికెల్ల శ్రీకృష్ణమూర్తిని గోరుటయే పురుషార్థముగా నైనది. అట్లే కోరిరి. ఆశ్రీపతి వారల కోరికలం దీర్చెను. కావున నీశ్రీకృష్ణగాథయం దఖిలభక్తజనరక్షణము తేటపడును. ఇంతియగాక రాఁబోవు వారలకు విహితకృత్యములం దెల్పుటయే యీయవతారమునకు ఫలము. మత్స్యకూర్మాద్యవతారములలోఁ జేయనిమహాకార్య మీయవతారమునఁ జేసెను. ఎట్లు? భగవద్గీతాదిభక్తిజ్ఞానవైరాగ్యాది సద్గుణబోధరూపమున. ఏల? కలికాలమున మానవు లధర్మపరులై సత్కార్యవిముఖులై తలకోకశాస్త్రమును గల్పింపఁగలరు. అట్టివారికి సన్మార్గప్రదర్శకముగుంగాక యను నూహచే బోధించెనని యెఱుంగుఁడు. కాఁబట్టి కలియుగమునఁ జాలకాలము దనుక భగవంతుఁ డవతరింపఁబూనఁడని నమ్ముఁడు. నిష్ఫలోపన్యాసముల వినకుఁడు. అందు వాక్ప్రౌఢిమతప్ప నింకొక్కటి యుండదు. కీర్తిం గోరి కొంద ఱట్లు మాటలాడుదు

దురు. కాని వారిమాటలయందు సత్యము గగనకుసుమమే యగును.

ఆర్యబాలకులారా! యీపైఁ జెప్పిన నాలుగుమాటలు చక్కఁగా మదినిలుపుకొని భాగవతమును బఠించిన మీ కపార లాభములు కలుగు. లేదేని వృథా కాలక్షేపము చేసినట్లేయగు. అట్టికార్యమును మీ రెప్పుడు చేయఁబూనరను నమ్మకము నాకున్నది. మీ రార్యబాలురు కదా! కావున మీరు శ్రద్ధగా దీనిం జదివి కృతకృత్యుల రగుదు రనియు, దాన నా యీశ్రమము ఫలించు ననియు గట్టిగా నమ్మితిని. ఇఁక భాగవతము ననుసరించి కథను సంగ్రహించి వ్రాసెద. అవధరింపుఁడు. దీనిని జదువుటకు ముం దీపద్యరత్నమును జక్కఁగాఁ బఠించి తరువాతఁ గథను జదువ నారంభింపుఁడు.

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని, నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని, కలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు.

ఈభాగవతకథ పరీక్షిత్తునకు శుకమహాయోగివరుచేఁ జెప్పఁబడినది. కానఁ దత్కాలంబు మొద లనువదించెద.

## పరీక్షిన్మహారాజు ధర్మంబును గాపాడుట

ధర్మరాజు పరీక్షిత్తుని రాజుం జేసి సోదరులతో మహాప్రస్థానమునకుం బోయి శరీరంబు వదలెను. పిదప నభిమన్యుకుమారుండు తాతలప్రవర్తనము లక్ష్యముగా రాజ్యమును పాలించుచుఁ బ్రజానురంజకుఁడై యుండెను. ఒక్కనాఁ డా రాజశశాంకుఁడు వేఁటాడుతమకంబున నరణ్యమునకుం బోయెను. పూర్వవాహిని యగు సరస్వతీతీరంబున ధర్మదేవతయు

భూదేవియు వృషభధేనురూపంబులం దాల్చి ధర్మువుంగూర్చి సంభాషించుచు ముందు దీని క్షేమికీడువాటిల్లునో యనుచుండ నీరాజావృషభధేనువు లుండుతావునకు మార్గవశంబున నరిగెను. ఆతరుణమ్మున

శా. కైలాసాచలసన్నిభం బగుమహాగంభీరగోరాజముం
గాల క్రోధుఁడు దండహస్తుఁడు నృపాకారుండు క్రూరుండు జం
ఘాలుం డొక్కఁడు శూద్రుఁ డాసురగతిం గారుణ్యనిర్ముక్తుఁడై
వేలం గూలఁగఁ దన్నెఁ బంచితిలఁగా నిర్ఘాతపాదాహతిన్.

౧-స్కం. ప-౪౧౧.

శా. ఆలోలాంగక నశ్రుతోయకణజాలాక్షిన్ మహాంభారవన్
బాలారూఢతృణావళీకబళలోభవ్యాప్తజిహ్వాగ్రసాం
దోళస్వాంతనజీవవత్స నుదయద్దుఃఖాన్వితన్ ఘర్మకీ
లాలాపూర్ణశరీర నామొదవు నల్లంఘించి తన్నెన్ వడిన్.

౧-స్కం. ప-౪౧౩.

ఆకుపురుషుం డిట్లావృషభధేనువులం దన్నుటం గన్నులారఁ జూచి పరీక్షిత్తు పట్టరానికోపంబున ధనుర్దండంబున గుణంబెక్కించి ముందున ట్లున్న కాండంబుఁగూర్చి మేఘగంభీర వచనంబులతో, పాపాత్మా!

శా. నిన్నుం గొమ్ములఁజిమ్మెనో కడిసెనో నిర్భీతిమై గోవులన్
దన్నం గారణమేమి? మద్భుజసనాథక్షోణి నేవేళలం
దు న్నేరంబులు చేయరా దెఱుఁగవా ధూర్తత్వమున్ భూమిభృ
త్సన్నాహంబు నొసర్చె దెవ్వఁడవు నిన్ శాసించెదన్ దుర్మతీ.

అని పలుకుచు దీనాననంబులై యున్నయా రెండింటిం గాంచి భయంబుపోవుమాటలం బెక్కింటిం బలికి వానిపై నా

బాణంబు ప్రయోగంబుసేయఁబూన వాఁడు రాజరూపంబువదలి వాడినమొగంబుతో భయవిహ్వలుండై కరంబులు సాచి ఆరాజు పాదంబుల శిరస్సిడి వధింపకు మహారాజచంద్రమా! వధింపకుము. అని ప్రార్థించెను. వానిం జూచి చంపనొల్లక యెక్కుడిన శరాసనంబు డించి పాపాత్మా తొలంగుము. ఆర్తత్రాణంబున కుపయోగించు నీవాడిబాణము దీనహననంబునకుం గడంగదు. నారాజ్యంబున నిలువకు మని ఆజ్ఞాపింప నాతం, డో రాజేంద్రా! నే నెందుండుదు. ఆనతిమ్ము. అనియె. రాజును వానికి ప్రాణివధ స్త్రీ ద్యూత పానంబు లనంబడు నాలుగుస్థానంబులం జూపెను. ఇంకను ప్రార్థింప సువర్ణమూలంబులగు ననత్యమదకాముహింసా వైరంబు లనుపంచప్రదేశంబుల నొసంగి యివి గాక యితర స్థానంబుల స్పృశింపవల దని యాజ్ఞచేసె. వృషభంబునకుఁ దప శ్శౌచదయలను మూఁడుపాదంబుల నొసంగె. భూదేవి కభయ దానంబున సంతోషంబుం గూర్చె.

ఇట్లు కలిని నిగ్రహించి ధర్మదేవతం గాపాడి భూదేవి కభయప్రదానంబుచేసి హస్తిపురంబున సుఖం బుండెను.

## పరీక్షిత్తునకు శృంగిశాపంబు గలుగుట

ఒక్కనాఁడు మృగయు లరుదెంచి మహారాజా! కాన నంబుల భయంకరమృగంబులు విచ్చలవిడిం దిరుగుచున్నయవి. మునుల కపారభయ మంకురించుచున్నదని విన్నవించిరి. పరీక్షిత్తును గాటంబగువేఁటతమకంబును మునులభయంబుం దీర్ప కుతూహలంబును బొంగ వారివెంటఁ జతురంగబలంబులం గూడి చనిచని మహారణ్యంబులం గ్రుమ్మరి మృగంబులం జంపిచంపి

క్షుత్పిపాసల నలయుచుఁ జల్లనినీరు దొరకునా ? యని కోరుచుఁ బోయిపోయి యొక తపోవనంబుం గాంచెను. అం దొకమహా ముని నియతుఁడై శాంతమూర్తియై పంచేంద్రియములను బహి రంగవీథులం బరుగిడనీక తపంబొనరించుచుండెను. జడ లాతని నావరించియుండెను. ఆమునిం జూచి జలపానముచేయఁ గోరి యున్నాఁడుగాన మాటరాక యొట్లో కష్టముమీఁద, ముని చంద్రా! తోయము లిందునందుఁ గానరావు; వేఁటాడి బడలి యున్నవాఁడను జలము లిప్పింపుమా, యని ప్రార్థించెను.

యోగనియతుండగుట నమ్మునివరునకు నీవార్త చెవుల సోఁకలేదు. కాన నూరకుండెను. ఆవిధ మెఱుంగక రాజు

ఉ. కన్నులు మూసి బ్రాహ్మణుఁడు గర్వముతోడుత నున్నవాఁడు చే
సన్నల నైన రమ్మనఁడు సారజలంబులఁ దెచ్చి పోయఁ డే
మన్నన నైనఁ జేయఁడు సమగ్రఫలంబులు పెట్టఁ డింత సం
పన్నత నొందెనే తపతపశ్చరణాప్రతిమప్రభావముల్. ౧౬ం-ప.

ఆ. వారిఁగోరుచున్న వారికి శీతల, వారి యిడుట యెట్టి వారికైన
వారితంబుగాని వలసిన ధర్మంబు, వారియిడఁడు దావా వారిగాఁడు.
౧౬౧-ప.

అని పలికి శ్రమజనితరోషమున ముని తన్నుం దిరస్క రించె నని తలంచి మృతసర్ప మొక్కటిఁ దచ్చటఁ బడియుండఁ దాని వింటికొపునం గొని వచ్చి వలయు నని యాతని మెడకుం జుట్టిపోయెను.

అంత నాచెంత నింతనంతఁ దిరుగుచున్న మునికుమారు లావిధంబంతయుం జూచి పోయి శృంగిం గాంచి,

క. నరగంధగజస్యందన, తురగంబుల నేలురాజు తోయాతురుఁడై
 పరఁగక సీజనకుని మెడ, నురగముఁ దగిలించి పోయె నోదక తండ్రీ.
 ౪౬౧-ప.

అని తెలిపిరి. మునికుమారులతో నాడుకొనుచున్న శృంగి శృంగంబుతోడి మూర్తిధరించినట్లు విజృంభించి యదరిపడి బల్యన్నంబుల భుజియించి క్రొవ్వినవాయసంబులవలె, ద్వారంబులం గాచికొనియుండు సారమేయంబుల చందంబున దాసభూతులగు క్షత్రియాభాసు లేరీతి బ్రహ్మమునులచేఁ దమకు సంరక్షకులుగ నియమింపఁబడిరి ? అట్టివారియింట నన్నం బెట్టు గుడువం దగియుండు ? అని పలుకుచు రోషావేశంబు నొంది,

ఉ. ఆడఁడు తన్ను దూషణము లాశ్రమవాసులఁగాని వైరులం
 గూడఁడు కందమూలములు గూడుగఁ దించు సమాధిచిత్తుఁడై
 వీడఁడు లోనిచూపు క్రియలను విష్ణునిఁ దక్కఁ బరప్రపంచముం
 జూడఁడు మద్గురుండు ఫణిఁ జుట్టఁగ నేటికి రాచవానికిన్. ౪౬౨-ప.

ఉ. హోము హిరణ్యదానములఁ బుచ్చుకొనంగ ధనంబులేమియుం
 జేము సవంచనంబులుగ దీవన లిచ్చుచు వేసరింపఁగా
 రాము వనంబులకా గృహవిరాములమై నివసింపఁ జెల్లరే
 పాముసు వైపఁగాఁ దగునె బ్రహ్మమునీంద్రధురార్ధశంబునన్. ౪౬౩-ప.

అనిపలికి బాలకులారా ! ఈరాజు దుర్వారగర్వమున విఱ్ఱవీఁగుచున్నవాఁడు. నాన శాపానలంబున వీని దహింపక విడువరాదు. చూడుం డని రోషించి కౌశికీనదికిం బోయి పాదప్రక్షాళనంబుఁ జేసి యాచమించి నియమంబున ధర్మరక్షకుండగు జగన్నాథుం దలంచి యందఱు వినుచుండఁగా గంభీరఘోషంబున

ఉ. ఓడక వింటికోపున మృతోరగముం గొనివచ్చి మాఱుమా
టాడకయున్న మజ్జనకు నంశతలంబునఁబెట్టి దుర్మద
క్రీడఁ జరించురాజు హరకేశవులొడ్డినఁ గావఁ జచ్చుఁబో
వేడవనాఁడు తక్షకఫణీంద్రవిషానలహేతిసంహతిన్. ౪౭౩-వ.

అని శపియించెను.

ఆర్యబాలకులారా! ఇందలితత్త్వమును ఆలోచింపుఁడు. శృంగియో బాలుఁడు. అతఁ డిచ్చినశాపమో హరకేశవు లడ్డపడినను జరగియే తీరవలసినది? అట్లే జరగెనుగదా? ఇట్టి శక్తి యీబాలున కెట్లుగలిగినది? కొంచె మూహింపుఁడు. కారణమును వినుఁడు. ఆకాలముననుండువారు సత్యసంధులు. వంచన మెఱుఁగరు. ధనాశాతత్పరులు గారు. ఐహికసుఖము లే ప్రధానము, ఆముష్మికసుఖ మన నేమో మన కేల యనునంతటి మూఢులును గారు. వారి కాధారము సత్యము, తపస్సు; కాన వారిమాట వజ్రమువలె నప్రతిహతమైనది. శృంగి తపంబొన రించి యంతటిశక్తి నెప్పుడు సంపాదించె నని ప్రశ్నింపకుఁడు. ఆతనితండ్రి శమీకముని. నియతస్వాంతుఁడు. తపోరాశి. సత్య మూర్తియే. అట్టిమహాముని యీతనికి నుపనయనకాలమున నుపదేశించెను. ఆమహనీయుని తపశ్శక్తి కొడుకునందుఁ గొంత సంక్రమించెను. కావున నట్టిశక్తి యాబాలునకు లభించెను. ఇఁక మనవిషయ మాలోచింతము. మనకు గురువులుగ నుండు వారు మనవంటివారే. చదువుమాత్రమే చెప్పఁగల్గుదురు. సత్య తపస్సులఁబాలించియవార్య నిరుపమాన తేజోవిరాజితులుగారు. కావున వారి కట్టియద్భుతశక్తులు లేవు. చక్కఁగా వాదింపఁ గలరు. ఉపన్యాసముల నీయఁగలరు. తపోనియతుల మాటల

చేతం జెప్పఁగలుగుదురు. అంతియకాని ఆచరించి 'యిదమిత్థ' మని నిర్వచింపఁజాలరు. కాన మన కట్టిశక్తి వారినుండి లభింప లేదు. ఇఁకఁ గథ వినుఁడు.

ఇట్లు శృంగి శపియించి తనతండ్రియాశ్రమమునకుం బోయెను. తండ్రి మెడనున్న యాసర్పంబుం గాంచి మిక్కిలివగచి దానిం దీయఁజాలక యెలుఁగెత్తి యేడ్చెను. ఆధ్వనివిని శమీక ముని నియమసమాప్తియగుటయు సమాధిఁ జాలించి మెల్లనఁ గన్నులు విప్పి కొడుకు నూఱడించి సర్పశవం బేల వచ్చె నని ప్రశ్నించుచు దానిం దీసివైచెను. శృంగి భయంబుడిగి వృత్తాంతం బంతయు నెఱింగించెను. ఆంగిరసుండగు శమీకుం డాశాపంబు నకు సంతాపించి నాయనా ? ఇట్టి బెట్టిదమగుశాపమునకుఁ దగిన యపరాధమా యిది ? తండ్రీ ! ఎంతపని చేసితివి ? అశ్వత్థామ శాపానలదగ్ధుఁడై కమలనాభునికరుణావిశేషమున మరలఁ బుట్టిన వాఁడు; ధర్మస్థాపకుఁడు. బలవంతుఁడై ప్రజల కాపదలు లేకుండు నట్లు పాలించుచున్న వాఁడు. ఇట్టిరాచపట్టిని దిట్టతనంబుగలవానిఁ దిట్టఁ దగునే ? ఇట్టికట్టడికార్యము నేలచేసితివి ?

ఉ. కాపరి లేని గొఱ్ఱియల కైవడిఁ గంటకచోరకోటిచే
  నేపరియున్న దీధువన మీశుఁడు కృష్ణుఁడు లేమి నిట్టిచో
  భూపరిపాలనంబు సమబుద్ధి నితం డొనరింపఁ జెల్లరే
  యీపరి పాటిద్రోహమున కిట్లు శపింపఁగ నేల బాలకా. ౪౦-౧-వ.

అని పరితపించి తపస్విజనుల కిది న్యాయముగా దని యాతనికి బుద్ధిచెప్పి శాపంబు గ్రమ్మఱింప శక్యంబుగా దని యూహించి కొడుకుచేసిన పాపంబునకుం గుంది తనశిష్యు నొకనిం బిలిచి

యావృత్తాంత మెల్ల నామహారాజున కెఱింగించి రమ్మని పంచి తననియమమును సాగించుచుండెను.

ఆశాపవార్త విని యభిమన్యుతనయుఁడు కామక్రోధాది విషయాసక్తుం డగు తనకుం దక్షకవిషాగ్ని విరక్తిబీజం బయ్యెఁ గదా యని తలంచుచుఁ గరినగరంబునకుం బోయి యేకాంతంబునఁ దాఁ జేసినమహాపరాధంబునకుం గుందుచుఁ బ్రతిశాపంబే ముని యీఁడగు నని తలంచుచు, రాజగర్వంబునకుం దగు ప్రాయశ్చిత్తమయ్యె నని సంతసించుచు

క. గోవులకును బ్రాహ్మణులకు, దేవతలకు నెల్లప్రొద్దుఁ దెంపునఁ గీడన్
గావించు పాపమానవు, లేవిధమునఁ బుట్టుదురొ యే చింతింతున్.

అని వితర్కించుచుండెను. తక్షకుం డేడవదినంబున శాపంబు నిర్వర్తింప వేచియుండెను. పరీక్షిత్తు సప్తమదినంబునఁ దనకుఁ దక్షకవిషాగ్నిజ్వాలామాలికల మరణంబు తప్ప దని యెఱింగిన వాఁ డౌట భూస్వర్గలోకంబుల భోగంబులు హేయంబులని తలంచి రాజ్యంబు విసర్జించి యాహారంబు మాని దీక్షఁబూని

మ. తులసీసంయుతదైత్యజిత్పదరజస్స్నానంబుకంటెన్ మహో
జ్జ్వలమై దిక్పతిసంఘసంయుత జగత్సౌభాగ్యసంధాయియై
కలిదోషావలినెల్లఁ బాపు దివిషద్గంగాప్రవాహంబులో
పలికిం బోయె మ్రియమాణుఁడగుచున్ బ్రాయోపవేశంబునన్. ౨౯-వ.

మనస్సు శ్రీగోవిందపాదారవింద పరవశతనొంద నొనరించి వసించెను. ఆవార్తనెఱింగి సకలలోకపావనమూర్తులు మహానుభావులు తీర్థంబునకుఁ దీర్థంబులొసంగంజాలు మహిమను గలవారు నగునత్రి, విశ్వామిత్ర, మైత్రేయ, భృగు, వసిష్ఠ,

పరాశర, చ్యవన, భరద్వాజ, పరశురామ, దేవల, గౌతమ, కశ్యప, కణ్వ, కలశసంభవ, వ్యాస, పర్వత, నారదప్రముఖు లగు బ్రహ్మర్షి దేవర్షి రాజర్షిపుంగవులును, కాండర్షు లైనయరుణాదులును అరుదెంచిరి. శిష్యప్రశిష్యులతోఁ గూడి యనుగ్రహసమగ్రులై దర్శనమిచ్చిన యామహాత్ముల నుచితరీతిఁ బూజం గావించి నూర్పుండంబ్రార్థించి యారాజసత్తముఁడు తనవృత్తాంతం బెల్ల నెఱింగించెను. మఱియు వినయంబున

ఉ. భూసురపాదరేణువులు పుణ్యులఁజేయు నరేంద్రులక్ ధరి
త్రీసురులార, మీచరణరేణుకణంబులు మేనుసోఁక నా
చేసినపాపమంతయు నశించెఁ గృతార్థుఁడనైతి నెద్దియోఁ
జేసిన ముక్తిపద్ధతికిఁ జెచ్చెరఁ బోవఁగవచ్చుఁ జెప్పరే. ౫౦౧-ప.

క. చూడుఁడు నాకల్యాణము, పాడుఁడు గోవిందుమీఁది పాటలు దయతోఁ
నాడుఁడు హరిభక్తులకథ, వేదహాములలోన ముక్తి కేగఁగ నిచటన్.

౫౦౨-ప.

అని ప్రశ్నించుచున్న యారాజచంద్రునితో మును లిట్లుపల్కిరి. రాజేంద్రా! నారాయణధ్యాన మొనరించు పవిత్రమానసుఁడవు. తత్కృపాపాత్రుఁడవు. నీకుఁ దప్పక ముక్తిలభించు నని పలుకుచున్న మునులతో నార్యవర్యులారా! నారాయణుకథావిశేషంబులం దెలిపి నన్నుం గృతకృత్యునిగాఁ జేయుం డని ప్రార్థించెను. వారందులకుఁ బ్రత్యుత్తరం బిచ్చుట కాలోచించుచుండఁగా,

## శుకమహర్షి వచ్చుట.

సీ. ప్రతిని మేషము పరబ్రహ్మంబు నీక్షించి మదిఁజొక్కి వెలుపల మఱచువాఁడు
కమలంబుమీఁది భృంగములకై పడి మోము పై నెఱిసిన కేశ చటులివాఁడు

గెఱవ్రాసి మాయ నంగీకరించినభంగి వసనంబుఁ గట్టక వచ్చువాఁడు
సంగిగాఁడని వెంటఁజాటుభూతములు నా బాలురహాసశబ్దములవాఁడు
తే. మిహితపదజానుజంఘోరు మధ్యహస్త బాహువక్షోగళానన భాలకర్ణ
నాసికాగండమస్తక నయనయుగళుఁడైన యవధూతమూర్తివాఁడరుగుదెంచె.

౧౯౬-వ.

ఇట్లు శుకమహాయోగి వచ్చుటయు నాతని ప్రభావంబు నెఱింగినవారుగావున నిజాసనంబులు డిగ్గి యమ్మునులెల్ల ప్రత్యుత్థానంబు చేసిరి. పాండవపౌత్రుండు నా యోగిశిఖామణికి నతిథిసత్కారంబులు చేసి నమస్కరించి కూరుచుండంజేసి, మఱియును వినయభక్తులు మనమునఁ బెనఁగొనుచుండఁగా

ఉ. ఫాలము నేలమోపి భయభక్తులతోడ నమస్కరించి భూ
పాలకులోత్తముండు కరపద్మములన్ ముకుళించి నేఁడు నా
పాలిటిభాగ్య మెట్టిదియొ పావనమూర్తివి పుణ్యకీర్తి వీ
వేళకు నీవు వచ్చితి వివేకవిభూషణ దివ్యభాషణా.

౧౨౧-ఉ.

మ. అవధూతోత్తమ! మంటి నేఁడు నిను డాయంగంటి నీవంటివి
ప్రవరుం జేర్కొనునంతటన్ భసితమా! పాపంబు నాబోఁటికిన్
భవదాలోకనభాషణార్చనపదప్రక్షాళనస్పర్శనా
దివిధానంబుల ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే.

౧౨౨-మ.

అని ప్రార్థించి సప్తదివసంబుల ముక్తికిం బోవుమార్గంబు చెప్పవే మహాత్మా! యని మఱిమఱి వేఁడెను.

ఇది ప్రథమస్కంధము.

---

# ద్వితీయస్కంధము

## శుకయోగి పరీక్షిత్తునకు బదులుచెప్పుట

పరీక్షిన్మహారా జిట్లు ప్రశ్నము చేయఁగా శుకయోగి యత్యంతాదరంబున నో మహారాజా! ఈప్రశ్న ముత్తమోత్తమము. ఆత్మవేత్త లెంతయును దీనికి మెత్తురు. ముక్తిఁబొందు మార్గంబుఁ దెల్పుట యీప్రశ్నమునకు నుత్తరంబగు. కావున శ్రద్ధాళు వగు నీకుఁ జక్కనిబదులు చెప్పెద. వినుము. ద్వైపాయన మహాముని నాతండ్రి బ్రహ్మసమ్మిత మగు భాగవతము నొనరించెను. దాని నాచేఁ బఠింపఁజేసె, దానిం జెప్పెద.

హరినామస్మరణసంకీర్తనాదులచేఁ బ్రాణి ముక్తిం బొందు. వేఱొం డుపాయంబు లేనే లేదు.

తరలము. హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుఁడై
పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికిఁ బోవనేర్చునె వాఁడు సం
సరణముం బెడఁబాయఁ డెన్నఁడు సత్య మాహరినామసం
స్మరణ మొక్కముహూర్తమాత్రము చాలు ముక్తిదమా నృపా. రా-ప.

పుణ్యమూర్తీ! ఖట్వాంగమహీపాని యొకఁడు పూర్వ ముండెను. బలశాలియగు నారాజునొద్దకు దేవత లరుదెంచి 'రాజా! దానవులు మమ్మోడించిరి. నీసాయమును గోరి వచ్చితిమి. మాకు రక్షకుండవు గమ్మా!' యని వేఁడిరి, రాజా దేవతలకొఱకు దివి కేఁగి యసురుల జయించెను. సురలు సంతోషించి వర

మడుగు మిత్తుమనిరి. దేవతలారా! ప్రీతులైన మీ మ్రొక్కొకటి వేఁడెద. నాజీవితకాల మెంత? చెప్పుఁడు. చాలు. ఇంకొక్క వరము నేనొల్ల. నా విని దేవతలు రాజా! నీకొక్కముహూర్త కాల మాయు స్సున్న దనిరి. రాజు భూతలంబున కరుదెంచి సకలైశ్వర్యముల నర్థుల కిచ్చి సర్వసంగవిముక్తుఁడై హరిని మనంబునఁ బదిలంబుగా నిలిపి రెండుగడియలలోఁ గైవల్యపదము నొందెను. కావున శ్రీహరికీర్తనంబునఁ బొంద నలవికాని పదంబు లేదు. నీకేడుదినంబులకుంగాని జీవితాంతంబు కాదు. ఇంతలో ముక్తికిం బోవునట్లు హరిధ్యానంబుచేయవచ్చు. కాఁబట్టి ధారణాత్మకయోగంబు నాశ్రయింపుము. శ్రీనారాయణుపాదారవిందముల డెందంబునఁ బదిలంబుగా నిలుపుము. ముక్తి కరతలామలకం బగు. అని ధారణనిలుపు నట్టిపద్ధతిం దెలిపి రాజా! సంసార సుఖంబు శాశ్వతం బని తలంపకుండునది. అట్లు నిశ్చయింపకున్నచో ముక్తిమార్గంబు చేకూరదు. తృప్తియుండుట ప్రధానము. వినుము.

సీ. కమనీయభూమిభాగములు లేకున్నవే పడియుండుటకు దూదిపఱుపులేల
సహజంబులగు కరాంజలులు లేకున్నవే భోజనభాజన పుంజమేల
వల్కలాజినకుశావళులు లేకున్నవే కట్ట మడూలసంఘంబులేల
గొనకొని వసియింప గుహలు లేకున్నవే ప్రాసాదసౌధాదిపటలమేల

తే. ఫలరసాదులు గురియవే పాదపములు, స్వాదుజలములనుండవే సకలనదులు
పొసఁగ భిక్షము పెట్టరే పుణ్యసతులు, ధనమదాంధుల కొలువేల తాపసులకు.

అనుబుద్ధిచే యోగియగుభక్తుండుండుఁ గావున సంసారబంధంబునకు వృద్ధికరం బగుశయ్యాశనాదివస్తుగణంబునం దాశ వదలి విరక్తుండవు కమ్ము.

అన విని శుకయోగితోఁ బరీక్షిత్తు 'మహాత్మా! భక్తి యోగంబుం దెల్పుమా' యని ప్రశ్నింప నాతం డిట్లని చెప్పె.

## భక్తియోగమును రాజునకు శుకయోగి తెలుపుట

రాజా విను:

మ. అమరేంద్రాభులఁ గొల్చుభంగి జనుఁ డా యబ్జాక్షు సేవింపఁగా
విమలజ్ఞానవిరక్తిముక్తు లావశ్యక్ చేయేల భూశాఖ త
త్కమలాధీశకథాసుధారసనదీకల్లోలమాలావరి
భ్రమ మెవ్వారికినైనఁ గర్ణయుగళీపర్వంబు గాకుండునే. ౪౦-మ.

వాసుదేవుని శ్లోకవార్త లాలకించు నతనియాయువుఁ దప్ప నితరులయాయుస్సును భానుం డపహరించుచుండు. దానిం దెలియక నేను జాలసంవత్సరములు జీవింతు నని మనుష్యుఁడు భ్రాంతినొందుచుండు. యమదూతలు కొనిపోయినతఱిఁ బుణ్యం బుచేయనైతిఁగదా యని విలపించు. కాఁబట్టి సర్వదా భగవన్నామసంకీర్తనంబు చేయుచు భగవద్దివ్యమంగళవిగ్రహమును మనస్సున ధ్యానించుచుఁ దాఁజేసిన, చేయుచున్న సుకృతకర్మముల భగవదర్పణము గావించుచుఁ నుండుభక్తుఁడు శాశ్వత కైవల్యమునొందు. అట్లుగాకున్న నామనుష్యుఁడు పశుతుల్యుఁడై తుది నరకముఁ బొందు. కావున,

సీ. విష్ణుకీర్తనముల వినికర్ణంబులు గొండలబిలములు కువలయేశ
చక్రిపద్యంబులఁ జదువనిజిహ్వలు కప్పలజిహ్వలు కౌరవేంద్ర
శ్రీమనోనాథు నీక్షింపనికన్నులు కేకిపింఛాక్షులు కీర్తియుత
కమలాక్షుపూజకుఁ గానిహస్తంబులు శవము హస్తంబులు సత్యవచన

ఆ. హరిపదతులసీదళామోద రతిలేని, ముక్కు పందిముక్కు మునిచరిత్ర
గరుడగమనుభజనగలిలేనిపదములు, పాదపములపాదపటల మనఘ. ౪౧-మ.

సీ. నారాయణునిదివ్యనామాక్షరములపైఁ గరఁగని మనములు కఠినశిలలు
మురవైరికథలకు ముదితాశ్రురోమాంచ మిళితమై యుండని మేను మొద్దు
చక్రికిమ్రొక్కని జడునియాఁడల నున్న కనకకిరీటంబు కట్టెమోపు
మాధవార్పితముగా మనిన మానవుసిరి వనదుర్గచంద్రికావైభవంబు
ఆ. కైటభారి భజన గలిగియుండనివాఁడు. గాలిలోన నుండి కదలు శవము
కమలనాభుపదము గననివాని బ్రదుకు, పసిఁడికాయలోని ప్రాణిబ్రదుకు.
౫౧-మ.

అని పలికిన విని రా జిట్లనియె. మహాత్మా! మీదివ్యబోధంబున మమకారంబు వదలె. ఇఁక భగవంతుని దివ్యచరిత్రంబును వినఁ గోరెద. హరి జగంబుల సృజించుట రక్షించుట సంహరించుట వినిపింపుము. మఱియు నామానసీయు నవతారవిశేషంబుల వివరింపుము. నావిని శుకయోగి భగవంతుని ధ్యానించి గురువందనంబుచేసి యిట్లనియె. రాజేంద్రా! వినుము. కల్పాదియందు విధాత తా నున్నకమలనాళమును జూడఁ గోరి యానళినంబు మొదలు గానక విసిగి క్రమ్మఱ యథాస్థానంబునఁ గూరుచుండి జగంబుల సృజించునిచ్ఛ పొడమఁగా దానిపద్ధతి మనంబునఁ దోఁపమి నూరక చింతించుచుండెను.

అత్తఱి జలంబుల నడుమనుండి తపశ్శబ్దము వినంబడియె. రెండుమాఱు లది వినఁబడఁగా నాశబ్దము నుచ్చరించిన పురుషుం డెవ్వఁడో యని తెలియంగోరి వెదకెను గాని యాతండు కనఁబడఁడయ్యె. వెదకి వెదకి మరలివచ్చి తనస్థానమునఁ గూరుచుండి నిశ్చలమనంబునఁ జిరకాలంబు తపం బొనరించెను. ఇట్లు వేయిదివ్యసంవత్సరములు తపంబుచేయఁగా భగవంతుఁడు పొడచూపెను.

బ్రహ్మ యంత వైకుంఠంబు గాంచి యందొక దివ్యసౌధం
బున లక్ష్మీసేవితుం డగు శ్రీమన్నారాయణుం గాంచి నమస్క
రించి స్తుతించినం బ్రసన్నుండై, పుత్రా! నీవాంఛితం బెఱింగిం
పుమా, యని పలుకుచు, విరించీ! నీతపంబునకు మెచ్చితి తపము
నాస్వరూపము. తపోవృక్షమునకు ఫలము నేనే. ఆతపస్సునకు
జననస్థిత్యుపసంహారముల నొసర్చువాఁడను నేనే. కాన తపము
నాభక్తికి మూలధనమని తెలిసి నీవట్లుచేసితివి కాన విగతమోహా
కర్షుఁడవై తివి. కావున నోసరసిజాసనా! నీమనోవాంఛిత మేది
యైన నిచ్చెదఁ గోరుమూ, యనియె. దాన మోదంబంది బ్రహ్మ
యానారాయణమూర్తిని సృష్టివిధానంబు తెలుపవే యని
ప్రార్థింప నాభగవంతుఁడు దాని నెఱింగించి యీరీతి సృజియింపు
మని యాజ్ఞయిడి నిజలోకంబుతో నంతర్ధానమొందెను.

బ్రహ్మయు నారాయణాజ్ఞానుసారము లోకసృష్టిని జేయం
దలంచి భగవంతుని ధ్యానించి తద్గతహృదయుండై యథా
పూర్వంబుగా లోకంబుల నిర్మించి యానందించుచుండ నారద
ముని యరుచెంచి తండ్రికి నమస్కరించి నీవు నన్నడిగినట్లే
ప్రశ్నించెను. బ్రహ్మ భాగవతంబంతయు నెఱింగించెను. ఆపద్ధతి
నీకుఁ దెలియ వినిపించెద. తొలుదొలుత దానికిం గలసంబంధ
మును వివరించెద.

ఇది ద్వితీయస్కంధము.

# తృతీయస్కంధము



## విదురుఁడు తీర్థయాత్రకుం బోవుట

రాజేంద్రా!

కురుపాండవులు కలహించుచుండఁగా విదురుఁడు ధృత
రాష్ట్రునితో దుర్యోధనుండు పాడితప్పి పాండవుల నడంపఁజూచు
చున్నవాఁడు కాన నాతనివిడనాడి కులంబుద్ధరింపుము. లేకున్న నీ
వంశంబు ధరణి నిలువంజాలదనియె. చెంత నున్న దుర్యోధనుం
డామాటలకుం గినిసి శకుని కర్ణదుశ్శాసనులు వినుచుండ విదు
రుఁడు దాసీపుత్త్రుఁడు, వీనిం గొప్పచేయుటచే నింతవుట్టె, వీనిం
బిలువ నేల? దాన నీతండు గర్వించి యొడలెఱుంగక ప్రేలెడు
ననియె. ఆమాటలకు విదురుండు కటకటంబడి కరినగరంబు
వదలి యాదవులకుం బోయి పుణ్యాశ్రమంబులఁ జూచుచు నెన్ని
యో దేశంబులుగడచి భూప్రదక్షిణంబు సేయునట్లుతిరుగుచుండ
నుద్ధవుండు కనఁబడియె. విదురుఁ డాతనిఁ గౌఁగిలించుకొని కుశల
ప్రశ్నపూర్వకంబుగా ద్వారకానగరవృత్తాంత మడిగెను. ఉద్ధ
వుండమ్మాటలకు బదులు చెప్పఁబూనెను గాని శ్రీకృష్ణవియోగ
మాతని కంఠంబును బంధించె. దానం గన్నీరునించి యెట్టకేలకు
శ్రీకృష్ణబలరామాదులు భూలోకంబు వదలుటయు, ధర్మము
నశించుచుండుటయుం జెప్పెను. అట్లు శ్రీకృష్ణమహిమమును
జెప్పుచు నాతనినిర్యాణంబు చెప్పునప్పుడు పూతనాదులకు ముక్తి

నొసంగినమహాత్ముండు కరుణానీరధి తనపాదపద్మముల నాశ్ర యించినవారికి ముక్తినొసంగుటయరుదా యని పలికెను. విదురుం డది యెట్లని యడిగెను. ఉద్ధవుండు శ్రీకృష్ణుండు బాల్య మున నొనరించిన క్రీడలం దెలిపి పూతనాదుల నుద్ధరించిన పద్ధతిని వివరించి విదురా! శ్రీకృష్ణమూర్తి మునిశాపంబున సకలయాదవులు నశింప బలరాముం డొకవృక్షమూలంబున నిలిచి దేహమును జాలింప నేను బరిపరివిధంబులం జింతించుచుం గృష్ణుం డెటనున్నవాఁడో యని వెదకుచుం బోయిపోయి యొకానొకతరుమూలంబుచెంత నాసీనుం డైనభగవంతునిం గంటిని. అత్తఱి మైత్రేయమహాముని యరుదెంచెను. మమ్మిద్ద ఱంగాంచి యామహనీయమూర్తి చేరం బిల్చి యాత్మస్వరూ పంబు నెఱింగించి నీకిఁకఁ బునర్జన్మంబు లేదు. ఉద్ధవా! సంసార సాగరంబు తరించితి వని యాజ్ఞయిచ్చె నని వివరించెను.

విదురుం డామాటల కానందపరవశుండై, మహాత్మా! నీవే యదృష్టవంతుఁడవు. నీయట్టిభాగ్యశాలి జగంబునం గలండే. సాక్షాత్కృష్ణభగవన్ముఖంబున నాత్మజ్ఞానవాక్యంబుల నాల కించితివి. ఇంతకన్న నేమి కావలయు? కావున నోకరుణా నీరధీ! ఆవాక్యంబుల నాకుం దెలిపి కృతకృత్యునింజేయు మని ప్రశ్నించెను. ఉద్ధవుండును సంతోషించి,విదురా! మైత్రేయుండు బ్రహ్మర్షి. ఆతండు నీకుఁ జెప్పఁగలండు. పోదమురమ్మని యాతనిం దోడుకొని పోయిపోయి భవభంగయు శుభాంగయు నగు యమునం దాఁటి బదరికాశ్రమమును జేరి దివిషద్గంగానదిం గాంచి యందు స్నానమొనరించి కృతకృత్యుఁడై యందొక్క నిర్మలశాలపులినతలంబున యమనియమాదియోగాంగక్రియా

నిష్ఠం బూని పద్మాసనాసీనుండై హరిపాదసరసీరుహవిన్యస్త చిత్తుండై బాహ్యేంద్రియవ్యాప్తిం బాయుచోలి సతతోపవాసంబుల డస్సి యున్న మైత్రేయుం గాంచెను.

ఇట్లుద్ధవవిదురులు ఆమహాముని గాంచి నమస్కరించి చేతులొగ్గి మహాత్మా! సంసారచక్రంబునం బరిభ్రమించు మూఢాత్ములం బశుప్రాయుల రక్షించుకొఱకుంగదా నారాయణ పరాయణులై మీవంటిపుణ్యాత్ములు లోకంబునం జరియింతు రని పలికిరి. విదురుండు వినయంబున.

క. మునినాథచంద్ర నను గై,కొని కాచుతలంపు బుద్ధి గూడినయేనిక్
వినుము మదీప్సిత మది నా,చనువున గావింపవయ్య సజ్జనతిలకా. ౧౮౩-వ.

ఆకోరిక యెయ్యదియన్నం దెల్పెద. త్రిగుణాత్మకమాయా నియంత యగుభగవంతుండు స్వతంత్రుండయ్యును అవతరించి ఏయేయవతారంబుల నేయేకర్మంబు లాచరించెను? నిష్క్రియుం డగునాపరమేశ్వరుండు మొదటం బ్రపంచంబు నెట్లు సృజించెను? ఎట్లురక్షించెను? ఆమహాత్ముని యవతారచర్యలను దద్భక్తాగ్రేసరులవర్తనంబులు దెలిపి నన్నుం గృతార్థుం జేయుమా! అని ప్రశ్నించెను.

మైత్రేయుండును విదురుం గాంచి యాతని ప్రశ్నంబునకు మిగుల సంతసించి యిట్లు పలికెను. పాపరహితా! శ్రీకృష్ణ కథాశ్రవణతత్పరుండవై నీవు న న్నడిగితివి. శుభస్కరంబగు ప్రశ్నమిద్దియే. నీవు భగవద్భక్తుండవు. కాబట్టి హరికథాశ్రవణ కుతూహలుండ వగుట విచిత్రంబు గాదు. ఇంతియ కాదు. నీవు మాండవ్యముని శాపంబున పాత్యవతేయువలన భ్రాతృక్షేత్రం బున శూద్రయోనిం బుట్టినయముండవు. పరమజ్ఞానసంపన్ను

డవు. కావున శ్రీకృష్ణుండు తననిర్యాణకాలంబున నే నాతని సన్నిధికిం బోవ నీకుపదేశింపు మని నాకెఱింగించినవిషయంబులు చక్కఁగఁ దెలిపెద నని మహదాదితత్త్వంబులస్థితియు, తత్సృష్టియు నెఱింగించి స్వాయంభువునాఁబడుమనువు ప్రజాభివృద్ధి సేసిన పద్ధతియుం దెలిపి, వెండియు నిట్లనియె.

స్వాయంభువమనువు భార్యాయుతుండై బ్రహ్మదేవు నకు మ్రొక్కి వినయవినమితోత్తమాంగుండై మా కెద్ది యాచరణీయము? ఏకర్మముచేసిన నీకు హితంబగు దాని వచింపుమా యనియె. బ్రహ్మయు సంతోషించి,

చ. మునుకొనితండ్రి యాజ్ఞఁ దలమోపి నిజోచితకృత్య మేమిషం
బునఁ దనశక్తియుక్తి చెడచేయక చేయుట పుండరీకలో
చనపదసేవచేయుట ప్రజాపరిపాలనశాలి యౌటయుం
జనకునకున్ సుతుండు పరిచర్య లొనర్చుట సువ్వె పుత్రకా. 3-౨౦-ను.

భగవంతుఁడు యజ్ఞమూర్తి కావున నాసర్వేశ్వరుమది నిల్పి యజ్ఞములు చేయుము. విష్ణుభక్తిలేక చేయుయజ్ఞములు నిష్ఫలములు. అట్టివానిం జేయకుము. వికారవిదూరుం డగు నారాయణుంగూర్చి విధివిహితముగా యజ్ఞముల నొనరింపుము దాన నీకును నీసంతానమునకును మేలుచేకూడును. అన విని స్వాయంభువుండు తండ్రీ! నాకు నివసింపఁ జోటులేకున్నది. యజ్ఞముల నెట్లుచేయుదురు. సకలభూతముల కాధారభూత మగు నీభూమి నీటిలో మునిఁగియున్నయది. కాన దాని నుద్ధరించునుపాయ మెఱిఁగింపుము.

అని ప్రశ్నించిన బ్రహ్మయు నాలోచించుచుండెను. అంతలో బ్రహ్మదేవునినాసికావివరమునుండియజ్ఞవరాహమూర్తి

యంగుష్ఠ మాత్రశరీరుండై వెలువడి యాకాశమున నిలిచి క్షణమాత్రమున నేనుఁగంతవాఁడయ్యెను. మౌను లచ్చెరు వందిరి. బ్రహ్మయు నాశ్చర్యపరవశుండై యుండ సూకరాకారుం డగునాభగవంతుఁడు ప్రళయజీమూతభయదభూరిగర్జనాటోప భిన్నదిక్కాండ మగుఘుర్ఘురారావమునుగావించెను. దానివిని మౌనులెల్ల వేదమంత్రంబుల స్తుతించిరి. అంతే నాయజ్ఞవరాహ మూర్తి జలంబుల మునింగియున్న భూమి నుద్ధరించెను. అనఁగా విదురుఁడు మైత్రేయునితో మహాత్మా! యజ్ఞవరాహమూర్తి హిరణ్యాక్షుం జంపె నని వింటి. ఆకథ నెఱింగింపు మని ప్రశ్నింప మైత్రేయుండుప్పొంగి విదురున కిట్లనియె.

## సనకసనందనాదులు వైకుంఠంబునకుం బోవుట

విదురా! వినుము. హిరణ్యాక్షహిరణ్యకశిపులవృత్తాంతమును వివరించెద. మున్ను బ్రహ్మమానసపుత్రు లగుసనక సనందనాదులు లోకంబులం గ్రుమ్మరుచు వైకుంఠమును జూడఁ గోరిపోయిరి. ఆలోకవైభవంబునుజూచి యచ్చెరువంది శ్రీనారాయణమూర్తిని సేవింప నాతని దివ్యమందిరంబునకుం బోయిరి. అందు ద్వారంబున జయవిజయు లనువా రిరువురు రక్షకులై భగవద్దర్శనార్థ మరుదెంచినవారిని సమయం బెఱింగి లోపలికిఁ బోనిచ్చుచు నసమయంబైన నడ్డుచునుండిరి. ఈసనకసనంద నాదులు వృద్ధులయ్యును బాలురవలె వారికిం గన్పడిరి.

ఆసమయము ఎవ్వరింగాని లోపలికి విడువఁగూడనిది గాన వీరినిఁగూడ సమయముగాదు. సుంత నిలువుం డని నిలువరించిరి. భగవద్దర్శనమునందలి తహతహపాటున వా రాగ్ర

హించి మీరు గర్వంబున మమ్మడ్డితిరి గాన మీరు భూలోకంబునఁ గామక్రోధలోభంబు లనుశత్రువులు బాధింపఁ బుట్టుఁడని శపించిరి. వారును నమస్కరించి తమతప్పు నొప్పుకొని క్షమింప బ్రార్థించిరి.

ఇంతలో నీవృత్తాంతంబంతయు దివ్యజ్ఞానంబున నెఱింగి భగవంతుం డచ్చటికి వేంచేసెను. సనకసనందనాదు లామహాత్మునిఁ బొగడి యవ్వల నీజయవిజయులను గాపాడుమని వేఁడిరి. నారాయణుండు వారితో మీరు రాక్షసులుగా జన్మించి నాకు శత్రువులై సర్వదా నన్నే స్మరించుచు నాచే మృతింగాంచి నా లోకంబునకుఁ జేరఁగలరు పొం డని యాజ్ఞాపించి యంతర్హితుం డయ్యెను.

ఆ జయవిజయులు మునులశాపంబు దురతిక్రమ మగుటయు, నారాయణునాజ్ఞయగుటయుఁ గారణంబులుగాఁ గశ్యపుని రెండవభార్య యగుదితికడుపునం బుట్టిరి. వారిజన్మకాలమున ననేకోత్పాతములు గానంబడియె. దేవతలు సంక్షోభించిరి. ఇట్లు వా రుదయించినంతఁ గశ్యపమహర్షియు, వారిం జూడంగోరి, నామకరణంబు చేయం దలంచి

చ. దితిజఠరంబునందుఁ దన తేజము ము న్నిడినట్టిపుత్రు న
ద్భుతచరితున్ హిరణ్యకశిపుం డను పేరఁ బ్రసూతివేళ నా
దితి మును గన్నయట్టి రవితేజుని గాంచవలోచనుండు నా
హితమతిఁ బేరు పెట్టి చనియెన్ నిజనిర్మలపుణ్యభూమికిన్. ౩౧౧-ప.

అంత నాతనయు లిర్వురు బ్రహ్మను దపంబున మెప్పించి యలభ్యవరంబులం బొందిరి. హిరణ్యకశిపుసోదరుం డగు హిరణ్యాక్షుండు గదాదండంబుం బూని యుద్దండబాహావీర్యం

బున నెల్లరజయింపం బూని దిగ్విజయయాత్రకు బయలు వెడ
లెను. ఎదురుపడినవారినెల్ల జయించుచు సముద్రంబునకు జొచ్చి
యందున్న వరుణునిం జూచి రణభిక్షయొసంగుమని యడుగ
నాతం డారాక్షసునిశక్తిప్రాభవంబులం దలంచి క్రోధం బుపసం
హరించి మెల్లన నాతనితో నిట్లనియె. దానవేంద్రా! నీతోఁ
బోర నేనెంతవాఁడను! యుద్ధవాంఛమాని యీజలంబుల నున్న
వాఁడ. నీతోఁ బోరఁజాల. నారాయణమూర్తితప్ప నితరు
లెవ్వరు నీతో మార్కొని పోరం జాలరు. ఆతండు వైకుంఠపురం
బున నున్నవాఁడు. ఇంకొక్కమాట వినుము.

ఉ. నిందకు నోర్చి యాజిమొన నిల్వఁగనోపక వీఁగిపాఱు నీ
పందలవెంటఁ బడ్డ మగపంతమె సర్వశరణ్యుఁ డైన గో
విందుఁడు దీర్చు నీపని వివేకవిహీన చనంగ నోపుదే
నందుల కేఁగు మాతఁ డమరారులఁ బోర జయించు నిచ్చలున్. ఉ.౨౩౯.

ఇంతియకాదు. ప్రతియుగంబున నాతం డవతరించి దుష్ట
నిశాటులఁ గీటడఁగించుచుండు,

ఉ. కావున నావిభుం దొడరి కయ్యము సయ్యమెఱుంగఁ జేసి ర
క్షోవర! నీభుజాబలము సొంపఱి మేదినిఁ గూలి సారమే
లావలి కాశ్రయంబగుదు వచ్చటి కిప్పుడ యేఁగుదేని నీ
చేవయుం లావు నేర్పడును జెప్పఁగ నేటికి మీఁదికార్యముల్. ఉ.౨౪౦.

అనియె. ఆమాటల కుదగ్రతరుండై మండిపడి యప్పుడ కదలి
వైకుంఠమునకుం బోవుచుండెను. త్రోవలో నారదుం డెదురు
పడి యెందుఁబోయెద వన నతండు తనవాంఛితంబుఁ దెలుప నార
దుం డో రాక్షసరాజా!

చ. గురుభుజుఁ డమ్మహాత్ముఁడు వికుంఠపురంబున నేఁడు లేఁడు భూ
భరము వహింప నాదికిటిభారముఁ దాల్చి రసాతలంబునం
దిరవుగనున్నవాఁ డచటి కేఁగఁగనోపుదు వేని యేఁగు మం
దరయఁగఁ గల్గు నీకు నసురాంతకుతోడి రణం బవశ్యమున్. ౩౦-వ.

ఆమాటలు చెవులుసోఁకఁగనే మండిపడి పద్మలోచను నెదిరింప నెప్పుడు పోరుదునా యనుకౌతుకంబు తన్నుం ద్వాఱపెట్టఁగా కాలదండంబుఁ దిరస్కరించు గదాదండంబు కరంబునం బూని త్రిజగద్భయంకరాకారంబుమీఱ రసాతలంబునకుం బోయెను.

## హిరణ్యాక్షుండు యజ్ఞవరాహముతోఁ బోరి మృతినందుట.

అంతకుమున్నే హిరణ్యాక్షు మృతినొందించు కుతూహలంబున యజ్ఞవరాహరూపంబు ధరియించియున్న శ్రీమన్నారాయణమూర్తి యాదనుజేంద్రుం గాంచి విలాసంబున,

సీ. తుదమొదళ్లు కుఁజిక్కఁ దునిసిపాఱఁగ మోరఁ
గులశైలములఁ జిమ్ముఁ గొంతతడవు
బ్రహ్మాండభాండంబు పగిలి చిల్లులుపోవఁ
గొమ్ములఁ దాటించుఁ గొంతతడవు
జలధులేమను లంక సంకులం బై యింక
ఖురముల మట్టాడుఁ గొంతతడవు
ఉడురాజు సూర్యుండు నొక్కమూలకుఁ బోవఁ
గుఱుచవాలముఁ ద్రిప్పుఁ గొంతతడవు

తే. గునియుఁ గుప్పించు లంఘించుఁ గొంతతడవు
నెగయుఁ ధరఁ ద్రవ్వు బొఱియఁగా నేపురేఁగి
దానవేంద్రుని గుండెలు తల్లడిల్లఁ
బంది మెల్లన రణపరిపంథి యగుచు. ౩౨-ప.

ఆయాకారమును జూచి దనుజవరుండు తల్లడిల్లియు ధైర్య
బవలంబించి నిలునిలు మని యదల్చి మార్కొనియెను. భగ
వంతుం డాతని మాటల కాగ్రహించి యాతనింగాంచి కన్ను
నుండి నిప్పుకణంబులు పడుచుండ,

మ. వినరా యోరి యమంగళాచరణ యుద్వృత్తిన్ ననున్ నీమది
న్ననయంబున్ వనగోచరం బగుమృగం బంచుం దలంతౌర నే
జెనయన్ వన్యమృగంబయాదు బలయై యేతెంచు నీబోటి యీ
శునకశ్రేణి వధింతు నేఁ డని మొనన్ సోఁకోర్చి వర్తించినన్ ఉ౹గి౹౧-౫

అనిపలికి తలపడియెను. ఇట్లిరువురు ఘోరంబుగాఁ బోరాడ
సాగిరి. గదాఘాతంబుల మిడుంగురులు సెదర నట్టహాసంబుల
భీకరంబులు చెలంగఁ గొంతసేపు సంగరంబు భేద మింత
యు లేక చేయుచుండిరి. భగవంతుం డగు నాదివరాహ
మూర్తి మించి యాతని నొప్పించి యాయసుకు మేను చించి
లోకంబు లౌ రాయన హిరణ్యాక్షునిం జంపెను. దేవత లానం
దపరవశులై పూలవానలఁ గురిపించిరి.

. కర్దమ ప్రజాపతి దేవహూతికి నభీష్టవరంబు లొసంగుట

అని వినిపించి మైత్రేయుండు విదురుం గాంచి నీతిశీ
విదా! హిరణ్యాక్షుని చరితంబు వినిపించితి. ఆవల వినుము
స్వాయంభువుండు చరాచరభూతంబులం బుట్టించె. అందు దేవ
హూతి యనుకన్యను కర్దమమునికిచ్చి వివాహంబుచేయ
నావనితామణి పార్వతి పరమేశ్వరుం గొల్చునట్లు కర్దమునిం
సేవించుచుఁ గ్రమంబున స్నానపానాదులయందు నిచ్ఛమాని
కృశించెను. ఇట్లు నిరంతర శుశ్రూషాపరాయణురాలగు నామెం
గాంచి లేమా! నీవొనరించు శుశ్రూషల కలరితి. వరము

గోర మిచ్చెద. దివ్యదృష్టియుఁ గావలయునేఁ బ్రసాదించెద. అన నామె యంజలిం గీలించి తొలుత కృశించిన నాయీ దేహంబు పుష్టినొంది సకలసుఖంబు లనుభవింప నలంతిగ నుండ వలయు. ఆవల యాచించెద. అనియె. ఆముని కడుం బ్రసన్నుండై సకలవైభవంబులం దులదూగునొక సౌధంబు నిర్మించి విమానంబును గల్పించెను. దేవహూతియు సకలాభరణభూషితురాలై యట్లున్నభర్తం గూడి చాలకాలము విహరించెను. కొంతకాలమునకు దేవహూతికిఁ దొమ్మండుగురుపుత్రిక లుద యించిరి. అంత గర్దముండు సన్న్యసింప నుద్దేశించెను. అది యెఱింగి దేవహూతి భర్తం జేరంబోయి యీపుత్రికలకుఁ దగినభర్తలం బ్రసాదించి నాకు జ్ఞానోపదేశము చేయంగల పుత్త్రునిం బ్రసాదింపుఁ డని ప్రార్థించెను. ఆమునియుఁ దొలుత సంతానము గల్గువఱకుఁగూడియుందునని వాగ్దానముచేసియున్న వాఁడు కావున నామెమాటల నాలకించి, దేవీ! నీగర్భంబున భగవంతుం డుదయించు. నియతవై యుండుమనియె. ఆమెయుఁ బతిమానతి జవదాఁటక వర్తింపఁ గొంతకాలంబునకు నారాయణమూర్తి కపిలనామంబున నాయింతికిం బుత్త్రుండై జన్మించెను. ఆకపిలముని తల్లి యడిగినప్రశ్నములకు సదుత్తరంబు లొసంగి తత్త్వజ్ఞానంబుం బ్రసాదించెను. మఱియుఁ బిండోత్పత్తి ప్రకారంబును, గర్భస్థుం డగుజీవుండు భగవంతుని స్తుతించుపద్ధతియుఁ దెలిపెను. అని విదురునకుం దెల్పి మైత్రేయుండు మఱియు నిట్లని చెప్పెను.

ఇది తృతీయస్కంధము.



# చతుర్థస్కంధము.

## దక్షునకు శివునితో విరోధంబు గల్గుట

విదురా!

కర్దమసంతానంబు నెఱింగించితి. ఇంక దక్షుం డను ప్రజాపతి చరితంబును వినుము. దక్షునకుఁ బుత్రికాసంతానము గలదు. దేవవరులెల్లరు, మహర్షులును వారలం బెండ్లియాడిరి. ఈశ్వరుని భార్య యగుసతీదేవియుఁ బతిభక్తిరతయై యుండెను. సత్రయాగ మొకచో జరగుచుండ దక్షాదు లచటికి వచ్చిరి. దక్షాదులు ప్రజాపతులుగాన వారిరాకం గాంచి సదస్యులంద ఱును లేచిరి. బ్రహ్మయు నీశ్వరుండును లేవకుండిరి.

దక్షుఁ డంతట భక్తితో బ్రహ్మకు నమస్కరించి దేవత లొసంగినపూజలను గైకొని తనరాకం గాంచియు లేవకున్న యీశ్వరుంగాంచి నిప్పుకణంబులు కన్నులనుండి పడుచుండఁగా నచ్చటివారందఱి కాపురాంతకుం జూపి, దేవతలారా! మోహ మత్సరములతో నేఁ బల్కుటలేదు. వినుఁడు. ఈశ్వరుఁ డీతఁడు దిక్పాలయశోహానికరుఁడు. సజ్జనాచరితమార్గం బీతనిచే నశింపఁ జేయఁబడిరి. సిగ్గుకూడ నీతనికి లేదు. సావిత్రీసమానయగు నాతనయను బతివ్రతను మర్కటలోచనుఁ డీతఁడు సకలముని సురసమక్షమునఁ బెండ్లియాడి శిష్యభావంబుఁ బూనినవాఁడు. అట్లయ్యు నేఁ రాఁగాఁ బ్రత్యుద్గమాభివందనములు సలుపకున్న

మానెఁ గాని నన్నుఁ గాంచి నోటిమాటలనైనఁ బల్కరింపరాదా? వాని కేమికొదువ గల్గెను? మఱియు,

సీ. అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మాన హీనుఁడు మర్యాద లేనివాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు దిగంబరుఁడు భూతప్రేత పరివృతుండు
దామస ప్రమథభూతములకు నాథుండు భూతిలిప్తుం డస్థిభూషణుండు
నష్టశౌచుండు నున్మదనాథుఁడును దుష్టహృదయుఁ డుగ్రుఁడును బరేతభూని

తే. కేతనుఁడు వితతస్రస్తకేశుఁ డశుచి
యయినయతనికి శివనామ మను ప్రవాద
మెటులుగలిగె నశివుఁ డగు నితని నెఱిఁగి
యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చినటులు. ౪౪-వ.

నాకుమాఱిత నిచ్చితి. ఏమిచేయవచ్చు? అని యిట్లు ప్రతికూలవచనములు పలికి యంతకంత కుప్పొంగు క్రోధంబును బట్టఁజాలక శపియించుకాంక్షచే జలంబులు కరంబులం గొని యెల్లరు వినుచుండఁగా ఈశ్వరు నుద్దేశించి,

క. ఇతఁ డింద్రోపేంద్ర పరీవృతుఁడై మఖసమయమున హవిర్భాగము దే
వతలం గూడఁగ మహితని,యతిఁబొందక యుండుఁగాకయని శపియించెన్. ౪౫-వ.

ఇట్లు శపియించిన దక్షునిం గనియు నీశ్వరుం డూరకుండెను. సభ్యులెల్ల రతని నిందించిరి. దానఁ గోపం బినుమడింప నాతం డింటికిం బోయెను.

ఇట్లు దక్షుం డీశ్వరుని శపించినవార్త విని నందికేశ్వరుం డాగ్రహంబున నిట్లనియె. ఈదక్షుండు మర్త్యశరీరంబు శ్రేష్ఠంబుగాఁ దలంచి యప్రతిద్రోహి యైనభగవంతునందు భేదదర్శియై యపరాధంబు గావించెను. ఇట్టి మూఢాత్ముండు తత్త్వ

విముఖుం డగు. మఱియుం గూటధర్మంబు లయినవివాసంబుల గ్రామ్యసుఖకాంక్షలం జేసి సక్తుండై యర్థవాదంబు లయిన వేదంబులచే నష్టమనీషం గలిగి కర్మతంత్రంబు విస్తృతంబు చేయు. ఇంతియకాక దేహాదికం బుపాదేయంబులుగాఁ దలఁచుచు బుద్ధిచేత నాత్మతత్త్వంబు మఱచి వర్తించుచుఁ బశుప్రాయుండై స్త్రీకాముకుండు నగు. ఇదియుంగాక దక్షుం డచిరకాలంబున మేషముఖుం డగు. ఇంతియకాదు,

మ. అనయంబున్ దనమానసంబున నవిద్యన్ ముఖ్యతత్త్వంబుగాఁ
గని గౌరీశుఁ దిరస్కరించిన యసత్కర్మాత్ము నీదక్షునిన్
అనువర్తించినవాఁడు సంసరణకర్మారంభుఁ డై నిచ్చలున్
జననం బందుచుఁ జచ్చుచున్ మరల నోజం బుట్టుచున్ వర్తిలున్. ౪౯-ప.

మఱియును మహేశ్వరద్వేషు లైనద్విజు లర్థవాదబహుళంబు లైనవేదవాక్యంబులవలన మధుగంధసమం బైనచిత్తక్షోభంబుచేత విమోహితమనస్కులై కర్మాసక్తు లగుదురు. మఱియును భక్ష్యాభక్ష్యవిచారశూన్యులై దేహాదిపోషణంబు కొఱకు ధరియింపఁబడిన విద్యాతపోవ్రతంబులు గలవారలై ధనదేహేంద్రియంబులయందుఁ బ్రీతిం బొంది యాచకులై విహరింతురు.

ఇట్లు నందికేశ్వరుండు బ్రాహ్మణజనంబుల శపియించిన విని భృగుమహాముని మరల శపింపం బూని,

తే. వసుధ నెవ్వారు ధూర్జటివ్రతులు వారు, వారికనుకూలురగుదు రెవ్వారువారు
నట్టి సచ్ఛాస్త్రపరిపంథు లైనవారు, నవనిఁ బాషండు లయ్యెద రని శపించె.

౫౦-వ.

ఇట్లిరువు రన్యోన్యశాపపరాభూతులయ్యు భగవదనుగ్రహంబు గలవార లగుటంజేసి నాశంబు నొందకుండిరి. ఈశ్వరుం డంతయు లోఁడలంచుచు అనుచరసమేతుఁడై నిజనివాసంబునకుం బోయెను. బ్రహ్మయు నాయజ్ఞంబును బూర్తి నొందించి కృతకృత్యుం డయ్యెను.

## దక్షప్రజాపతి యజ్ఞముచేయుట, సతీదేవి యచ్చటికిఁ బోఁగోరుట.

తర్వాత దక్షశంకరులకు విరోధంబు వృద్ధినొందుచుం డెంగాని తగ్గదయ్యె. కొంతకాల మిట్లు గడచెను. అంతట దక్షుండు రుద్రవిరహితం బగుయజ్ఞము చేయుపకుకట్టి ప్రజాపతిత్వగర్వంబున నీశ్వరాదుల ధిక్కరించి యరుద్రకంబుగా వాజపేయసవనంబు గావించి యావల బృహస్పతి సవననామకంబైనమఖంబు చేయం బ్రయత్నించెను.

ఆయజ్ఞంబు చూచువేడుక గల యాతనికుమారితలు తమభర్తలం గూడి యచ్చటికిం బోవుచుండిరి. వారినెల్ల నాతఁడు సమాదృతిం బిలిచియుండెను. దక్షతనయయు నీశ్వరుభార్యయు నగుసతీదేవి యాకసంబున విమానంబులతోఁ బోవుచు దేవతలు తండ్రియజ్ఞమహిమను గొనియాడుట విని యాకసమువంకం జూడ సురకిన్నరగంధర్వాంగనలు సకలాభరణభూషితాంగవిరాజితలై పోవుచుండం గాంచి ఈశ్వరునితో నిట్లు పలికెను. ప్రాణేశ్వరా! నాతండ్రి యజ్ఞముచేయు చున్నాఁడఁట. వింటిరే. ఆమఖ్వరముచు గాంచుకోరికల నిదిగో సురగంధర్వాదులు తమతమకాంతలం గూడి యరుగుచున్న

వారు. నాకును బోవలయు ననువేడుక జనించుచున్నయది. నాతోఁబుట్టువులంద అచటికి వత్తురు. ఒక్కచోట నందఱం జూచి నట్లగును. కాన నినుంగూడి యచటికిం బోయి పారిబర్హక సంజ్ఞగల భూషణములం గైకొనఁ గోరికపుట్టెడు. మహేశ్వరా! సకలబ్రహ్మాండములు భవన్మాయానిర్మితంబు లగుట నీకు నాశ్చర్యకరంబుగాకున్నను భవతీయతత్వం బెఱుంగక స్త్రీస్వభావంబు*లిగి కృపణురాల నగునేను నాజన్మభూమిం జూడఁ గోరితి. ఈనా కాంక్షితమును సఫలమగునట్లు చేయుమా యని ప్రార్థించెను.

భగవంతుండు సర్వజ్ఞుండు. సర్వసాక్షి. సర్వసముఁడు. అయినను ఆకాలమున నామెమాటలకు బదులుచెప్పంబూని తనయసమ్మతిం జూపఁబూని, కాంతాతిలకమా! నీవన్నమాట నిశ్చయమే. బంధువులయిండ్లయందు జరగు శుభమహోత్సవములకుఁ బిలువకున్నను బోవలసినదే. కాని యది యకృత్రిము లగుజనులయెడ నుపయోగింపఁదగు తంత్రము. నీతండ్రి సజ్జనుఁడుకాఁడు. దుర్మతి. గర్వి. కావున మన మటకుం బోరాదు. పోయినచో నవమానము తప్పక కల్గును. నీవు ప్రియ పుత్రిక వయ్యును నాకుఁ బత్నివగుటం జేసి పిలువఁబడక పోయితివి. కాన నాయం దున్నక్రోధము నీయందు నాతని కుండక పోదు. నిన్న వమానించును. నేను రాను. నీవు పోవలదు. పోయితివా యప్రియంబు వాటిల్లు, నావిని యామె మనంబున నేమేమో యనుకొనుచు వెడలిపోయెను.

ఇట్లు సతీదేవి ప్రయాణము సాగించుటెఱింగి ప్రమథ గణములలోఁ గొందఱు వెంటఁబోయిరి. వారు వెంటరా నాసతి

పోయిపోయి తండ్రి యజ్ఞశాలం గాంచి లోపలఁ బ్రవేశించెను. ఆమెం గాంచియుఁ గాంచనట్లు తండ్రి యూరకుండెను. పలుక రింపనితండ్రి భావ మెఱింగి తక్కినతోఁబుట్టువులు నట్లె యూర కుండిరి.

## సతీదేవి దేహత్యాగముచేయుట

ఇట్లాసతీదేవి తండ్రి చేతను, దోఁబుట్టువులచేత నవమా నింపఁబడి యీశ్వరోక్తి మనంబునం దలంచి తండ్రీ! పరమే శ్వరు సామాన్యుంగాఁ దలఁచి యట్లు నిందించితివి. అంతియ కాక పిలువకున్నను వచ్చిన నన్ను నిట్లవమానించితివి. నీ కీశ్వర తత్వ మించుకయుఁ దెలిసినది కాదు. ఇది నీ ప్రాగ్జన్మపాపఫలమే యనకతప్పదు. వేదనుతుండై ప్రపంచమూలకారణంబన నలరు భగవంతుని పరమేశ్వరుని నీవు జామాతృబుద్ధిచే సామా న్యుంగాఁదలఁచుటకన్న నవినీతి మఱేముండును? ప్రేతభూచరుఁ డను లోనగుదురుక్తుల నిందించితివి. మహర్షు లట్లు శంకరుం దలంపరు. కావున,

చ. వెలకొని ధర్మపాలనవినిర్మలు భర్తఁ దిరస్కరించున
క్కలుషునిజిహ్వఁ గోయఁదగు గాకటు చేయఁగ నోపఁడేని దాఁ
బొలియుంట యొప్పు వెంటికిఁ బ్రభుత్వము చాలమిఁ గర్ణ రంధ్రముల్
బలువుగ మూసికొంచుఁ జనఁ బాడి యటందురు ధర్మవర్తనుల్. ౯౦-వ.

మ. జనుఁ డజ్ఞానమునన్ భుజించినజుగుప్సంబైనయన్నంబు చ
య్యన వెళ్లించి పవిత్రుఁడైనగతి దుష్టాత్ముండవై యీశ్వరున్
ఘను నిందించిననీతనూభవనసంగా నోర్వ నీ హేయభా
జనమైనట్టి శరీరమున్ విడిచి భాస్వచ్ఛుద్ధిఁ బాటిల్లెదన్. ౯౧-వ.

అని యిట్లా దేవి యనేకభంగులం బలికి యాశరీరంబు పాయుట కన్న నుత్తమమార్గంబు వేఱొండు లేదని నిశ్చయించి యుదఙ్ముఖియై యాచమనంబు చేసి మౌనంబు ధరియించి పరమేశ్వరుండె తనకు జన్మాంతరమున భర్తయగుంగాక యని తలంచుచు యోగమార్గంబున ననలును ద్దీపింపఁజేసి యొకక్షణంబున భస్మమయాంగియై చనియె.

సతి మృతినొందుటం గాంచి యామె యనుచరు లగు ప్రమథగణములు గదాఖడ్గాదిసాధనంబులం దాల్చి దక్షుపైఁ గవియ మహాక్రోధంబున భృగుమహాముని యాభిచారక హోమంబుచేయ ఋభునామకదేవత లుదయించి వారలం బాఱందోలిరి. వారును కైలాసంబున కరిగిరి.

నారదుం డావార్తను శంకరున కెఱింగించెను. ఈశ్వరుం డామాటల నాలకించి గర్వితుం డగు దక్షుని విడుచుట పాడి గాదని యూహించి మహాగ్రహంబున సంరంభించి,

శా. ఆద్యుం డుగ్రుఁడు నీలకంఠుఁ డిభకృత్త్యారాతి దష్టోష్ఠుఁడై
మాద్యద్భూరి మృగేంద్రఘోషమున భీమప్రక్రియ న్నవ్వుచున్
విద్యుద్వహ్నిశిఖాసముచ్చయరుచిన్ వెల్గొందుచంచజ్జటిన్
సద్యఃక్రోధముతోడఁ బుచ్చి వయిచెన్ క్ష్మాచక్రమధ్యంబునన్. ౧౦౫

## వీరభద్రుఁ డుదయించి దక్షునియజ్ఞమును బాడుచేయుట

ఇట్లు జటను భూమిపై వైవఁగా నందుండి భయంకరాకారముగల యొకమహాపురుషుం డావిర్భవించెను. ఆతఁడే వీరభద్రుఁడు. రెండవరుద్రుఁడనందగువాఁడు. ఇట్లుదయించి తండ్రీ, యేమిచేయవలయు నాజ్ఞయిమ్మని వేఁడెను. అపుడు శంకరుండు!

చ. గురుభుజశౌర్య భూరిరణ కోవిద సద్భట కోటి కెల్ల నీ
వరయ వరూథినీవరుఁడవై చని యజ్ఞముఁగూడ దక్షునిన్
బరువడిఁ ద్రుంపు మీ వచటి బ్రాహ్మణతేజ మజేయమంటివే
నరిది మదంశసంభవుఁడ వై తగు నీకు నసాధ్య మెయ్యెడన్. ౧౦౯-వ.

అని యాజ్ఞాపించెను. ఇట్లు వీరభద్రుఁ డీశ్వరాజ్ఞ శిరంబున ధరియించి యీశ్వరునకుఁ బ్రదక్షిణం బొనరించి నిశితశూలముఁను గేలనంది దక్షునియజ్ఞస్థలంబునకుం బోయెను. రుద్రపార్షదు లాతనిం గలిసికొని మఖశాలం బ్రవేశించి బహుభంగుల ధ్వంసము గావించిరి. సూర్యునకు సందడిలో దంతములు డుల్లుటయు భృగుమునికి శ్మశ్రుపాతము నింకను మిగిలినవారికిఁ గావలసినప్రాయశ్చిత్తములు చక్కఁగా నెఱవేఱెను. దక్షునిబట్టి వీరభద్రుండు కంఠము నఱికి హోమము చేసెను. తక్కినవారు గాలికి బుద్ధిచెప్పి యెటకో పరుగిడిరి. వీరభద్రుండు పనిముగియుటంజేసి మరలి కైలాసంబునకుం బోయెను. ఆయజ్ఞమునకు నారాయణుండు బ్రహ్మయు రారైరి.

## బ్రహ్మాదు లీశ్వరుం బొగడుట

అంతట దేవత లీవార్తను బ్రహ్మకుం దెలుప నాతండు వారలదుఃఖమును మాన్పి వారిం దోడ్కొని కైలాసంబునకుం బోయి శంకరుని బహుభంగులం బొగడెను. అందుల కానందించి మరలఁ జచ్చినవారి బ్రదికింపందలంచి శంకరుండు దక్షుం డజముఖుం డగుననియె.ఇతరుల కట్లైవారివారికిందగినట్లు వరము లిచ్చెను. బ్రహ్మయు సామహేశ్వరుం బ్రార్థించి తోడ్కొని తానును దేవతలును దక్షుని యజ్ఞవాటమునకుం బోవ దక్షుం

డజముఖుండై లేచి యాశ్వరుం బొగడి బ్రహ్మాదుల గారవించి యీశ్వరునకు హవిర్భాగంబొసంగి యజ్ఞమును సాంతముగావించెను. అప్పటికి విష్ణుమూర్తియరుదేర దక్షాదు లమ్మహాత్ముని బహుంభంగుల స్తుతియించిరి. అని మైత్రేయుండు విదురునకుం జెప్పి శ్రీనారాయణభక్తుం డగు నొక బాలకునిచరిత్రంబుఁ జెప్పెద విను మని యిట్లు చెప్పెను.

## ధ్రువునిచరిత్రము

శ్రీకృష్ణభక్తాగ్రేసరా! బ్రహ్మకు స్వాయంభువుమను వుదయించెను. ఆయనభార్యయగు శతరూపకుఁ బ్రియవ్రతోత్తానపాదు లను నిరువురుకొడుకు లుదయించిరి.

అందుత్తానపాదుండు ప్రసిద్ధిగాంచెను. ఆరాజునకు సునీతియు సురుచియు నను నిద్దఱుభార్యలు కలరు. సునీతికి ధ్రువుం డనుకొడుకు పుట్టె. ఆభార్య రాజునకుఁ బ్రియపత్నిగాకుండెను. రెండవభార్యయగుసురుచి ప్రియపత్నియై యుండెను. ఆమెకు నుత్తముఁ డనుకొడుకు పుట్టెను.

రా జొకనాఁడు కొలువుకూటమున సింహాసనముపై నుండఁగా ఉత్తముఁ డను చిన్నభార్యకొడుకు చేరఁబోయెను. వానినెత్తుకొని ముద్దాడుచుండెను. ధ్రువుండును తండ్రితొడ నెక్కఁబోవఁగా నుత్తానపాదుఁ డాతని నెత్తుకొని ముద్దాడక యూరకుండెను. అది చూచి సురుచియు మొదటనే గర్వించి యుండునది కాన మఱింతగర్వమూని సవతికొడుకైన ధ్రువుని జూచి,

తే. తండ్రి తొడ నెక్క వేడుక దగిలెనేని
పూని నా గర్భమున నాఁడు పుట్ట కన్య
గర్భమునఁ బుట్ట కోరినఁ గలదె నేఁడు
జనకు తొడ నెక్కు భాగ్యంబు సవతి కొడుక. ౨౧౯-ప.

క. అదిగాక నీవధోక్షజు పదపద్మము లాశ్రయింపు పాయక హరి నా
యందరమునఁ బుట్టఁజేయును వదలక యట్టైన మనము వడసెద వనఘా. ౨౨౦-ప.

అని యిట్లు వినరాని మాట లాడెను. ఆపలుకులు ములుకుల వలె మనమున నాటి బాధింపఁగా తండ్రి యుపేక్షించుట కెంతయుఁ గుంది దుఃఖాంబురాశిలో మునుఁగుచు దండతాడిత సర్పంబుభంగి రోషకలితుండై కన్నీరు మున్నీరుగా స్రవించుచుండఁ దల్లికడకుం బోయెను. తల్లియు నట్లు వచ్చినపుత్రునిం గాంచి తొడలపై నిడుకొని ఆవృత్తాంతంబంతయు నందున్న దాసీజను లెఱింగింప నిట్టూర్పులు పుచ్చుచుఁ గొడుకుం జూచి నాయనా! పెనిమిటి నన్ను భార్య యని భావింపకపోయిన మానెఁగాని దాసియనికూడ భావింపకున్న నావంటి దౌర్భాగ్యురాలి కడుపునఁ బుట్టితివి గాన సవతి యిట్లు పలుకుట మంచిదే. ఆమె చెప్పినట్లు శ్రీహరిపాదపద్మముల నాశ్రయింపుము. ఆశ్రీహరి తప్ప నొరుఁడు శరణంబు లే దని హిత ముపదేశించెను.

ధ్రువుఁడును జననీవాక్యముల విని తన్నుఁదాన నియమించుకొని పురంబు వెడలి పోవుచుండఁగా నారదుం డెదురుపడి తద్వృత్తాంతంబంతయు దివ్యదృష్టి నెఱింగి పాపనాశనదక్షుం బగు తనదక్షిణాకరంబున నాతనిశిరం బంటి మానభంగంబునకు సహింపని క్షత్రియుల ప్రభావం బద్భుతంబుగదా యని

యూహించి వత్సా! సకలసంపత్సమృద్ధం బగు నగరంబు వెలువడి యుండేఁగెదవు? స్వజనకృతావమానసంతప్తుంగా నిన్నుం దలంచెద.

అనిన ధ్రువుండు నారదునితో, మహాత్మా సపత్నిమాతృ వాగ్బాణక్షతంబగు వ్రణంబును భగవద్ధ్యానరసాయనంబున మాపుకొనం బ్రయత్నింపఁబోయెద, నన నారదుం డిట్లుపల్కెను.

బాలకా! నీవు కడుం జిన్నవాఁడవు. క్రీడలం దేలుచుండు నీయీడున నీ కవమానమానములు లేవు. కాన నోర్మియుం డుము. తల్లి చెప్పినరీతి భగవంతునారాధింతు నంటివేని అది చాలకష్టమగుపని. యోగీంద్రు లెంతోకాలంబు శ్రమంపడు దురు. అప్పటికిని లభింపకున్న బహుజన్మములం బ్రయత్నింతురు. అట్లుచేసియు నాభగవంతునిమార్గము కనుంగొనం జాలరు. కాన నతఁడు దురారాధ్యుఁడు. ఇట్టినిష్ఫలోద్యోగమును మానుము. అని బోధించెనుగాని యాతనిపట్టుదల తగ్గదయ్యెను. ఆవిషయం బెఱింగి హర్షించి నారదుండు, వత్సా! నిన్నుం బ్రేరేపించిన వాఁడు భగవంతుఁడుగాని మఱొకరు గారు. అని తపోనియ మంబులం దెలిపి నీవు యమునాతీరమున నున్న మధువనంబునకుం జనుము. ఆవనము పరమపవిత్రమైనది. ఆనదిం గ్రుంకి నిష్ఠతో నీమంత్రంబు జపియింపు మని వాసుదేవమంత్రం బుపదేశించి పూజావిధానంబుం దెలిపి యంతర్హితుం డయ్యెను.

ధ్రువుండు నారదోక్తప్రకారంబ మధువనంబునకుం బోయి తపం బొనరించుచుండెను. ఆయుగ్రతపంబునకు దేవతలు భీతిల్లి నారాయణున కెఱింగించి సత్వరంబుగ నాతనికోర్కిఁ దీర్పవే యని వేఁడిరి. నారాయణుండు ధ్రువునకుం బ్రత్యక్షం

బయ్యెను. ధ్రువుం డామహనీయమూర్తికి నమస్కరించి స్తుతి సేయనసమర్థుండై యూరకుండెను. ఆవిధంబెఱింగి తనశంఖంబున నాబాలకుని కపోలతలంబంటిన నాతండు దివ్యజ్ఞానసంపన్నుండై భగవంతుని వేదవాక్యంబుల వినుతించెను.

ఆస్తుతులకుం బ్రీతుండై, నారాయణుండు వత్సా! జ్యోతిశ్చక్రంబునందు శాశ్వతంబగుపదంబు నీకొసంగితి. నాని నిరువదియాఱువేల సంవత్సరములు గడువంగాం బొందంగలవు. అంతవఱకురాజ్యంబు ధర్మంబునం బాలింపుము. నీయనుజుం డగు నుత్తముండు మృగయార్థంబు వనంబులకుం జని మృతుం డగు వాని వెదకుచుంబోయి వానితల్లియు దావపావకున కాహుతి యగు. నీవు నన్ను యజ్ఞంబుల నారాధింపుము. అని పలికి యదృశ్యుం డయ్యెను.

ధ్రువుండు సంతృప్తి నొందక పురంబున కరుగుచుండ ముందఱ నారదుం డాతనిరాక ఉత్తానపాదునకుం దెల్పెను. ఆతం డానందించి ధ్రువు నెదుర్కొని గాఢాలింగనపూర్వకం బుగా శిరస్సు మూర్కొని మన్ననలం దన్పెను. ధ్రువుం డెల్ల రకు నమస్కరించి సోదరు నాదృతిం గాంచి పౌరులకెల్ల నానం దంబు గల్గించెను.

అంత నుత్తానపాదుం డాతనికి రాజ్యంబు నప్పగించి వృద్ధుండగు తన్నుం దానెఱింగి వనంబునకుం జనియె. ధ్రువుండు రాజ్యంబును బూజ్యభంగి నేలి యుత్కలనామకుండగు పుత్రుని, నలిమనోహరాంగియగు కన్యారత్నంబుం గనియె. ఆతనిసోదరుం డగు నుత్తముండు వివాహంబు లేకుండ మృగయార్థంబు వనం బునకుం జని యందు యక్షునిచే హతుండయ్యెను. ఆదుఃఖంబున

నాతనితల్లియు నడవులకుం బోయి దావపావక పరివృతరై మృతిం బొందె.

ధ్రువుండు నారాయణాజ్ఞానుసారము రాజ్యంబుం బాలించి భగవత్పూజాతత్పరుండై ధ్రువంబగు పదంబు నొందె. అని మైత్రేయుండు తెల్పిన విని విదురుండు మునీంద్రా! భగవద్భక్తుండగు నంగభూపాలునకు దుష్టసంతానం బెట్లు కలిగె వివరింపుమా యని ప్రశ్నింప నామైత్రేయుం డట్లు బదులు చెప్పెను.

## వేనునిచరిత్రము

వినవయ్యా! రాజర్షి యనంబరగు నంగనామకుం డశ్వమేధయాగము చేయ సమకట్టి ఋత్విక్కులను బ్రార్థించి వారు రాగా జన్నము నారంభించెను. ఋత్విక్కులు యథావిధి దేవతలను హవిర్భాగములం గైకొనం బిలిచిరి. దేవతలం దొక్కండైన రాకుండెను. దానికివారచ్చెరువంది రాజేంద్రా! ఇది యేమి హేతువో కాని దేవతలు హవిర్భాగములు గొనరారైరి. హోమము యథావిధి జరపంబడినది. ఇందుం దప్పిన దించుకంతయు లేదు. అనిన విని యారాజు దుఃఖించి యందులకుం గల కారణంబు సదస్యుల నడుగం దలంచి మౌనంబు చాలించి మహాత్ములారా! ఏల దేవతలు రారైరి. కారణక బెఱింగించి నన్ను మన్నింపుఁడనియె.

వా రావిషయ మాలోచించి రాజచంద్రమా! ఇది యిప్పటిదోషముగాదు. పూర్వజన్మకృతదోషమే. దాని నెఱింగింతుము. వినుము. నీవు రాజర్షివయ్యును సంతానహీనుండవు కాన యాగభాగములు శుద్ధములు కావని వారు రారైరి. కాఁబట్టి పుత్రకామేష్టి నొనరించి పుత్రుంబడయుము. వారువచ్చి పరిగ్రహింతురు. నా విని యాయంగరాజు సంతానార్థియై విశిష్ట

దేవతాకంబగు పురోడాశంబుచే హోమము గావించెను. ఆహోమకుండంబునుండి హేమమాల్యాభరణుండగు పురుషుండు పొడసూపి హిరణ్యపాత్రంబున స్నిగ్ధపాయసంబుం గొను మని యొసంగెను. బ్రాహ్మణానుమతంబున దానిని గ్రహియించి సంతుష్టస్వాంతుఁడై దానిని భార్య కిచ్చెను. ఆమెయు దానిని భుజించి గర్భముం దాల్చి యొక కుమారుం గాంచెను. ఆతఁడు మాతామహుఁడు మృత్యు వనువాఁడుగాన వానింబోలి ధర్మేతరపథంబునఁ బ్రవర్తించుచుండెను. వానికి వేనుఁడనునామకరణము చేయఁబడియె. వాఁడు చిన్ననాట నుండి దుష్పథమున వర్తించుచుఁ దనయీడుబాలకుల వధించుచు శరాసనబాణములం దాల్చి వయస్సు రాఁగా మృగజాతిఁ గరుణలేక చంపుచుండఁగా నాకొమరుంజూచి దుఃఖించి రాజు వానిం జక్కఁజేయఁబూనియు విఫలోద్యముఁడై యర్ధరాత్రి సమయంబున నెటకో పోయెను. ప్రజలారాజుం జూడఁగోరి వెదకిరి గాని ఫలము గలుగక పోయెను.

తర్వాత వేనునకుఁ బట్టంబు గట్టిరి. సింహాసనము నెక్కినది మొదలా వేనుఁడు గర్వంబున విఱ్ఱవీఁగుచు సజ్జనుల నవమానించుచు, నొక్కండె భీతిమాని యెల్లతావుల సంచరించుచు నెదురులేక యుండెను. ఇట్లుండి గర్వంబు కన్నులం గప్ప నిఁకమీఁద యాగములు చేయరాదు. దానము లీయరాదు. హోమములు చేయఁ బనిలేదని భేరీధ్వనులాకసంబు ముట్టునట్లు చాటంబంచెను. మును లిది యేమి యచ్చెరు వని యొక్కచోఁ గూడి యందఱుంబోయి వేనునితో మహారాజా! ఈరీతిశాసింప న్యాయంబే. యజ్ఞంబుల దానంబుల హోమం

బుల భగవంతుండగు నారాయణుండు తృప్తుండగు. ఆతండు తృప్తినొందిన లోకంబులు సంతృప్తిం గాంచు. ఇట్టి కార్యంబుల వలదనుట క్షేమముగాదన నాతం డప్పులుకులయెడ ననాదరంబు చేసి వారల కిట్లు బదులుచెప్పెను.

చ. ఎనయఁగ జారకామిని నిజేశుని మ్రుచ్చిలి జారపూరుషుం
దనపతిగాఁ దలంచుగతి దద్దయుం మూఢమనస్కులై తన
ర్చిన నరపాలరూపము ధరించిన యీశ్వరు నన్నెఱుంగక క
న్యుని భజియింప మీ రిహపరోన్నతసౌఖ్యములంద రెన్నఁడున్. ౪.౨౪-వ.

ఆమాటలు శ్రుతివిదారణచణంబులైన మౌనులెల్ల నిఁక వీఁడు జీవించినఁ బ్రపంచంబున ధర్మవృత్తంబు నశియించు నని నిశ్చయించి హుంకారమాత్రంబున నాతనిం బొలియించిరి. అంతట మహోత్పాతంబులు దోఁచెను. మును లాలో చించి యాతనియూరుమథనంబు చేయఁ గ్రారు లుదయించిరి. మును లాతనిబాహుమథనంబుచేయ నొకకుమారుండు నొక పుత్రికయు జనించిరి. కొడుకు పృథునామంబునం బరఁగెను. అర్చినామంబునఁ బుత్రికయుఁ బ్రఖ్యాతి నొందె. ఆపృథువు సకలరాజలక్షణలక్షితుం డౌట నందఱు హర్షించిరి. క్రమముగ నాతనికిఁ బట్టాభిషేక మొనర్చిరి.

ఆతండు రాజ్యంబు పాలించుచుండఁ బ్రజలు మహా రాజా! మాకు నాహారంబును బ్రసాదింపవే యని మొఱయిడిరి. వారిఁ గాంచి యింకఁ బ్రజలకు సుఖకర మగునట్లు వృత్తిని గల్పింపకున్న నా రాజత్వమున నేమిలాభమని నిశ్చయించి కరుణా ఖండై వారలఁ గాంచి వృత్తిని గల్పించెద భయపడకుఁ డని మోదార్చి, గోరూపధారిణియగు భూదేవిని శోధించి పిదుకం

దలంప భూమి యిట్లనియె. రాజా! నేను విషమస్థలినై యున్న దాన. వర్షము గురిసిన పది నిల్చునట్లుండక వలయుంగాన నన్ను సమస్థలిపై బెంపొందం జేయుము. అనుటయు నా రాజు పర్వతంబుల నందందున్నవాని నొకచోఁ జేర్చి భూమి సమస్థలిగా నొనరింప గోరూపంబున నాభూమి సకలౌషధులం బండెను. క్రముముగా నామనుష్యు లవ్వానివలనఁ దగిన యన్నమును సంపాదించుకొని సుఖముగా బ్రదుకఁగలిగిరి. ఈవిధమునంతయుం గాంచి దేవ పితృ యక్ష రాక్షస గంధర్వనాగాదులు తమతమ యభీష్టఫలంబుల నాభూమినుండి పొందఁగల్గిరి.

ఇట్లు పృథుచక్రవర్తి రాజ్యంబు పూజ్యభంగి వెలసెను. మనుజులు శ్రమము మాని విహితవృత్తులచే జీవించుచునుండిరి. ఈతిబాధలు జగంబున లేకుండెను. చక్రవర్తియు భగవత్పూజాతత్పరుండై శతాశ్వమేధంబు లొనరింపఁ గృతనిశ్చయుండై సరస్వతీనదీప్రాంతంబున నివేశంబుం గల్పించుకొని దీక్షచేసెను. ఇంద్రుండు దానికి నసూయనొంది విఘ్నము చేయ నిశ్చయించుకొనెను.

## పృథుచక్రవర్తి యశ్వమేధంబుచేయ నింద్రుడాయశ్వము నపహరించుట.

ఇట్లు సంకల్పించి తొంబదితొమ్మిది యశ్వమేధంబు లొనరించి నూఱవయాగంబు ప్రారంభించెను. ఇంద్రుం డద్దాని కోర్వఁజాలక పాషండవేషకలితతిరోభావంబున నాయశ్వంబును న్యాయవిరహితుండై కొని గగనంబునఁ బోయెను. ఆవిధమెఱింగి పృథుచక్రవర్తి కుమారుండు శరచాపంబులం దాల్చి యింద్రునిం వెనుకొనుచుం బోయిపోయి యింద్రునిం జూచెను.

అత్రి యంతలో నాకుమారునితో వీఁడు యజ్ఞహంతయగు ధర్మ
విధ్వంసకుం డగునింద్రుండు. వీని జయింపుమని ముష్టాక్షు
లుచ్చరించెను. అంత నాకుమారుం డాతని నిలునిలుమని యాశు
తీవ్రబాణంబులు ప్రయోగింప నాయింద్రుం డాయశ్వమును
విడిచి యదృశ్యుండై పోయెను.

వీరుఁ డాపృథురాజకుమారుఁ డాయశ్వమును గొని
యజ్ఞభూమికి వచ్చెను. అచ్చట నున్న మహర్షు లందఱును
హర్షాశ్చర్యకరకర్మంబులం గాంచి జితాశ్వుం డనునామం బిడిరి.
అంత యజ్ఞము సాగుచుండ దేవతానేత ఘోరంబగు తమః
పటలంబును నిర్మించి కాంచనపాశబద్ధమై యూపదారుపరిశోభిత
మగు నాయశ్వంబును హరించెను. వినువీథిఁబోవు నాయిం
ద్రునిమార్గము నత్రి తెలుప నా రాజకుమారుండు మహా
రోషంబు మీఱఁ బోయి యింద్రుంజూచి నొంపఁజాల కుండెను.
అత్రియు మరల నాతనిం బురికొలిపెను. దాన నాతండు తొక్క
ద్రొక్కినభుజంగంబువిధంబున మండిపడి మహోగ్రశరం
బరిపోసిన శతముఖుం డార్తుఁడై యశ్వమును విడిచి పరుగెత్తెను.
రాకొమరుం డాహయరత్నముం గొని మరలి వచ్చెను.

అంతఁ బృథుచక్రవర్తి యింద్రుని యసత్ప్రవృత్తి కాగ్ర
హించి బాణంబు ప్రయోగింపఁ బూనెను. ఋత్విజు లాతని వారించి
రాజా! యజ్ఞదీక్షాకాలముగాన నిది పరనిరాసనోద్యమమున
కదను గాదు. మే మాతనిం జంపఁగలుగుదుము. చూడుమని
యింద్రు నాకర్షించు మంత్రంబుల హోమము చేయసాగిరి.
బ్రహ్మ యచ్చటి కరుదెంచి వాని ప్రయత్నమును నిలిపి యజ్ఞఫలం

బా రాజున కనుగ్రహించి యరిగెను. నారాయణుండును శత యజ్ఞఫలంబులు సంపూర్ణంబులుగ నీకుం గలుగు ననియె.

అంత సనకసనందసనత్కుమారసనత్సుజాతు లను బ్రహ్మమానసపుత్రులుమహర్షివరేణ్యులరుదెంచి కృతసపర్యులై యాతని కధ్యాత్మతత్వంబు లుపదేశింప జ్ఞానవైరాగ్యవంతుండై యా రాజచంద్రుఁడు ముక్తినొందెను. అని యిట్లు విదురునకు మైత్రేయుండు తెలిపినారాయణమహిమల నెన్నియేనిఁదెల్పెను. విదురుండు మహాత్మా నీచే శ్రీభగవంతుని మహిమల వింటిని. కృతార్థుఁడ నైతి నని యామునివర్యునిచే సెల వంది కరి పురంబునకుం బోయెను.

ఇది నాల్గవస్కంధము.

---

# పంచమస్కంధము

## భరతోపాఖ్యానము

ఇట్లు విదురమైత్రేయసంవాదంబుఁ దెలిపి శుకమహాయోగి పరీక్షిత్తున కిట్లనియె. అవనీనాథా! భగవద్భక్తుండగు భరతునిచరితంబుఁ జెప్పెద విను. భరతుఁడు పాలింపఁబట్టి యీ ఖండము భారతవర్షం బనం బ్రఖ్యాతం బయ్యె. ఆమహారాజు భగవద్భక్తుండు. పూజ్యభంగి రాజ్యంబును జిరకాలము పాలించెను. భగవదారాధనము సేయ వ్యవధి చాలమి నారాజు రాజ్యంబు పుత్రవశంబు చేసి యరణ్యంబునకుం బోయి నియతుండై తప మొనరించుచుండెను.

ఒక్కనాఁ డారాజర్షి గండకీనదియందు స్నానకృత్యంబు సలిపి యంతర్జలంబులఁ బ్రణవోచ్చారణంబు చేయుచుండెను. ఇంతలో నిర్భరగర్భిణి యగునొక్కహరిణి జలపానంబు చేయ నరుదెంచి జలంబుల నొడ్డుననిలువంబడి పానము చేయుచుండ సింహము ధ్వనిచేసెను. దానికి భీతిల్లి యది యెగిరెను. గర్భము గళితమై జలంబులం బడియెను. హరిణి భయంబున నటునిటు దుమికి తత్పాతంబున మృతినొందెను.

భరతుఁడు లేచునప్పటి కాశిశువు నీళ్లపైఁ దేలుచుండెను. చూచి కరుణించి దానిం గొనితెచ్చి పెంచుచుండెను. నానాఁటి కదిపెరిఁగి పెద్దదయ్యెను. భరతునకు దానిని పోషించుటయే

తపస్సాయెను. సర్వకాలము దానిరక్షణమునందే యున్మత్తుని కరణిఁ బ్రవర్తించుచుఁ గరుణాతరంగితాంతరంగుండై దాని కాలిలో ముల్లు గ్రుచ్చుకొనినఁ దనకంటిలో గ్రుచ్చుకొనినయట్లు తలపోయుచుఁ బెంచుచుండెను. ఉదయాదిగా దానిరక్షణమందే నిబద్ధ బుద్ధియై యుండుటంబట్టి యామునిచంద్రుని యోగాభ్యాసాదులు నానాఁటికి క్షీణింపసాగెను. కాని వానిపరిక్షీణత కాముని పరితపింపక యాహారిణపోతమును జూచుచుఁ గరుణ దళుక్కొత్తుచుండఁగా

ఉ. అక్కట! తల్లిఁబాసి హరిణార్భక మాప్తులం లేమిఁజేసి యే
దిక్కును లేకయున్న నిటఁ దెచ్చితి, నాయెడ నీమృగార్భకం
బెక్కుడుప్రేమ చేసి చరియించుచు నున్నది నాదుసన్నిధిన్
మక్కువ చేసి దీనిఁ గడు మన్ననలం దగఁ బ్రోతు నెంతయున్.

అని తలపోయుచు

క. శరణని వచ్చిన జంతువు, గరుణం గనువిచ్చి చూచి కాచినపుణ్యం
బరయఁగ నధికంబని మున్, గర మెంతేఁగించిరి మునీంద్రగణములు ప్రేమన్.

అని మనంబున నూహించుచుఁ దా నేకార్యము చేయుచున్నను దానిం జెంత నుంచుకొని రక్షించుచు, వృకాదిసాధుమృగహింసకమృగంబులనుండి దాని కేయపకారము గలుగకుండఁ గాపాడుచుఁ, దాని యానందమునకుఁ దా నెంతయు హర్షించుచుఁ బెంచుచుండెను.

ఇట్లు కొంతకాలము జరుగ నొక్కనాఁ డాహరిణపోతంబు నైజచాపలంబున నెక్కడికో పోయెను. కన్నులు తెఱచునరికి చెంత లేకపోఁగా నాముని కలంగుచు నలువలంకు

లకుం బరుగిడి పరుగిడి దృష్టిసారించి పరికించుచు, ఆకుఁగదలినను అదియే యని భ్రమించుచు నచ్చటికిం బోవ నది కాకపోఁగా వెతలం గుడుచుచుఁ దిరుగుచు నిత్యనైమిత్తికకర్మములు మాని యుండె నని చెప్పి శుకయోగి రాజయోగినిం దిలకించి,

సీ. జననాథ మున్ను మోక్షవిరోధ మని పాయఁ గారాని పుత్త్రాదికంబు నెల్లఁ
బాసి తపస్వియై భరతుండు హరిణశాబకపోషణంబునఁ బాలసమున
నతికాలన ప్రీణనానుషంగంబుల మామకబిల మతిరోషమునను
సర్పంబు చొచ్చిన చందంబునను యోగవిఘ్నంబు మిక్కిలి విస్తరిల్లెఁ
ఆ. గాన నెంతదాని కైనను గాలంబు, గడవరామి నట్లు గాకపోదు
పరమమునులకైనఁ బాయవు కర్మంబు, లూరు లనంగ నెంత నరవరేణ్య.

అని పలికి మఱియు నిట్లనియె. రాజేంద్రా! ఆరీతి భరత ముని విచారించుచుండ నాజింకపిల్ల కంటఁ బడెను. ఆహా! ఆసమయమున నాయనకుఁ గల్గిన మోదమునకు అంతమే లేదు. ముక్తిపదము లభించినట్లే ఆనందించెను. కడుంగడు ముద్దాడెను. మేను నిమిరెను. ఎత్తి తొడపైఁ గూరుచుండఁబెట్టుకొనియెను. అన్నా! ఇంకెన్నఁడు నిట్లు పోకుమా యని బుద్ధి చెప్పెను. ఇట్లు ముద్దులాడి యథారీతిగాఁ బోషించు చుండెను. అప్పు డప్పు డది కనఁబడకపోవుట తటస్థించుచు రాఁగా దుఃఖించుచుఁ గంటఁ బడఁగా నానందించుచు నాపనియే కృత్యముగాఁ గాలముఁ గడపుచుండెను.

మానవదేహము గనుక మృత్యు వాసన్న మయ్యెను. ప్రాణవాయువులు తావుల్ తప్పెను. అత్తఱి నాపోతము తన యెదుట నిలుచుండి తా ననుభవించు పరితాపమును జూచు చుండెను. మునియు దానినే మనంబున నిలిపి ప్రాణములం బాసెను.

"అంతకాలస్మృతి ఫలింపక మానదు"

అన్న సూక్తి యేనాటికిఁ దప్పదు. ఆభరతుం డాహరిణ శాబకమును మనమున నిడికొని యసువుల విడిచెను. కాన హరిణీగర్భంబున హరిణశాబకంబై జన్మించెను. చిరకాలము రాజగభోగంబుల రోసి భగవదారాధన మొనరించినకతన పూర్వస్మృతి కలిగి యుండెను. తనకు మృగత్వము గల్గుటకు హేతు వెఱింగెను. ఎఱింగి నిట్టూర్పులు పుచ్చుచు,

ఉ. రాజులు ప్రస్తుతింప సుర రాజసమానుఁడనై తనూజులన్
రాజులఁ జేసి తాపసులు రాజఋషీంద్రుఁ డటంచుఁ బల్కఁగాఁ
దేజము నొంది యీహరిణ దేహమువందలి ప్రీతిఁ జేసి నా
యోజ చెడంగ నేఁ జెడితి యోగిజనంబులలోన బేలనై.

అని దుఃఖించుచు భగవద్ధ్యానసామర్థ్యంబున నెట్లో పులస్త్య మహామునిచంద్రు నాశ్రమము నొంది యందు వసించి హరిణదేహత్యాగకాల మెపుడు వచ్చునా యని కోరుచుశుష్క పర్ణంబులు, తృణంబులు, చిగురుటాకు లాహారంబులుగా నటఁగల సరస్సులలో మునుఁగుచు నెట్లో కాలక్షేపము చేసి యాహరిణశాబక తనువును ద్యజించెను. ఆంగీరసుం డను బ్రాహ్మణు ప్రథమభార్యయందుఁ గల్గిన పుత్త్రనవకంబునందుఁ దానొక్కండై జన్మించి తండ్రి యొనరించు నుపనయనాది క్రియలనన్నింటిని ఇచ్ఛలేకున్నను గ్రహించుచుండఁగా నాంగీ రసుండు సురపురి కరిగెను. తల్లియు సహగమనం బొన ర్చెను. సవతి తల్లి కొడుకులు తమ్ము వేదాదివిద్యలం జదువనీయక సంసారభారనిర్వాహణకృత్యంబున నీతని నియోగించిరి. మన స్సునం దొప్పనిపని చేయువాఁడు గాన దాని నాసక్తితోఁ

జేయక యొట్లో నిర్వహించుచుండుటం గాంచి వారలున్మత్తుఁడా! జడుఁడా! మూఢుఁడా! బధిరుఁడా! యని పిలువ సాగిరి. వాని నోర్చుకొనుచు నధశ్శయనంబు చేయుచుండి యొకనాఁడు చేనికావలి యుండెను.

ఆపురపాలకుఁ డగు వృషలభూపతికి సంతానము లేదు. కాళికి బలియిచ్చిన సంతానము కలుగఁగల దని యెవ్వరో యాయన కుపదేశించిరి. అతండు పుత్రవాంఛ గలవాఁడు. కావునఁ బురుషపశువులం దోలుకొని రమ్మని భటుల కాజ్ఞాపించెను. భృత్యు లాపనికై ప్రయత్నించుచుండఁగా నొకఁడు నాఁటి రేయి పశువును గానలేక వీరాసనమున నున్న యావిప్రయోగిని గాంచిపశు విది బలికిఁ జాల బాగున్న దని పట్టికట్టి కొనిపోయి యభ్యంజనాదిసంస్కారములు నిర్వర్తించిరి. నూతనవస్త్రంబులఁ గట్టనిచ్చిరి. గంధపుష్పాదుల నలంకరించిరి. మృష్టాన్నంబులు భుజియింపఁ బెట్టిరి. సకలోపచారముల నలరించిరి. మహావాద్య ఘోషంబులతో నాపురుషపశువుం గాళికాదేవిసముఖంబు నకుం గొంపోయి నిలువం బెట్టిరి. వృషలపతి యట కరుదెంచి కాళికామంత్రాభిమంత్రితంబయి భయంకరాకారంబయి తనదు ఖడ్గంబు గ్రహియించి యాపరమ శుభకృత్యత్వంబున నభీష్టసిద్ధి గలుగవలయు నను తలంపున హింసింపం దలంచెను. కరంబు పైకెత్తి ఖడ్గంబున మెడఁ ద్రుంపం బూనెను.

ఇంతలో సర్వభూతసముండై బ్రహ్మభూతాత్ముఁడై నిర్వై రుఁడై యున్న యాబ్రాహ్మణకుమారుని తేజంబు చూడరానిదై యొప్పఁగా నాభద్రకాళి మిప్పిరిగొను కోపంబున హుంకార పూర్వకంబుగా నట్టహాస మొనర్చెను. అట్లట్టహాస మొనర్చి

పాపాత్ము లగునాభటులను వృషలపతిని నిముసములో భస్మము చేసెను. అంతతోఁ దృప్తి నొందక యాకాళీశీర్షంబు చేసంది వలుదట్లు నాట్యము చేయసాగెను.

క. ధరలోన నెవ్వరేనిని, ధరణీసురవరుల కెగ్గు దగఁ దలఁచినవా
రరయఁగఁ జెడుదురు నిక్కము, హరి ధరణీసురవరేణ్యులం దుండుటచేన్.

అనుట తెల్లమాయెఁ గదా యని తెలిపి శుకయోగి మఱియు రాజుతో నిట్లుచెప్పెను. పరీక్షిద్భూపాలకా! ఆవిప్రుఁడా కాళి కాలయంబున

ఉ. అచ్చట విప్రసూనుఁడు భయంబు శోకయించుక లేక చంపఁగా
వచ్చిన వారియందుఁ గరవాలమునందును గాళియందు దా
నచ్యుతభావ ముంచి హృదయంబునఁ బద్మదళాక్షు నెంతయుం
మచ్చికతోడ నిల్పి యనుమానము నొందక యుండె నెంతయున్.

కొలఁది గడియ లందుండి మరలివచ్చి యథాపూర్వముగాఁ గావలి యుండెను. ఇట్టివ్యాపారమునఁ గొంత కాలముజరిగెను. వృత్తియందుఁ బ్రమాదంపడక కాలముఁ గడపుచు సంసారబాధ లంటకుండ నా భూసురకుమారుఁ డుండెను.

సింధుభూపాలకుం డగురహూగణుం డొకనాఁడు కపిల మహామునియాశ్రమం బిక్షుమతీనదీప్రాంతమున నున్నట్లు విని యచ్చటకుం బోయి కపిలమునివలన విజ్ఞాన మెఱుంగఁ గోరి శిబికారోహణ మొనర్చి ప్రయాణము చేయుచుండెను.

శిబికావాహకులు దారినడుమ చేనియొద్దఁ గాపున్న నాబ్రాహ్మణునిం జూచి యాయనభుజమున శిబికాదండము నుంచి యలసటఁ దీర్చుకొనం గోరి యాతనిం బట్టితెచ్చి పల్లకి

మోయుము మని బలవంతము చేసిరి. పాప మావిప్రప్రవరుం డా శిబికను మూఁపునఁ బెట్టుకొని మోయుచు నోపినంత నడచు చుండెను. అలవాటు చాలనందున నియమముగా నడువఁ జాలక తోఁచినట్లు నడువసాగెను. ఆశిబిక కుదురుతప్పి హెచ్చు తగ్గులుగా నుండఁగా లోపలఁ గూరుచున్న యారాజు వారి నదల్చి యింతకుముందువలెఁ గాక యిప్పట్టున నీరీతి విషము ముగా నీశిబిక యుండ నేల? అని యదలించెను. అపలుకుల కడలి వాహకులు రాజేంద్రా! ఈతప్పు మావలన నైనది కాదు. మాలో నాల్గవవాఁడు సుఖగమనంబుగా నడవనేరఁడు. వీనితో మేమును చిక్కులు పడుచున్నవారము. అని వినయముతో బదులు చెప్పిరి.

రాజు వృద్ధోపాసనము చేసినవాఁడే. ఐనను ఆసమయమున నాగ్రహించి బ్రహ్మతేజంబున భాసిల్లు నాభూసురుం గనుంగొనఁజాలక కఠినస్వరం బలరుచుండఁగా,

చ. "అలసితి వెంతయుఁ గ్గడు ముసలి వాఁకట దస్సితి వెన్ను మిక్కిలిం
బలుచనయున్న దీశిబికభారము దూరము మోసి తేఁకలిఁ
నిలిచెదవు......"

అని పలికెను. ఆబ్రాహ్మణుఁడు బదులు పల్కక మోయుచుండెను. ఈశరీరము కడపటిదని యాముని యెఱుంగును గాన నహంకారమమకారంబులం బొందక మిథ్యాజ్ఞానరహితుండై బ్రహ్మభూతుండై మౌనమూని యథాపూర్వముగా నాశిబిక మోయుచుండెను. వెండియు నా రాజు శిబిక చక్కఁగా నడవకుండుటం దెలిసికొని యావాహకుని బలుభంగులం బదరెను.

తూలనాడు పల్కులన్నియుఁ గ్రుమ్మరించెను. బుద్ధిలేక యెన్నియో తులవమాటలు పలికి యాయనను నొప్పించెను.

అంతట భరతుఁడు మందమందభాషణంబుల నిట్లనియె. రాజేంద్రా! నీపలుకులు ఋతంబులు. భారం బీతనువునకే గాని నాకుం గలుగనేరదు. స్థౌల్యము, కృశత్వము, ఆధివ్యాధులు, క్షుత్తృష్ణలు, ఇచ్ఛావిరోధభయంబులు, జరామరణంబులు, రోగనిద్రాజాగరణంబులు, నహంకారమమకారమదశోషణాదులు శరీరంబుతోడనే పుట్టును గాని నాకవి యేవియుఁ గలుగనేరవు. నే నిపు డున్మత్తమూకాంధజడులుంబోలె సహజస్వభావంబుఁ బొందిన నాయందు నీశిక్ష యేలాభంబు నాపాదింప నేర్చు? అని పలునీతు లుట్టిపడునట్టిమాటలు పలికి మౌనం బవలంబించి యథారీతిగా మోయుచుండెను.

ఆ రాజు తత్త్వజ్ఞానాపేక్షితుండై చనుచున్నవాఁడు కావున సహృదయగ్రంథివిమోచకంబులు, బహుయోగశాస్త్రగ్రంథసమ్మతంబులు నగు నాభూసురువాక్యంబుల విని త్వరపడి యాశిబిక దిగి యామహనీయమూర్తికి భయభక్తిసంభ్రమంబులు పురిగొని వలగొని వందనం బాచరించి గర్వము నావలం బోఁద్రోలి కరంబులు జోడించి "మహాత్మా! ఎఱుంగక సామాన్యజనుంగా భావించి యెన్నియో కాఱులు పల్కితి. నీ వవధూతవేష మూని సంచరించుచున్న మహాత్ముఁడవు. నిన్నెఱుంగనేర కున్నాఁడ. నాయం దనుగ్రహమునుపఁ దలఁచిన యాకపిలమునివరుఁడవా! నాతప్పులు క్షమించి నన్నుఁ గృతార్థునిఁ జేయుమా" యని పెక్కుభంగులం బ్రార్థించి బహు

విధోపదేశములం బొంది విజ్ఞానినియై కరకమలంబులు ముకుళించి మహానుభావా!

మ. జ్వరితార్తుం డగురోగి కౌషధ మతీష్టం బైనచందంబునన్
ధరలో నాతపతప్తదేహి గడుశీతం బైనతోయంబునున్
గరిమం గోరినరీతి నెంతయు నహంకారాహిదష్టుండ నై
వరఁగున్ నాకును నీవచోమృతము దప్పన్ మందు వేఱున్నదే.

అని ప్రార్థించెను.

భరతుం డాతనియెడం గరుణాళుండై తత్త్వజ్ఞానం బుపదేశించెను. రాజు సంతుష్టుండై దేహాత్మభ్రమం బాసెను. భరతుండును గొంతకాల మట్లుండి నారాయణచరణములం గొలువ నరిగెను. అని యిట్లు శుకయోగి రాజునకుం దెల్పి భరతుని చరిత్రమును దెలిపిన యనంతరంబ భారతవర్షమునం గల నదనదీసరఃపర్వతములవిషయము నెఱింగించి ఖగోళవిషయంబు లించుక తేటపఱిచి నరకలోకములగాథలం దెలియం బలికి యెట్టియెట్టి పాపంబు లొనరించిన నెట్టినరకంబులంబొంది యేలాటి కష్టముల ననుభవింపవలయునో యావిధం బంతయుఁ దేటపడునట్లు చెప్పెను.

ఇది పంచమస్కంధము.

# షష్ఠ స్కంధము

భగవంతుం డగుశుకయోగి యిట్లు తెలుపఁగా విని రాజర్షి భగవద్గుణవర్ణనాకర్ణనకుతూహలమానసుం డై చేతు లొగ్గి మహాత్మా!

ఆ. కడిఁదివేదనలకుఁ గారణంబై యుండు, గుఱుతులేని నరకకూపరాశి
పాలుగాక నరుఁడు బ్రదికెడుమార్గంబు, పరమపుణ్య తెలియఁబలుకవయ్య.

అని ప్రశ్నించెను. రా జిట్లు మధురవాక్యాలం బ్రశ్నింప యోగిరాట్టు ఆదరంబున నాతనిం జూచి భక్తవరాగ్య, రాజేంద్రా!

చ. సతతము కృష్ణపాదజలజంబులయందు మనంబు నిల్పు స
ద్వ్రతులుఁ దదీయశుద్ధగుణరాగులుఁ గాఁజని యుగ్రపాశ సం
హతుల ధరించు తత్సుభటకౌఘములం గలలోనఁ గాన రే
గతులకు దుష్టకర్మములు గైకొనువారలఁ జెంద నేర్చునే.

కాఁబట్టి నీ యీప్రశ్నంబునకుం దగినట్లు పురాతనేతిహాసం బొక్కండు గలదు వచింతు. నాలకింపు మని మధురతరాలాపంబుల నిట్లు పలికెను.

## అజామిళోపాఖ్యానము

రాజా! కన్యాకుబ్జ మనుపురవర మొకఁడు గలదు. ఆనగరంబు నివాసంబుగా నజామిళుం డను బ్రాహ్మణుం

డొకఁడు పాపాత్ముండై నిర్భాగ్యుండై మూర్ఖుఁడై సదాచారం బుల పీఁటఁబుచ్చి దురాచారసంపత్తుండై యుండు. ఆతండు జూద మాడుచు, దుర్వాదము లొనరించుచుఁ దనవంటిగుణములు గల యొకతుకం బెండ్లియాడి సూకరము పెక్కుపిల్లల నీనునట్లు బహుపుత్త్రుల నామెనుండి పడసెను. వృద్ధత్వము రాను రాను వానికి మోహాంధకార మభివృద్ధియాయెను. నిరంతరము బాల కుల నుపలాలనముచేయుటలోఁ గాలమును బుచ్చెను. ఇట్లు కొంతకాలము జరుగ వృద్ధుం డయ్యెను.

సీ. నిర్మలం బనఁజాల నెఱయుం జిత్తం బన నల్లనివెంట్రుకల్ తెల్లనయ్యెఁ
దగు మోహపాశబంధంబుజాఱినమాడ్కిఁ బొదలినయంగముల్ వదలి వ్రేలె
నింద్రియంబులకోర్కులిఁకనొల్లననుభంగినుడుగక తలచాల వడఁకఁజొచ్చెఁ
దమకంబుప్రాయంబుఁదగిలిపోయిన మాడ్కిలోచనంబులచూడ్కి నీచమయ్యె
ఆ. పగరుపుట్టినంత బెగడె దంతంబులు, నుక్కికొసయుం దగ్గుఁ దిక్కుటిల్లె
శిరమునొవ్వఁ దొడఁగెఁ జెదరెమనం బంతఁ,గడ్డిదియైన ముప్పుకాలమునకు.

ఇట్లు ముదుసలితనంబు వ్యాపింప వయసున నెనుబదెని మిదివత్సరంబులు నిండెను. బుద్ధిభ్రాంతినొందుట కారంభించెను. దేహపాటవము తగ్గిపోయెను గాని సంసారచింతాపాటవ మిసు మంతయు సడలమింజేసి కడపటికొడుకగు నారాయణుఁ డప్పు డించుక బాలుండుగా నాతనికిం దోఁచిన కతన రేయింబవ ళ్లాతనిం జీరుచు ముద్దాడుచుండెను. కాని భగవద్ధ్యానసమా సక్తచిత్తుఁడు కాఁడయ్యెను. అంత మృత్యువు వాతం బడుతఱి చెంత కేతెంచెను. యమకింకరు లాతనికిం దోఁచిరి. వారిం గాంచి నంతనే భయంపడి

క. దోరమున నాడుబాలుఁడు, బోరనఁ దన చిత్తసీమఁ బొడగట్టిన నో
నారాయణ నారాయణ,నారాయణ యనుచు నాత్మనందను నొడివెన్.

పూర్వజన్మసుకృతావేశంబున హరిస్మరణంబు మృతికాలంబునఁ జేయు భాగ్యంబు గలుగఁగా శ్రీభగవంతుని దూతలు పొడసూపి భయంకరాకారులగు యమదూతల నదల్చి యజామిళునిఁ గొంపోవఁ బ్రయత్నించిరి. వారలం గాంచినంతనే శమనుదూత లదరిపడి వినయమునఁ జేతులొగ్గి, మహాత్ములారా! మీ రెవ్వరిదూతలు. పాపాత్ములలో మొదటివాఁ డీతఁడే యని చెప్పఁదగిన వీని మాచేఁ బడకుండఁ గొంపోవుచున్నారే. దీనికిం గారణమేమి. యమునియాజ్ఞ యంత నిస్సారమయ్యెనా? యన వా రించుక నవ్వి యమదూతలారా! మీరు సంశయింపఁ బనిలేదు. శ్రీవిష్ణుమహిమము మీ రెఱుంగరు. ఈతం డెన్ని పాపము లొనరించినను గడపట శ్రీనారాయణమూర్తిం దలంచెను. ఆనామస్మరణమహిమమును వినుండు.

సీ. బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్నికీలలు హరినామకీర్తనములు
గురుతల్పకల్మషక్రూరసర్పములకుఁ గేకులు హరినామకీర్తనములు
తపనీయచౌర్యసంతమసంబునకు సూర్యకిరణముల్ హరినామకీర్తనములు
మధుపానకిల్బిషమదనాగసమితికిఁ గేసరుల్ హరినామకీర్తనములు
తే. మహితయోగోగ్రనిత్యసమాధివిధుల,నలరు బ్రహ్మాదిసురులకు నందరాని
భూరినిర్వాణసామ్రాజ్యభోగభాగ్య,ఖేలనంబులు హరినామకీర్తనములు.

ఇంకను వినుఁడు. మీసంశయము లంతరించును.

సీ. ముక్తికాంతైకాంతమోహనకృత్యముల్, గేలిమై హరినామకీర్తనములు
సత్యలోకానంద సౌభాగ్యయుక్తముల్ గేలిమై హరినామకీర్తనములు
మహితనిర్వాణసామ్రాజ్యాభిషిక్తముల్ గేలిమై హరినామకీర్తనములు
బహుకాలజనితతపఃఫలసారముల్ గేలిమై హరినామకీర్తనములు

తే. పుణ్యచరితంబు లనఘాయుపోషకంబు, లభిమతార్థంబు లజ్ఞానహరణకరము
లాగమాంతోపలబ్ధంబు లమృతసేవ, లార్తశుభములు హరినామకీర్తనములు.

మఱియొక్కమాట యాలకింపుఁడు.

క. నామంబు పుణ్యమూర్త, క్షేమంబు మునీంద్రసాంద్రచేతస్సరసీ
ధామంబు విష్ణు నిర్మల, నామంబుఁ దలంచువాఁడు సాధుఁడు గాఁడే.

క. డెందంబు పుత్త్రవలనం, జెందిన దని తలఁప వలదు శ్రీపతిపేరే
చందమున నైనఁ బలికిన, నందకధరుఁ డందుఁ గలఁడు సాధుం డగుచున్.

ఆ. బిడ్డపేరు పెట్టి పిలుచుట విశ్రాము, కేలి నైన మిగులఁ గేలి నైనఁ
బద్యగద్యగీతభావార్థముల నైనఁ, గమలనయనుఁ దలఁప గలుషహరము.

ఉ. కూలినచోటఁ గొట్టుపడి కుందినచోట మహాజ్వరాదులం
ద్రేలినచోట సర్పముఖపీడల నందినచోట నార్తులై
తూలినచోట విష్ణు భవదూరునిఁ జేర్కొని రేని మీఁద నా
కాలునియాతనావితతిఁ గానరు పూనరు దుఃఖభారముల్.

మ. నిరతంబై నిరవద్యమై నిఖిలచిన్నిర్మాణమై నిత్యమై
నిరహంకారగుణాఢ్యమై నియమమై నిర్దోషమైనట్టి శ్రీ
హరినామస్మరణామృతం బితఁడు ప్రత్యక్షంబు సేవించెఁ దా
మరణాంతంబున నిట్టిసజ్జనునిధర్మం బేల వ్యర్థంబగున్.

అని యిట్లు శ్రీమన్నారాయణనామమాహాత్మ్యం బెఱింగింప విని యమదూతలు వారికి మ్రొక్కి పనివినిరి.

అజామిళుం డాయమపాశవిముక్తిం గాంచి యెదుటం దోఁచిన హరిదూతలం గాంచి నమస్కరించి విజ్ఞానవైభవంబున నేమోపలుకంబూనునంతలో వారాతనిభావంబెఱింగి యదృశ్యులైరి. అట్లగుటం దెలిసికొని యాబాడబుండు పరితాపంబున భగవంతుని నెదుట నిలుపుకొని తనదుష్కృతంబుల నెల్ల నివే

పించి కన్నీరు నించి "యాపద్బాంధవా! నన్నుం గాపాడుమా" యని ప్రార్థించుచు,

క. హరిభక్తులతో మాటలు, ధర చెన్నఁడుఁ జెడని పుణ్యధనములమూటల్
వరముక్తికాంత తేటలు, నరిషడ్వర్గంబు చొరని యరు దగుకోటల్.

అని తలంచుచు నాతఁ డంబ యిల్లు వదలి గంగాద్వారంబునకుం బోయి యందు నియమంబున యోగాభ్యాసపరతంత్రుండై తద్బలంబున నసువులం బాసి భగవంతునియం దాత్మను గలిపి యందుం దోఁచు దూతలం బరికించి నమస్కరించి యవ్యయా నందసుఖం బనుభవించుచుండెను.

రాజేంద్రా!

క. కర్మంబు లెల్లఁ బాయను, మర్మము దెలుపంగ లేరు మధురిపుపే రే
పేర్మిని నొడువుటకంటెను, దుర్మదమునఁ జిత్త మెన్ని త్రోవలఁ జన్నన్.

కాఁబట్టి నీ ప్రశ్నమునకు సదుత్తరం బీకథయే యనియె. రాజును నమస్కరించి యోగీంద్రా! యమదూత లట్లు తిరస్కృతులై యేమి చేసిరో తెలుపుము. దాన నింకను నీనామమాహాత్మ్యం బెఱుకపడు నని ప్రశ్నింప దరహాసితవదనుండై శుకుం డిట్లు పలికెను.

క్షత్రియమునీ! వినుము. అట్లు నిరాకృతులై విసుగుకొనుచుం జనిప్రేతనాయకుంగాంచి వృత్తాంతం బెల్ల నెఱింగించి యిట్లగుటకుం గారణంబుఁ దెలుప వేఁడిరి. దండధరుండు మనంబునఁ బుండరీకాక్షుం దలంచుచు వారలం గరుణ చెలంగం గాంచి యూఱడించుచు విష్ణువు తనకన్న సర్వోత్కృష్టుఁ డని తేటపఱచి, ఆ శ్రీహరినామమహిమమును వారికిం దెలుపుచు దూతలారా!

సీ. ఎకపక్కెమున నైన నిందిరారమణునిఁ, బలుకంగ లేని దుర్భాషితులను
గలలోన నైన శ్రీకాంతునిసత్పాద కంజముల్ చూడనికర్మగృహుల
నవ్వుచు నైనఁ గృష్ణప్రశంసకుఁ జెవిఁ దార్పనేరని దుష్కథాప్రవణుల
యాత్రోత్సవంబుల నైన నీశునిగుడి త్రోవఁ ద్రొక్కఁగలేని దుష్పదులను

ఆ. బరమభాగవతులపాదధూళిసమస్త, తీర్థసారమనుచుఁ దెలియలేని
వారి వారివారిఁ వారిజేరినవారిఁ, దోలుఁతఁ గట్టి తెండు దూతలార.

ఆ. పద్మనయను మీఁది భక్తియోగం బెల్ల, ముక్తియోగ మనుచు మొదలఁ దెలియంగు
వారి వారివారిఁ వారిఁ జేరినవారిఁ, ద్రోవఁ దలఁప వలదు దూతలార.

అని యిట్లుపదేశింప వారు సంతుష్టులయిరి. రాజా! ఈ యితిహాసంబు పూర్వకాలంబునఁ గుంభసంభవుండు మలయ పర్వతంబునఁ బురుషోత్తము నారాధించుచుండి నాకుం దెలిపె. అన విని యాశ్చర్యంబున బరీక్షిజ్జనపాలుండు భగవన్నామంబు స్మరియించి కథాసంశ్రవణకుతూహలుం డయ్యెను. యోగియు భగవత్కథల ననేకములు తెలుపుచు నింకను భగవత్కథా సారమును దెలుపువాఁడై యిట్లనియె.

## దేవదానవులయుద్ధము

రాజసత్తమా! దేవేంద్రుండు నిండుపున్నమ యగుటం జేసి సకలభోగంబు లనుభవించుచు శచీదేవి తనయూరువులపై నుండ దిక్పాలకు లొనరించుమనవుల రాజసంబుతో నాలకించుచుండెను. అప్పట్టున గీష్పతి వాస్తోష్పతికిం గొన్ని నీతులు చెప్పం దలంచి యాకొలువుకూటంబునకు వచ్చెను. రాజ్యగర్వంబునఁ గన్నుఁగాననియాతం డా సురదేశికురాకం గాంచియు నెఱుం గనియ ట్లూరకుండెను. అవమతికిఁ జాల నొచ్చుకొనుచు నాధిషణుండు నిజగృహంబునకుం బోయెను. పరీక్షిద్రాజా! ఇట్లు రాజ్యమదంబున దేవతానేత గీష్పతిం గీడ్పఱచె. కాఁబట్టి

ఆ. కుపథవర్తు లగుచుఁ గుత్సితదుర్వాచో, నిపుణు లైనవారు నియతి దెలిసి
తొలఁగ లేక వా రధోగతిఁ బడుదురు, తప్పు లేక రాతి తెప్పభంగి.

అని తెలిపి మఱియు నిట్లనియె. అంత దేవపతి దేవదేశికుని యింటికిం బోయి పావనచిత్తుంగా నొనర్పఁ బూనెను గాని యా మాననీయచరిత్రుం డధ్యాత్మమాయం గైకొని యదృశ్యుం డై యుండెను. ఇంద్రుండు గృహంబున వెదకివెదకి ఖిన్నుండై యిల్లు చేరెను.

రాక్షసు లీవిధ మెఱింగిరి. అంద అప్పుడే కూడి భార్గవునిపరిసరంబునకుం బోయి తత్కృపాపాత్రులై యమరులపైకి సమరము చేయఁబోయిరి. త్రిదశులు దర్పంబున వారిఁ దలఁపడిరి కాని శరవిసరవిద్ధసర్వాంగులై దివ్యాస్త్రంబులు మాఱుపలుకమి ఖిన్నులై కాలికి బుద్ధిచెప్పి బ్రహ్మలోకంబునకుం బోయి పంకజాసనుం గాంచి దీనులై మ్రొక్కి గతంబువిన్నవించిరి. వాని పరిదేవనంబు విని వారిజాసనుం డనుకంపాతిశయంబున నభయం బొసంగెను.

ఉ. కట్టిన పాపకర్మమున వేరమిఁ జేసితి రేమి చెప్ప మీ
పుట్టిననాఁటినుండియును బుద్ధులు చెప్పి జగంబు లేలఁగా
బట్టముఁ గట్టి పెంచినకృపానిధి బ్రహ్మకళావిధిజ్ఞుఁ జే
పట్టక గుట్టు జాఱి సిరిపట్టునఁ దొట్టినపాట్ల క్రొవ్వునన్.

ఇట్టి యవమతిం బొందిరి. కాఁబట్టి గురువర్యోపాసకులగు రాక్షసులచే బాధింపఁబడితిరి. కావున నిప్పుడు త్వష్ట యను మనువుతనయుండు విశ్వరూపుం డనుమునివర్యు నాశ్రయింపుఁడు; ఆతం డెట్టియిక్కట్టుల నైన నివారించు నన విని దేవతలా విశ్వరూపుపాలికిం జని తమయిడుమల విన్నవించి గురుత్వం

బంగీకరింపుఁడూ యని ప్రార్థించిరి. విశ్వరూపుం డాపన్నులగు దివిజులం గాంచి గురుతిరస్కృతిం జేసి మీరిట్లు కడు నిడుమలఁ బడితి రని బదఁటె పదంపడి సర్వాపత్పరిహారకం బగు నారాయణ కవచం బుపదేశించెను.

ఇంద్రుం డతిభక్తి నారాయణకవచంబుం బరిగ్రహించి నియమంబున నార్చి తదుక్తప్రకారంబున సర్వాంగంబుల దారి భావించి ముకుళితకరకమలుండై

చ. గరుడునిమూఁపుపైఁ బదయుగంబు ఘటిల్లఁగ శంఖచక్రవ
ర్మరుచిరశార్ఙ్గఖడ్గశరరాజితపాశగదాదిసాధనో
త్కరవికరంబు లాత్మకరకంజములన్ ధరియించి భూతిసం
భరితమహాష్టబాహుఁడు కృపామతితో ననుఁ గాచుఁ గావుతన్.

అను మొదలగు దివ్యస్తుతిరాజంబుల స్తుతియించె. రాజేంద్రా! యీనారాయణకవచప్రభావం బచింత్యంబు. సర్వరోగంబులు దీనిం బఠించినఁ దొలంగు. సర్వకామంబులు ఫలించు.

అంత నింద్రుండు తత్ప్రభావంబున రిపుల జయించి విజయశ్రీయుతుండై నిజరాజ్యం బేలుచుండెను. విశ్వరూపుండు తల్లియందలివిశ్వాసంబున యజ్ఞభాగంబుల నమరులకుం దెలియకుండ నసురులకు నిచ్చుచుండెను. ఆవిశ్వరూపమునకు శిరస్త్రయంబు గలదు. ఇంద్రుం డావిధం బెఱింగి యాగ్రహంబు పట్టంజాలక గురువనితలంపక యాతనిశిరమ్ములమూఁడింటినిఖండించెను. ఆమనతలలు మూఁడింటిలో సోమపానంబుసేయుశీర్షము కపింజలంబయ్యె. సురాపానంబొనరించుమస్తకంబు కలవింకం బయ్యె. అన్నంబుఁ దినుతల తిత్తిరి యయ్యె. ఇట్లాశీర్షత్రితయంబు

పక్షిరూపంబులం దాల్చి బ్రహ్మహత్యయై యేతెంచి యింద్రునిఁ
జుట్టుకొని తమ్ముఁబరిగ్రహింపు మని నిర్బంధించెను.

ఆ బ్రహ్మహత్యలబాధకుం దాళఁజాలక మహేంద్రుండు
భయాకులమానసుండై వానిం బరిగ్రహించి యొక్కసంవత్సరం
బా బాధల ననుభవించెను. ఆవల వాని నెట్లైనం బాపు
కొనం జూచి దీనుండై భూజలవృక్షస్త్రీలం బ్రార్థించి నాయీపరి
తాపంబుల నాలుగుభాగంబులుగా నొనరించి పుచ్చుకొనుం డనియె.
వార లంగీకరించిరి. అందు భూమి తనయందుఁ జేయంబడు
ఖాతంబు తనంతన పూడునట్టివరంబును, జలంబు తనయందుఁ
బ్రక్షాళితం బైన యేవస్తువైనను బావనం బగునట్టివరంబును,
వృక్షంబులు ఛేదింపంబడినను బునః ప్రరోహంబు గలుగువరం
బును, స్త్రీలు సదా తమకుఁ గామసుఖంబులు గలుగునట్టివరం
బును గోరిరి. శచీనాథుం డవ్వాని నట్లె యొసంగెను. అంత
భూమ్యాదులు బ్రహ్మహత్యాభాగంబులం గొనియె. భూమిచవుటి
నేలగను, జలంబు బుద్బుదఫేనరూపంబునను, వృక్షంబులు
నిర్యాసభావంబునను, కాంతలు రజోవికారంబునను దాని నను
భవించునట్లు తెల్పిరి. ఇట్లు నాలుగుభాగంబులుగా బ్రహ్మహత్యా
నిర్ముక్తిం గాంచి యింద్రుండు యథారీతిగా నుండెను.

## వృత్రాసురకథ

పాఠకులారా! ఎన్నిపాట్లు పడినను దాఁ జేసినదుష్కృత్య
మనుభవింపక నశింప దనుట గ్రహింపుఁడు. చేయరాని కార్య
ముల నొనరించి వాని నెట్లో తప్పించుకొనంతమాత్రమున వాని
యనుభవము తమకుఁ దప్పినదని కొందఱు దేవానాంప్రియులు
భావింతురు. అది మిగులఁ బొరపాటు. బుద్ధిపూర్వకముగ నొన

రించిన దుష్కృత మనుభవించినఁ గాని నశింపదు. ఇంద్రుఁడు బ్రహ్మహత్యను ఇతరుల ననుభవింపఁ బ్రార్థించి తాను దప్పించుకొనియెఁగదా యని ప్రశ్నింపకుఁడు. అట్లు తప్పించుకొనుట సాధ్యము కాదనినమ్ముఁడు. త్రిలోకాధిపతియైన శతక్రతువులాచరించి త్రిమూర్తులను దలంచినపుడు చూడఁదగినంతపుణ్యమొనరించిన యింద్రుఁడొక సంవత్సర మాపాపము ననుభవించెను. ఆవల నాల్గుభాగముల నితరుల ననుభవింపఁజేసెను. అంతలో నది యాయనను వదలలేదు. ముందా యింద్రు నెట్లు బాధించెనో మీ రెఱుంగఁ గలరు. ఇఁకఁ గథ వినుఁడు.

త్వష్ట విశ్వకర్మతండ్రి. ఇంద్రుండు తనకొడుకును ద్రుంచుట యెఱింగెను. పుత్రశోకము దుస్సహము గాన దాని ననుభవించెను. శక్తియుక్తుఁ డగువాఁడు దుఃఖపడుటతోడనే తృప్తినొందఁడు కాన నాదుఃఖపదమున నాగ్రహమును బ్రవేశింపఁజేసెను. ఆగ్రహ మగ్నివంటిది. అది యెవరినైనను బాధింపక చల్లారదు. త్వష్ట దుఃఖమును మాని శతమఖమారణము చేయఁబూని యాభిచారికహోమం బొనరించెను. అభిచారిక మనునది క్రూరకర్మము. ఇతరులబాధించుటకో చంపుటకో చేయుకార్యమని దానియర్థము. ఆదేవతలు క్రూరస్వభావులుగా నుందురు. హోమద్రవ్యము లట్టివే. అది హింసాప్రధానకర్మమని తెలిసికొనఁదగినది. ఆహోమము పూర్తికాఁగా నాయగ్ని గుండమునుండి కల్పాంతకాకారవిస్ఫురితకీలానలనిష్ఠురేక్షణగుణక్షుభ్యత్త్రిలోకుండగు నొకబాలకుండు వెడలివచ్చెను. ఆతనిం జూచినంతనే యందలివారందఱు భయంబడిరి. ఆతనికి వృత్రుఁ డను నామకరణ మొనర్పఁబడెను. ఆపసితనమునందే యాతని ప్రతాప మోర్వ

రాని దని యెంతయుఁ దోఁచెను. ఓర్వఁజాలక దేవత
లాతనిం జుట్టుముట్టి శస్త్రాస్త్రంబుల ముంచిరి. ఆ యాయుధ
ముల నాబాలకుం డూరక మ్రింగెను. ఆపద్ధతిం గాంచి పురంద
రాదిబృందారకులు డెందంబులం బుట్టిన భీతిని దశదిశలకుం
బాఱి రక్షకుఁ డెవ్వఁడగునా యని వెదకసాగిరి. అంతట
నమరు లందఱు ఒకచోటం జేరి యాలోచించి యాపద్బాంధ
వుండు పుండరీకాక్షుండు గా కన్యుం డొకండు కలఁడే యను
నిశ్చయంబున వైకుంఠంబున కరిగి భక్తివినయతాత్పర్యంబు
లొప్పుచుండఁగా,

చ. “ఉదకమయంబునన్ వసుధ నోడఁగఁ జేసి తనర్చుకొమ్మునన్
పదిలత యొంటఁ గట్టి మనువల్లభుఁ గాచిన మత్స్యమూర్తి స
మ్మదమున మమ్ముఁ బ్రోచు ననుమానము మానఁగ వృత్రుచేతియా
పదఁ దొలఁగించి నేఁడు సురపాలురపాలిటిభాగ్యదైవమై.”

అని యిట్టి స్తుతుల ననేకంబుల స్తుతియించిన నారాయణుండు
కరుణావారిరాశి వారికిఁ బ్రత్యక్షంబయ్యె. అత్తఱి

సీ. “తగు శంఖచక్రగదాధరుం డగువాని శ్రీవత్సకౌస్తుభ శ్రీలవానిఁ
గమనీయమాణిక్య ఘనకిరీటమువాని దివ్యవిభూషణ దీప్తివాని
మండితకేయూర కుండలంబులవాని సిరి యురస్థలమునఁ జెలఁగువాని
దనుఁ బోలు సేవక దండంబుఁ గలవాని జిలుఁగైనపచ్చని వలువవానిఁ

ఆ. దెల్లదమ్మివిరులఁ దెగడుకన్నులవాని, నవసుధార్ద్రవంపు నవ్వువానిఁ
గనిరి వేల్పువిందు కప్పురపాటుతోఁ, గన్నులందు నున్న కఱవు దీఱ.”

కనినంతనే వారు ముకుళితకరాంజలులై భయభక్తు లొలయ
సానదంబున

సీ. "దండంబు యోగీంద్రమండలనుతునకు దండంబు శార్ఙ్గకోదండునకును
దండంబు మండితకుండలద్వయునకు దండంబు నిష్ఠురఖండునకును
దండంబు మత్తవేదండరక్షకునకు దండంబు రాక్షసఖండనునకు
దండంబు పూర్ణేందుమండలముఖునకు దండంబు తేజఃప్రచండునకును
తే. దండ మద్భుతపుణ్యప్రధానునకును, దండ ముత్తమవైకుంఠధామునకును
దండమాశ్రిత రక్షణతత్పరునకు, దండ మురుభోగినాయకతల్పునకును."

అని నతులు సమర్పించి వృత్రదానవభీతి రానుండుటఁ దెలిపి మాకింక దిక్కు నీవే కదా యని ప్రార్థించిరి. ఆమాటల భావార్థతాత్పర్యంబుల కలరి శ్రీమన్నారాయణుండు దరహసిత వదనుండై మృదుమధురభాషణంబులతో దేవతలారా! మీ నుతులు నా కెంతయు సంతసంబు నీయంజాలె. మీకు మే లయ్యెడు. భయపడకుఁడు. ఇఁక మీభయంబు నశియించువిధంబు వినుండు. నాభక్తుండు దధీచి యను మహాముని కలండు. ఆమునిశరీరంబు మద్విద్యాతిశయమహత్త్వంబునఁ దేజోవిశే షంబున భాసురంబై సారవిమంబై యుండు. దానిం బరిగ్రహిం పుఁడు. ఆముని వదాన్యులలో వదాన్యుఁడు. తప్పక వేఁడిన మీ కిచ్చు. ఆయనశల్యంబులె విశ్వకర్మనిర్మితంబులై శతధారలు గల యాయుధశ్రేష్ఠంబగు. అదియు మత్తేజోపబృంహితంబై వృత్రాసురశిరోహరణకారణంబై యుండు. దానంజేసి మీకు మరలఁ ద్రిలోకాధిపత్యంబు సుస్థిరంబుగ నిలువం గలదు. మీకు శత్రుబాధ లడంగు నని యాదేశించి యంతర్హితుం డయ్యె.

అంత నమర్త్యులు పరిహృష్టాంతరంగులై సముద్రమధ్య భాగమున నున్న దధీచిమునికడకుం జని యాతనిసమాధికి మెచ్చుకొనుచు నమస్కరించి వినయ మట్టిపడుచుండఁగా

ఆ. "దేహిసుఖము గోరి దేహంబు ధరియించు, దేహి విడువలేఁడు దేహ మెపుడు
దేహి యస్మదీయ దేహంబుకొఱకునై, దేహ మీఁగదయ్య దేవతలకు."

ఉ. "ఎక్కడ నెల్ల లోకముల నెవ్వరు గోరనికోర్కె నేఁడు మా
కెక్కలిపాటుకై తివిరి దేహము వేఁడఁగ వచ్చినార మే
మెక్కడ తీవ్రకర్మగతి యెక్కడ దైవకృతంబు గాక యీ
రొక్కపుదాన మీవరుస రోయక వేఁడుదురే జగంబులన్."

క. "అడుగంగ రాని వస్తువు లడుగఁగ బ్రలిమాలి యెట్టి యర్థుల నిను నే
మడిగితిమి దేహ మెల్లను గడు నడిగెడువారి కేడ కరుణ మహాత్మా."

అని వేఁడిరి. ఆమాటల కమ్ముని యాగ్రహమ్ము నొందక యను
గ్రహసముగ్రమానసుండై

ఆ. ఎలమి బ్రదుక నిచ్చు నెనసినవారికి, దేహ మెల్లభంగిఁ దీపు గాదె
యచ్యుతుండు వచ్చి యర్థించె నేనిని, దన్ను నిచ్చునట్టి దాత గలఁడె."

అని పలికి దేవతలారా! యర్థ మడుగుయాచకులు గలరు. దేహ మడిగెడి యాచకుండు లేఁడు. యాచకవాంఛాపరిపూరణసమర్థులగు దాతలు గలరు గాని తనదేహ మీనేర్చు దాత లేఁడు. ఒకప్పుడు తనదేహ మిచ్చుదాత యుండుగాక. అట్టివానిం జాపునట్టి యాచకుఁడుండునా. అథవా చంపునుబో. శిలక్షఁబుల నన్నింటినేజేపించుకొను యాచకు లుందురా. మీరు లోకజాలము రక్షింపఁబూనుపాలకులు. మీకెట్లిట్లు హింస చేయఁబుద్ధి పుట్టెనో మీకెట్లు ప్రాణములుతీపో ఇతరుల కట్లేయని తలంపవలదా. అని నేర్పుమైఁ బ్రశ్నించెను. దేవతలామాట లాలకించి

తే. "సర్వభూతదయాపరస్వాంతులకును బుణ్యవర్తను లగు మిమ్ము బోఁటివారి
కమితసత్కీర్తికాముల కలుషమతుల, కియ్యరానిపదార్థంబు లెవ్వి గలవు."

ఆ. "అడుగరాని సొమ్ము నడుగరా దని మాను,డడుగు వానిమాటలడుగ నేల?
భ్రాంతి నడుగుచోటః బ్రాణంబు లేదని,యిచ్చువాఁడు దాఁపఁడిచ్చుఁగాని."

అని పలుక దధీచిమహాముని దరహాసంబు మోమున నాట్యము
సల్ప నఖిలలోకధర్మం బెఱింగియు నొక్కింత కాలంబు ప్రీతి
వాక్యం బిచ్చితి. సహింపవలయు నని ప్రార్థించి మీ యట్టి
వారి కుపకృతి గలుగునేని యీతుచ్ఛదేహంబుతో నింకఁ
జేయవలసిన దేమని నుడువుచు శ్రీమత్పరబ్రహ్మంబును దలం
చుచు శరీరంబు వదలెను. అప్పు డింద్రుం డాశల్యంబుల విశ్వ
కర్మ నిశితశతధారాసమావృతంబై వెలుంగు వజ్రాయుధంబుగా
నమరింప దానిం గైకొని యైరావతంబు నెక్కి సకలదేవతలు
పరివేష్టింప వృత్రాసురునిపైకిం బోయెను.

వృత్రుండు నుద్దండలయకాలప్రచండచండభానుంబోలె
దుర్నిరీక్ష్యతేజోవిభాసురుండై దానవబలంబులు గొలువ ననికి
నడచెను. ఇరుదెగలవారును పోరు ఘోరంబుగాఁ జేయఁదొడం
గిరి. ఆసంకులసమరంబు కొంతకాలంబు చెల్లె. అంతట దేవాధిప
వృత్రాసురులు తలపడి దుర్భరభంగి యుద్ధ మొనర్చిరి. గెలు
పోటములు నిర్ణయింప వీలులేక యుండెను. వృత్రుని దెబ్బకు
నైరావతము తల్లడిల్లెను. దానిని నేదదేర్చుచుండఁ గులిశంబు
జాఱి క్రిందఁబడియెను. ఇంద్రుఁడు లజ్జించి మోము వంచి
యుండఁగా వృత్రాసురుం డింద్రునిం జూచి నవ్వుచు

క. "దురమునఁ గైదువు వదలిన,శరణన్నను వైరిజనులఁ జంపరు వీరుల్
వెఱఁ గంద నేల కులిశము,కర మరుదుగఁ బుచ్చికొనుము కాచితినింద్రా."

అని నీతి మెఱయఁ బలికినవృత్రాసురుని దైవముగాఁ దలంచి
యింద్రుండు దానవేంద్రా,

ఉ. "లోకము లెల్ల నిండి తనలోనుగ సర్వముచేసి ప్రాణులన్
దీకలఁ బెట్టి యెల్లెడలఁ ద్రిప్పులు చూపెడు విష్ణుమాయ నేఁ
డేకమతిం దలంచి తివి యేల మహాసురరూపు మాని సు
శ్లోకుఁ బురాణపూరుషుని శోభనమూర్తి ధరింపు మింపునన్."

ఉ. ఏనియమంబు సల్పితివొ యెట్టి మహాతప మాచరించితో
పూని రజోగుణాభిరతిఁ బొందిన నీమతి శాంతిదాంతిస
న్మానసమానసానుభవ మత్తమరాళుల రోషభావస
మ్మానుఁ డమేయుఁ డాదనుజమర్దను భక్తి పొసంగె నెంతయున్.

క. నారాయణరూపామృత, పారావారమునఁ దేలు భక్తుఁడు దా భూ
దారకృతఖాతకోదక, పూరంబున నేల తృప్తిఁ బొందు మహాత్మా".

ఇట్లింద్రుండు పలుకుచుండ వృత్రుండు యుద్ధోన్ముఖుండై తలపడ శతముఖుండును వెనుదీయక మార్కొన వృత్రాసురుం డైరావతంబుతో నింద్రుని మ్రింగెను. అప్పుడు

ఉ. "కందఁడు భీతిఁ గుందఁడు ప్రకంపన మొందఁడు పెద్దనిద్దురం
జెందఁడు తత్తఱింపఁడు విశేషము జొప్పఁడు వైష్ణవీజయా
నందపరైకవిద్యను మనంబునఁ దాల్చుచు నుండెఁ గాని సం
క్రందనుఁ డానిశాచరునిగర్భములో పరిరక్షితాంగుఁడై".

ఇట్లు శ్రీమన్నారాయణకవచప్రభావంబున నుండి తన యోగబలంబున నతనియుదరంబును గులిశంబున భేదించి యైరావతసహితుండై వెడలి వజ్రంబున నాతనికంఠంబు ఛేదింప వృత్రాసురుండు గతాసువై యిలం గూలెను. అత్తఱి

ఆ. "ఏమి చెప్పవచ్చు నింద్రారితనువున, నొక్క దివ్యతేజ మచ్చి వెడలి
లోక మెల్లఁ జూడ లోకులు చూడ నీ, లోక మరసి విష్ణులోను జొచ్చె."

ఇట్లు వృత్రుండు పడఁగిన నావెనుపాపంబు విశ్వరూపం బుతోఁ బోడచూపి వెను దగులఁగా శతమఖుండు నలుదెస లకుం బరుగిడి పరుగిడి యెందును నిల్వఁజాలక మానససరో వరంబుం జొచ్చి యం దొక్క కమలనాళంబునం దూఱి యందుఁ దంతువులం గలిసి రూపంబు లేక యుండె. బ్రహ్మహత్యయు నాచోటు ఈశ్వరదిక్కగానఁ బ్రవేశించి యింద్రునిఁ బాధింపఁ జాలకుండెను. పదంపడి నిరంతరనారాయణధ్యానబలంబున నా బ్రహ్మహత్యభీతిం బాసి శంకరుననుకంపామహిమంబున రక్షింపఁ బడి శచీదేవి బృహస్పతి నారాధించి ప్రసన్నుం జేయఁ దదా శిషంబుల మరల నింద్రపదవిం బొంది యశ్వమేధంబు లొన రించి యథారీతిగా రాజ్యంబుం బాలించుచుండెను.

## చిత్రకేతూపాఖ్యానము

అనిన విని పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగీంద్రుం జూచి మహాత్మా మహాక్రూరకర్ముఁడగు వృత్రుఁడు సుజ్ఞాని యెట్లయ్యెను. యుద్ధరంగమున నమరేంద్రు నెట్లు నొప్పించెను తెలుపుమనా యన యోగి యిట్లు చెప్పెను. ఓరాజేంద్రా! తొల్లి కృష్ణద్వైపా యనుండును నారదదేవలమహర్షులు నా కెఱింగించినవిధంబు నీ ప్రశ్నమునకు నుత్తరం బగు వినుమని యిట్లు చెప్ప మొద లిడెను.

పూర్వము శూరసేనదేశములని పేరుగాంచిన భూములఁ బాలించు నరపతి చిత్రకేతువు నా విఖ్యాతుఁడు గలఁడు. ఆతనికిఁ బెక్కుమంది పత్నులు గలరు. ఎవరియందుఁగాని యా నరపతి సంతానమును బడయఁజాలకుండెను. ఎన్ని భోగ

భాగ్యము ఉండినను సంతతి లేనికొఱత యాతని బాధించుచునే యుండెను. తద్దుఃఖమున నాతఁడు సదా విషణ్ణచిత్తుఁడగుచుండెను. ఒక్కదివసంబున నారాజునింటి కంగిరసుఁ డనుమునిపతి యరుదెంచెను. రాజా మునిరాజును యథాశాస్త్రముగాఁ బూజించెను. దాన నతఁడు పరమానందభరితుఁడై కుశలప్రశ్నములను జేసి రాజేంద్రా! సకలవిధములలోపము లేని నీవిపుడేల ఖిన్నుఁడవై యున్నవాఁడవు తెల్పుమని ప్రశ్నించెను. చిత్రకేతు వామునిం గాంచి మహాత్మా, ధ్యానబలంబున సర్వ మెఱింగిన మీకు నేఁ జెప్పవలసిన దేమున్నది! అని యేమియు విశేషించి పలుకక యూరకుండెను. ముని యాతనికొఱంత నెఱింగి, భూపాలశేఖరా! నీ కొఱంత నెఱింగితిని. నాచెప్పినట్లుచేసిన నీకుం గుమారుండు కలుగు నని తానే యాతనిచేఁ బుత్రకామేష్టి చేయించి యజ్ఞశేషపదార్థంబు తొలిపత్ని యగు కృతద్యుతి కొసంగెను. ఆమె గర్భముం దాల్చి కుమారునిం గనెను.

ఆ సమయమున నాచిత్రకేతు మనస్సున సంతోషమిమ్ముడక యుప్పొంగెను. ఒడలు తెలియకుండఁ జేసెను. విప్రప్రవరులు లోనగువారి కెల్ల వలసిన ధనంబు లిచ్చెను. జాతకర్మాది విధులు నిర్వర్తింపఁబడియె. కుమారుఁడు శుక్లపక్షశీతద్యుతివలె దినదినప్రవర్థమానుండై యుండెను. కుమారుఁడు కలిగినది మొదలాభూపతి కృతద్యుతియందే బద్ధానురాగుఁడై యుండెను. దాని కోర్వఁజాలక తక్కిన పత్నులాభూపతి కింతప్రీతి తొలి లలనయందు నొలయుటకుఁ గారణము తనయుండే కదా. వీనిం బొలియించినచో నీప్రీతితగ్గునని చింతించి యాబాలునకు విషంబిడి చంపిరి. నిద్రించువానివలెఁ గుమారుఁ డుండ నింతసేపేటి

నిద్ర యని దాది యూహించి మృతుం డయ్యె నని యెఱింగి యాక్రోశించెను. తల్లియెఱింగి బిట్టురోదనముఁగావించెను. రాజమందిరం బెల్ల దుఃఖపూరనిమగ్న మయ్యెను. రాజున కా దుర్వార్త యమితశోకము నొసఁగెను. రాఁ జనుదెంచి నిశ్చేష్టుం డయ్యెను. ఎవరు నాతని దుఃఖమును దీర్చువారు లేకుండిరి. అంత నంగిరసుఁడు నారదమానితోడ నతనికడ కరుదెంచి మృతుని చెంత మృతునిభంగిఁ బడియున్న రాజుం గాంచి

సీ. "నీకు వీఁ డెవ్వఁడు? నీ వెవ్వనికి శోక సంతాప మందెదు సార్వభౌమ
పుత్త్రమిత్త్రాదులు పూర్వజన్మంబున నెవ్వనివారలో యెఱుఁగఁగలవె
యొదల నదీవేగమున నాడకాడకునికతంబు గూడుచుఁ జెదఱుచుండు
నారీతిఁ బ్రాణుల కతికాలగతిచేతఁ బుట్టుట చచ్చుట పొసఁగుచుండు
ఆ. గాన భూతములకుఁ గలుగుభూతంబులు,మమతతోడ విష్ణుమాయఁ జేసి
దీని కడల నేల? ధృతి దూలఁగా నేల?,బుద్ధిఁ దలఁప వలదె భూతసృష్టి"

అని యనేకనీతుల నుపదేశించెను. ఆజ్ఞానోపదేశమున రాజు తెలివొంది చేతులు మోడ్చి యతివేషము లూనిన మీ రెవ్వరు? అని ప్రశ్నించెను. అంగిరసుం డయ్యా నేను నీచేఁ బుత్త్రకామేష్టి చేయించినవాఁడను ఈయన నారదముని యని తెలిపి నీదుఃఖం బపనయింప నరుదెంచితి మని బోధించెను. అంత నారదముని, రాజా నీ కీకుమారునితోఁ బని కలదేమొ కనుఁ గొనుమిదె వీనిఁ బ్రదికించెదనని పలికి యోజీవుఁడా! నీకు శుభం బొనఁగూడ ఈతనువునఁ బ్రవేశింపుము. నీతల్లిదండ్రులదుఃఖం బపనయింపుము. ఆయుశ్శేషం బనుభవింపుము. పిత్రధీనంబైన రాజ్యపదంబున నధివసింపు మనియె. ఆమాటల కాబాలుండు ప్రతివచనం బిచ్చుచు

తే. "కర్మవశమున నెందు సుఖంబు లేక, దేవతిర్యఙ్నృయోనులఁ దిరుగునాఁకు
వెలయ నేజన్మమందునో వీరు తల్లిదండ్రులయినారు చెప్పవే తాపసేంద్ర."

క. "సతు లెవ్వరు? సుతు లెవ్వరు?, పతు లెవ్వరు? మిత్రశత్రుబంధుప్రియసం
గతు లెవ్వరు? సర్వాత్మక, గతుఁడై గుణసాక్షియైన ఘనుఁ డొక్కనికిన్."

అని పలికి చిత్రకేతుం గాంచి నాకును మీకు నెక్కడి సంబంధంబు? మీరు దుఃఖింపఁ బని లేదు. జ్ఞానంబు సంపాదింపుము. తరింతు వని పలికి జీవుండు పోయెను. చిత్రకేతుండును వానిబంధువులు విస్మితులైరి. అంతఁ జిత్రకేతుం డాతనయునకు నౌర్ధ్వదైహికంబు లొనరించి కాళిందికిం బోయి స్నానమొనరించి నిర్మలాంతఃకరణుండై నారదునకు నమస్కరించెను. ఆముని యాభూపాలునకు భగవన్మంత్ర ముపదేశించెను. పిదప నంగిరసుం గూడి బ్రహ్మలోకంబునకుం బోయెను.

చిత్రకేతుండు నారదోపదేశంబునఁ బవిత్రచిత్తుండై నిరాహారుఁడై భగవంతు నేడురాత్రంబు లారాధించెను. దాన విద్యాధరాధిపత్యంబు రత్నవిమానంబును లభించె. భగవదనుగ్రహంబును గలిగెను. దానఁ ద్రిజగంబులనుఁ దిరుగుచుఁ గొన్ని దినంబులకు నొక్కచోట

సీ. "తారహారపటీర ధవళదేహమువాని రమణీయనీలాంబరంబువాని
మణికిరీటస్ఫురన్మస్తకంబులవాని కంకణకేయూర కరమువానిఁ
గర్బురమయదీప్త కటిసూత్రములవానిఁ దరళయజ్ఞోపవీతములవాని
సలిసుప్రసన్నవక్త్రాంబుజంబులవానిఁ దరుణవివృత్త నేత్రములవాని

ఆ. సిద్ధమండలంబు సేవింపఁ బుణ్యప్రసిద్ధి వెలసినట్టి యిద్ధచరితుఁ
బద్మలోచనునకుఁ బాదపీఠంబైన, ఘనునిఁ బన్నగేంద్రుఁ గాంచె నతఁడు."

కన్నంతనే భక్తివినమ్రకంధరుండై నమస్కరించి వినయ మొప్పారఁగా

తే. "అరయ బ్రహ్మాదులెవ్వని కనుఁగొనంగ, భక్తియుక్తుల మనములఁ బ్రస్తుతింతు
రవని యెవ్వనితలమీఁద నావగింజ, పోలు నా వేయిశిరముల భోగిఁ గొల్తు."

అని నుతించెను. ఆనుతుల కలరి యనంతుఁడు తనవిధం బెఱింగించి ముక్తుండ వైతి వని యాశీర్వదించి యదృశ్యుం డయ్యెను.

చిత్రకేతుఁ డవ్వల నాదివ్యవిమానం బెక్కి తిరుగుచు భగవంతునిం బాడుచుం బోవుచు వలసినచోటుల నిలుచుచు నొక్కనాఁడు కైలాసంబు చెంతం బోవుచుండి

క. "ఆరజతభూధరంబున, నీరేజభవామరాది నికరము గొల్వం
బేరోలగమున నుండిన, గౌరీయుతుఁ డైనహరునిఁ గనియె నరేంద్రా."

సీ. తననిజరూప మింతయు నున్కి తెలియక, వాదంబు చేసెడు వేదరవముఁ
గరుణావలోకనా కాంక్షితులై యున్న బ్రహ్మాదిసనకసంప్రణుతిరవము
సారశివానంద సల్లాపముల నొప్పు ప్రమథగణాళియార్భటరవంబు
డమరుమృదంగాది ధమధమధ్వనితోడి పటుభృంగినాట్య విస్ఫారరవము
తే. మానుగాఁ జామరలు వీచు మాతృకాది
కామినీజనమహితకంకణరవంబు
మెండు చెలఁగంగఁ గన్నులపండు వయ్యెఁ
గొండరాచూలిపెనిమిటి నిండుకొల్వు."

అట్లు గాంచి బ్రహ్మాదిసేవితుండయ్యుఁ దనయూరుతలంబున గౌరి నునుచుకొని యున్న పరమేశ్వరుం గాంచి చిత్రకేతుండు పకపక నవ్వెను. అంతట నూరకుండక యామె వినుచుండఁగానే జంకు లేక,

సీ. లోకవరోత్కృష్టుఁడా లోకగురుఁడును గడలేని ధర్మస్వరూపంబు దానయగుచు
జటలు ధరించుచు సంభావితమునఁ బొడవైన యీ యోగిపుంగవులును
బ్రహ్మవాదులుఁ గొల్వఁగా నిల్లుకొని స్త్రీమిథునరూపంబున మెలఁతతోడఁ
బ్రాకృతుండును బోలె బద్ధానురాగుఁడై లాలితుం డయ్యె నిర్లజ్జత నిట
తే. సకల! ప్రకృతిపురుషుఁడైనఁ దా నేకాంత,మందు సతులతోడ నలరుఁ గాని
యిట్లు ధర్మసభల నింపులతోఁ గూడి,పరిథవింప లేఁడు భ్రాంతి నొంది.

అని పలికెను. ఈశ్వరుఁ డా మాటలు వినెను. ఏమియుం బలుక లేదు. పక్కన నవ్వెను. ఆసభలోనివా రేమియు పలుకకుండిరి. అంతటఁ జిత్రకేతునియుపహాసమునకుఁ బార్వతి యోర్వక సభ్యులారా! వీఁడెవఁడు గదా వీని ప్రల్లదములు. సనకాదిమునిధ్యేయుని శంకరునితత్త్వము నీతుచ్ఛుఁ డెఱుంగఁగలఁడా! మహర్షులవివేకమునవా భగవంతుని సేవించుట? అని మఱియు నాగ్రహంబు పెర్మిని జిత్రకేతుని సభ్యులకుం జూపి

సీ. ఎవ్వనిపదపద్మ మింద్రాదిబుధుల చూడాగ్రపంక్తులనీడఁ జూచు
నెవ్వనితత్త్వం బడెనయుంగ బ్రహ్మాది యోగిమానసపంక్తి నోలలాడు
నెవ్వనిరూపంబు నేర్పాటు గానక వేదంబు లందంద వాద మడుచు
నెవ్వనికారుణ్య మీలోకముల నెల్లఁ దనిపి యొంతయుఁ ధన్యతములఁ జేయుఁ
తే. నట్టి సర్వేశుఁ బాపసంహారు ధీరు,శాశ్వతైశ్వర్యు నాత్మసంసారు నీశు
నెగ్గు పల్కిన పాపాత్ముఁ డెల్లభంగి,దండనార్హుండుగా కెట్లుకలుఁగఁగలఁడు.
తే. నిఖిలలోకాశ్రయంబు సన్నిహితసుఖము,సకలభద్రైకమూలంబు సాధుసేవ్య
మైన కంజాక్షు పాదపద్మార్చనంబు ననుసరింపంగ ఖలుఁడు వీఁడర్హుఁడగునె.

అని పలుకుచుఁ జిత్రకేతువుం గాంచి దురాత్మకా! ఈపాపంబునకు ఫలంబుగా నీవు రాక్షసయోనింబుట్టు మని శపించి యింతనుండి మహాత్ముల నవజ్ఞ చేయకుండు మని పలికెను.

ఈమాటలు వినఁబడఁగనే చిత్రకేతుఁడు విమాన ముడిగి యా జగజ్జననికి నమస్కరించి చేతులు జోడించి తల్లీ! నాదుష్కర్మము నన్నింతకుం దెచ్చెను. ఈశాపమునకు దుఃఖిం పను. జగన్మాతయగు నిన్ను నిట్లు పలికిన దోషమునకే శంకించు వాఁడను. తల్లీ క్షమింపుము. నాయీయపరాధమును మన్నిం పుము. ఇఁక నెన్నఁడు నిట్టి యవివేకమునకు నామదిఁ జోటీయ నని పలికి పార్వతీపరమేశులఁ బ్రీతులఁ జేసి విమాన మెక్కి పోయెను. ఆచిత్రకేతువే ఆశాపంబునఁ ద్వష్ట చేయుయజ్ఞంబున దక్షిణాగ్నియందు దానవయోనిం బుట్టి జ్ఞానసంపన్నుఁడు గా నుండెను. రాజేంద్రా! ఇది వృత్రాసురపూర్వకథ. ఇఁక నేమి వినఁ గోరెదవో తెల్పు మని పలికెను.

ఇది షష్ఠస్కంధము.

---

# సప్తమస్కంధము

## శ్రీహరిద్వారపాలకులకు శాపము గల్గుట

పరీక్షిన్మహారాజా యోగిపుంగవునకు ఆలించి భక్తిభారంబున నిట్లు ప్రశ్నించెను. 'యోగీంద్రా! సర్వభూతసముండగు శ్రీహరి దేవేంద్రునినిమిత్తమై దానవుల వెదకి వెదకి చంప నేల? ఈశంకను మాన్పుమా' యని వేఁడెను. శుకయోగియు రాజేంద్రా! నీప్రశ్నము పరమపవిత్రమైనది. భగవల్లీలల నాలకింపఁ గుతూహలుఁడ వగుచునీ వడిగిన విషయమునకు బదులు చెప్పెద. వత్సా!

క. చిత్రంబులు త్రైలోక్యప, విత్రంబులు భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజనవన, చైత్రంబులు విష్ణుదేవుచారిత్రంబుల్.

కాన నవి వినఁ దగినవి. సావధానుఁడవై యాలకింపుము. భగవంతునకు శత్రుమిత్రభావంబులు లేవు. సర్వసాక్షి. సర్వసముండు కాని సత్వగుణంబునకు వృద్ధియు రజస్తమోగుణంబులకు హానియుఁ గల్గించునిచ్ఛ గలవాఁడు. కాఁబట్టియే సత్వగుణంబు గలదేవతలఁ బాలింపం బూని రజస్తమోగుణులయిన దానవులఁ జంపుచుండు. ఇదియ దీనిరహస్యము. దీని చరిత్రం బంతయుఁ జెప్పెద.

పూర్వము సనకసనందనసనత్కుమార సనత్సుజాతులను పేరఁబరఁగు బ్రహ్మమానసపుత్రులు నగుమునివరులు దైవవశం

బున నెల్లకడలఁ దిరుగుచు పంచషడ్వర్షసమానవయస్సంయుత కాయులగుచు దిగంబరులయి శ్రీహరిని సందర్శింప వైకుంఠంబునకుం బోయిరి. భగవంతుని దివ్యసౌధంబుఁ గాంచినంతనే ప్రణమిల్లి లోపలం జొచ్చుతఱి ద్వారసీమ నున్న జయవిజయులను నిరువురు పురుషులు ద్వారపాలకులు గాన వారిని వారించిరి. ఎన్నఁడుగాని వారిగమన మప్రతిహతము. ఆనాఁడు భగవంతు నెప్పుడెప్పుడు దర్శింతుమా యని తమకమునఁ జొచ్చుచుండ వారు వారించిరి. ఇంచుకంతయైన పదవు నారయక నిలిపిరి. హుంకరించిరి. చొరరాదు నిలువుం డనిరి.

అత్తఱి యామునులకుఁగల్గిన యాగ్రహమునకు మేర లేదు. భగవంతుని దర్శింపఁబోవఁగా నడ్డుపడు వీ రెవ్వ రని యెంచిరి. దుష్టాత్మకు లిటఁ జేరిరని నిశ్చయించిరి. వెంటనే వారెల్ల నేకవాక్యముగా మీరు మమ్ము నివారించితిరి. ఇది యాసురకృత్యము. కావున మిమ్ముక్షమింప నవకాశము లేదు. మీరు వేగమ యసురయోనిజన్మింపుఁడు. ఇచ్చోటనుండ నర్హులు కారు. రజస్తమోగుణ ప్రధానులరయి యసురులు గండు. ఇంకఁబొండని శపించిరి. ఆశాపము చెవిసోఁకగనే జయవిజయులు కంపించిరి. చేసినపనికిట్టిఫలము గలిగెనే ఇంక గతి యేమని దుఃఖించిరి. భగవదనుజ్ఞ నెఱవేర్చితిమి కదా, ఇట్టిశాపము రా నేల యని విచారించిరి. ఇంక నాలసింపరా దని కృతనిశ్చయులై వారిపాదములం బడిరి. మొఱ పెట్టుకొనిరి. మాయపరాధము లేదు. స్వామియానతిని మిమ్ము నిలిపితిమి. మమ్ము శపింప న్యాయమా? యని దీనాలాపంబు లాడిరి. మాగతి యేమని వ్యసనపడిరి. తమరు పరమ

కృపాసింధులుగాన మన్నింపుఁడని చేతులొగ్గి ప్రార్థించిరి. తుదకు వేఁడుకొన నేర్చిరి.

సనకసనందనాదులు వారిం గరుణించిరి. దూరదృష్టి నవలోకించిరి. ఆఱుజన్మంబుల భగవంతునితో మైత్రినొందిగాని మూఁడుజన్మముల ద్వేషించికాని శాపవిముక్తి నొంది మరల నిం దుండుఁడని శాపవిముక్తిని బ్రసాదించిరి. లోనికరిగి శ్రీమన్నారాయణమూర్తిం దిలకించిరి. కృతార్థుల మైతిమని మనవి చేసిరి. సెలవొంది తమయిచ్ఛం బోయిరి.

ఆజయవిజయులు హిరణ్యకశిపు హిరణ్యాక్షు లన నవతరించిరి. హిరణ్యాక్షుని శ్రీహరి యాదివరాహరూపం బెత్తి వధించెను. హిరణ్యకశిపుండు ప్రహ్లాదు నాత్మకుమారుని హింసించి నరసింహరూపధారి యగు శ్రీహరిచే హింసింపఁబడియె. అనఁ దద్విధం బెఱింగింపు మని రాజు ప్రశ్నింప శుకయోగి యిట్లు చెలిపెను.

## హిరణ్యకశిపుఁడు తపం బొనరించుట

హిరణ్యాక్షుండు మడసినపిదప హిరణ్యకశిపుఁడు శోక దందహ్యమానమానసుండై ఘూర్ణిల్లి సభామండపమున నిలువం బడి త్రిమస్తక, త్రిలోచన, శకుని, శంబర, శతబాహు, నముచి, హయగ్రీవ, పులోమ, విప్రచిత్తి ప్రముఖు లైనదైత్యదానవులఁ బెక్కండ్ర రావించి వారితో నిట్లు పలికెను. రాక్షస ప్రవరులారా!

శా. నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి రణన్యాయైకదక్షుండు బా
హాకుంఠీకృతదేవయక్షుఁడు హిరణ్యాక్షుండు, వానిన్ మహా

సౌకర్యాంగమున దాల్చి దానవవధూసౌకర్యముల్ నీఱుగా
వైకుంఠుండు వధించి పోయె నట యీ వార్తాస్థితిన్ వింటిరే.

అని హెచ్చరించి తన ప్రతాపంబు వినిపింపం దలంచి.

సీ. భుజశక్తి నాతోడఁ బోరాడ శంకించి మున్నీట మునిఁగిన మునుఁగుఁగాక
యాఁగుఁడించి వెనుఁగొని నాయుపలసంభ్రమమున కెఱఁగి వెన్నిచ్చిన నిచ్చుఁగాక
జలదంబు సైపక సౌకర్యకాంతుఁడై యిల క్రిందనీఁగిన నీఁగుఁగాక
క్రోధించి యటుగాక నిజపౌరుషమున హరిభంగి నడరిన నడఁచుఁగాక

ఆ. కఠినశూలధారఁ గంఠంబు విదళించి, వానిశోణితమున వాఁడి మెఱసి
మత్సహోదరునకు మహిఁ దర్పణము సేసి, మెఱసివత్తు మీకు మేలుఁ జెత్తు.

అని పలికి తనపూనికిఁ దనుపగురీతి వారిని బ్రవర్తింపఁ జేయఁ దలంచి దానవులారా! మీరు రిక్షణంబ యరిగి భూలోకంబునం గల మునులతపస్సుల కంతరాయంబుఁ గల్పించి యజ్ఞంబులు పాడుచేసి ధర్మకార్యముల నెల్లెట్లు పాడుసేయఁ దగునో యాయారీతులఁ గార్యముల నిర్వహించి రండని పంపెను. వా రారాక్షసరాజునాజ్ఞ శిరసావహించి యక్కార్యముల నిర్వహింపఁ బోయిరి.

హిరణ్యకశిపుఁ డంతట హిరణ్యాక్షునకుఁ దిలోదకంబు లిడి యతనిబిడ్డలగు శకునిశంబరకాలనాభమహోత్కచుల నింకనుం గలవారిని మెల్లన నాశ్వాసించి సోదరభార్యల రప్పించి ధైర్యముచెప్పి జ్ఞానముపదేశించుచు

సీ. భూపాలకుఁడు నిద్ర వోయెడి నొండేమి విలపింప నేటికి వెఱ్ఱులార
యెవ్వఁడు భాషించు నెవ్వఁ డాకర్ణించు నట్టివాఁ డెన్నఁడో యరిగినాఁడు
ప్రాణభూతుండైన పవనుఁ డాకర్ణింప భాషింప నేరఁడు ప్రాణి దేహ
ములకు వేఱై తాను ముఖ్యుఁడై యింద్రియవంతుఁడై జీవుండువలను మెఱయఁ

ఆ ప్రాభవమున భూతపంచకేంద్రియములనో యింగ జేహముఁను లీలఁ గూడు
విడుచు నన్యుఁడొకఁడు విభుఁడు దీనికి మాయఁ జేసి పగలఁబొరల నేల!

అని యనేకనీతులను దెలిపెను. ఆయుపదేశమున దుఃఖము పోఁగా వారు జ్ఞానంబు నూని భగవంతు నారాధించుటయే తరణోపాయం బని తలంచిరి.

ఆవల హిరణ్యకశిపుఁడు అజరామరభావంబును త్రిజగద్రాజ్యంబును, సాటిలేని పరాక్రమమును, సర్వశత్రువుల నోడించు శక్తియుఁ గోరి యివి తపంబునఁగాని సాధ్యములు కావని తలంచి తీవ్రతపంబు సేయఁ బూని మందరాద్రిద్రోణికిం జనియెను. ఆపర్వతము పావనతమాశ్రమములు వేయము. సకలర్తుఫలసమన్వితము కావున నందొక సిద్ధాశ్రమమున నిలిచి తపంబు చేయఁ బూనెను. కాలివ్రేలు నేల మోపి తదాధారంబున నిలువంబడి బాహువులఁ బైకినెత్తి ఆకసమును అర్ధదృష్టిం జూచుచుఁ బొడవు లగు నెఱ్ఱనిజడలతోఁ బ్రళయకాలసూర్యబింబమా యని తోఁపఁజేయుచు నెవ్వరేఁ దన్ను జక్కఁగాఁ జూడఁజాలక భీతిల్ల మహాభయంకర మగుతపంబు చేయుచుండెను. ఈసమయమున దేవతలు యథాపూర్వముగా స్వర్గము నాక్రమించుకొని రాజ్య మేలుచుండిరి.

అతనితపం బంతకంతకు భయంకరం బయ్యెను. ఆతపాగ్ని భరింపఁ జాలకపోయిరి. అట్టితపశ్శక్తి భూతంబులన్నియు నాకంపించెను. ఆదానవేంద్రుని శిరస్సునుండి పుట్టిన ధూమము లోకమంటలతోఁ దెఱచూడఁ దరంబుగా నుండెను. అప్పుడు దేవతలు కంపించి సురపురి విడిచి బ్రహ్మలోకంబునకుం బోయి బ్రహ్మను జూచి నమస్కరించి చేతులు మోడ్చి వినయ మట్టిపడుచుండ

క. "దితికొడుకు తపముచేసెడి, నతితప్తుల మైతి మింక నలజడి నమరా
వతినుండ వెఱతు మెయ్యెడి, గతి మాకును దేవదేవ కారుణ్యనిధీ.

శా. శంకాలేశము లేదు దేవ త్రిజగత్సంహారముం దేవతా
సంకోచంబును వేదశాస్త్రపదవీసంక్షేపముం లేక యే
వంకం లేవ నటంచు దుస్సహతపోవ్యావృత్తి చిత్తంబుతో
సంకల్పించె నిశాచరుండు ప్రతిసంస్కారంబు చింతింపవే."

అని మొఱ్ఱపెట్టిరి. అంతతో నూరకుండక తపోభీతి తమ్ము బురికొలుపఁగా

మ. భవదీయం బగుచున్న లోన్నతమహా బ్రహ్మైకపీఠంబు సం
స్తవనీయం బగుభూతియుం విజయముం సౌఖ్యంబు సంతోషముం
భువనశ్రేణికి నిచ్చు దైత్యునితపస్స్ఫూర్తిం నివారించి యో
భువనాధీశ్వర కావవే భువనముల్ పూర్ణప్రసాదంబునన్.

అని వెక్కుతెఱంగుల విన్నవింప నా నళినసంజాతుండు విబుధప్రార్థనంబు నూహించి యింకఁ దడవుసేయుట పాడిగాదని నిశ్చయించి భృగుదక్షాదులు వెంటనంటిరాఁగా మందరాద్రి కరుదెంచి యందొకచోట నియమమూని పిపీలికావృతమేదో మాంసచర్మరక్తుం డై వల్మీకతృణవేణుకటలపరిచ్ఛన్నుఁ డై మహాత్తరతపఃప్రభావసంపన్నుండై నీరంధ్రనీరదనికరనివిష్టనీరజబంధుండునుం బోలె నివసించి యున్న హిరణ్యకశిపుం జూచి యచ్చెరువంది యిట్టితప స్సొనరించిన వారి నెన్నండును గాన నని తలంచి మహాప్రీతితో దక్షిణహస్తం బెత్తి

మత్త. ఓసురారికులేంద్ర నీక్రియ నుగ్రమైనతపంబు మున్
చేసిచూపినవారు లే రికఁ జేయువారును లేరు నే

నీసమాధికి మెచ్చితిన్ విను నీయభీష్టము లిత్తు నా
యాస మేటికి లెమ్ము లెమ్ము మహాత్మ కోరుము కోరికల్.
శా. దంశవ్రాతములుం బిపీలికలు మేదఃక్రవ్యరక్తంబులన్
సంశీర్ణంబులుచేసి పట్టి తినఁగా శల్యావశిష్టాండవై
వంశచ్ఛన్నతృణావళీయుతమహావల్మీకమం దింద్రియ
భ్రంశం బింతయులేక నీవు నిలువం బ్రాణంబు లెట్లుండెనో.

హిరణ్యకశిపూ! ఆహారమును జలము నొల్లక యీరీతి నూఱుదివ్యవత్సరములు మేనఁ బ్రాణవాయువుల నిలుప నెవ్వరికేని శక్యమా? నీతపోనియతిం జూడ మహత్తమసంతోష ముప్పొంగుచున్నది. ఇట్టి ఘోరతపంబున నను మెల్లన నోడించితివి. నే నెప్పుడు వాత్సల్యముచేత నీచెంత కేతెంచితిని. నీ కోర్కుల ఫలింపఁ జేసెదను. అని పలుకుచు సడవియీఁగలు లోనగునవి భక్షింప నామమాత్రావశిష్టమై యున్నట్టున్న యా హిరణ్యకశిపు శరీరంబుపయిఁ గమండలుజలంబులు ప్రోక్షించిన నా దానవాగ్రణి యాకమండలూదకంబున నంగంబులెల్లఁ దడుపంబడఁ దపంబు చాలించి తీవ లల్లిబిల్లిగ నల్లుకొని యున్న వల్మీకంబు నెట్లో వదలించుకొని వెడలివచ్చి యథాపూర్వదేహ పరాక్రమంబులు వెలయఁ బుటముపెట్టిన బంగరువలెఁ దను చ్ఛాయయొప్పాఱ మెఱయుచు వచ్చి వినయవినమితోత్తమాంగుఁడై భక్తిభారంబున వాణీప్రాణనాథునకు నమస్కరించి పెక్కుభంగుల వినుతించి గద్గదస్వరంబున మెల్లగా,

క. కోరినవారల కోర్కులు
నేరుపుతో నిచ్చు మనుప నీక్రియ నన్యుల్
నేరరు కరుణాకర నేఁ
గోరెద నీవిచ్చెదేని కోరికల భవా.

ఆకోరిక లెవ్వి యందువేని మహాత్మా! ఆలకింపుము.

శా. గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశ స్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములం దమఃప్రభల భూరిగ్రాహ రక్షో మృగ
వ్యాళాదిత్య నరాదిజంతుకలహ వ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశ యిప్పింపవే.

కరుణాసింధూ! ఇంతియకాదు. యుద్ధంబులం బ్రతిలేని పౌరుషంబును, దిక్పాలకుల [illegible] మహిమంబును, భువనత్రయ విజయంబును దయచేయుమూ యని ప్రార్థించెను.

[illegible] కోరినవరంబు లన్నియుఁ బ్రసాదించి సాదరముగా [illegible] చిఱునవ్వుతోఁ [illegible]

శా. అన్నా! కశ్యపపుత్ర దుర్లభము లీయర్థంబు లెవ్వారికిన్
మున్నెవ్వారలు గోరి రీవరములన్ [illegible] నీవలెన్
నన్నుం గోరినవాఁడ విచ్చితిఁ బ్రవీణత్వంబుతో బుద్ధిసం
పన్నత్వంబున నుండుమీ సుమతివై భద్రైకశీలుండవై.

అని హెచ్చరించి బృందారకులు పరివేష్టింప నిజమందిరమునకుం జనియె.

పాఠకులారా! బ్రహ్మ యిన్నివరముల ననుగ్రహించెను గాని 'ప్రవీణత్వంబుతో బుద్ధిసంపన్నత్వంబున నుండుమూ సుమతివై' అని హెచ్చరించెను. అనగా నీవు సుమతివి కానిచో నీవరములు నీకు ఫలింపవు సుమీ యని బ్రహ్మభావమైనట్లు కనుపట్టు. ఆవిధమెఱుంగక హిరణ్యకశిపుడు మెఱగి ప్రాణంబుల వదలుకొనియెను. ఎట్టిశక్తియున్నను దానిని నిలుపుకొనుటకు సత్ప్రవర్తనమే యుండవలయు. అదిలేనిచో నెంతటిశక్తియున్నను

నిష్ఫలమగు. ధనముల సంపాదించుట యొక్క గొ[illegible] విద్యల
నార్జించుట యొక్క మహిమయు [illegible] సాధుపుల [illegible] ద్వార
ముం బడసి దానిని నిలుపుకొనుట చే [illegible] సత్ప్రి
వర్తనను పెద్దలయందు భక్తి విశ్వాసములు [illegible] శ్రేయము అను
నివి ప్రధానములు. ఇవి లేకున్న నెన్నికోట్లు [illegible] నిష్ఫలము
లగును. సువాసినీలకలకమునకు [illegible] భూష
ణము వినయమును. అది సత్ప్రవర్తనముచే బుట్టునది. అదియుం
డుటయే ప్రధానము. అది యొక్కటి [illegible] శిపుం
డేనాడును. ఇక మన ముసంగా నెంతవారకు [illegible].

బ్రహ్మ యిట్టి వరముల ననుగ్రహించి [illegible] మున
తిరుగగానే హిరణ్యకశిపుడు కృతార్థుడై [illegible] మానంద
మున స్వాంతము వికసింప మన [illegible] కై
వేచియుండు సుందరీజనంబుల నానందింప జేసి మిత్రులను
బంధువుల దక్కుంగల రాక్షసులను రావించి తన యుదంతం
బెల్ల దెలిపెను. వారును ఆశుభవార్తల నాలించి [illegible]నంద
భరకందలితస్వాంతులై చెలరేగిరి. అ[illegible] [illegible]లిడిరి.
ఇక దేవతల మునుల ఇష్టానుసారము బాధించవచ్చునుగదా!
యని సంతసించిరి. మీసములు మెలివెట్టిరి. భుజము లప్పళించిరి.
తొడలు చరచిరి. ఆయుధముల జళిపించిరి. [illegible] బట్టిరి.
బాణంబుల నార్చి [illegible] వికట్టాల [illegible]. ఇట్టెన్ని
యో జగత్పరితాపకరకృత్యంబుల నొనరించిరి. ఆకృత్యంబులం
జూచినవారెల్ల నిక లోకములు నిలువజాలవని యెంచిరి.
అందుఁ గొందరక్కటా! త్రికాలవేత్తయయ్యు నలువ యిట్టి
కట్టిడికానసికి వరముల నిట్టివాని నీఁజెల్లునా యని వగచిరి.

మిగిలిన కార్యమునకు వగచి లాభ మేమని కొందఱు వెదవుల విఱిచిరి. కొంద ఱిక మనకులకాంతల గతి యేమని దుఃఖించిరి. ధర్మవినాశనకాల మిదె వచ్చె నని కొందఱు కన్నీరు నించిరి. తపోధను లిక నదృశ్యులై గుహల యం దెందో యుండుట మేలని యాశించిరి. వెంటనే ప్రతిక్రియ శ్రీహరియో! శంకరుఁడో! యూహింపకున్న నెట్లు? అని కొందఱు కొండలం బడిరి.

కొలది దినము లిట్లు గడచెను. హిరణ్యకశిపుని కుటుంబ మొక్కచోఁ జేరెను. దితియుఁ జింతలఁ జివుకక హిరణ్యాక్షుని చంపినను వగవక యుండెను. హిరణ్యకశిపుఁ డఖిల పరివారయుతుఁడై శుక్రుని యానతిమీఱక వారియాలోచనల వినుచు రాజ్యమును బరిపాలించుచుండెను. ఒక్కనాఁడు తనమంత్రులం గూడి చేయఁ దగుపని యేమని యాలోచించి

క. సోదరుఁ జంపిన జగత్త్రయోదర మించుకయుం లేక యసురేంద్రుఁడు గం
  జోదరుపై వైరము నుగ్రాదరతం దగుచుఁ జేసె మనుజాధీశా.

సీ. ఒకనాఁడు గంధర్వయూథంబుఁ బరిమార్చు
  దివిజుల నొకనాఁడు దెరలఁ దోలు
భుజగుల నొక నాఁడు భోగంబులకుఁ బాపు
  గ్రహముల నొక నాఁడు గట్టివైచు
నొక నాఁడు యక్షుల నుగ్రత దండించి
  నొక నాఁడు విహగుల నొడిసి పట్టు
నొక నాఁడు సిద్ధుల నోడించి బంధించు
  మనుజుల నొక నాఁడు మద మడంచు

తే. గడిమి నొక నాఁడు కిన్నరఖచరసాధ్య, చారణప్రేతభూతపిశాచవన్య
  సత్త్వ విద్యాధరాదుల సంహరించు, దితితనూజుండు దుస్సహతేజుఁ డగుచు

ఇట్లు లోకముల బాధించుచు, దనకు జయింప నలవి కానిసత్త్వం బెద్దియు లే దని తలంచెను. అంత విశ్వకర్మయరు దెంచి హిరణ్యకశిపునకు నివాసార్హ మగుదివ్యప్రాసాదము నొక దాని నిర్మించెను. అది లోకాతీతము. దానిశిల్పము మనో వాగతీతము. తుదకు విశ్వకర్మకే యచ్చెరువు పుట్టించెను. ఆ దివ్యహర్మ్యమున నివసించి హిరణ్యకశిపుఁ డుండ హరిహరవిరించులు తప్పఁ దక్కినవా రెల్ల నాతని ప్రతాపమునకు జంకి శరణు చొచ్చిరి. విరూపాదసేవకులు మగుమమ్ము రక్షింపుమా యని కొందఱు వేఁడిరి. కొందఱు పరువెత్తి యెందో నివసించిరి. ఏలోకమునకుఁ బోయినఁ బోనీయఁడని కొందఱాతనినే యాశ్రయించి యనుట మేలని తదాస్థానంబున నీచోద్యోగముల నుండిరి. ఎట్టిరాక్షసుఁడైనను వాని మాట దేవతలకెల్ల శిరోధార్యముగ [illegible]చెను.

ఆవాసవేంద్రనిచారు లెల్ల యెడలఁ దిరుగుచు,

సీ. కోలాహలముమాని కొలువుఁ డీసురలార తలఁగి దీవింపుఁడీ తపసులార
ఫణులెత్తకుఁడు నిక్కి పన్నగేంద్రములార ప్రణతులై చనుఁడి దిక్పాలులార
గానంబు సేయుఁడీ గంధర్వవరులార సాదడిఁ బడకుఁడీ సాధ్యులార
యాడుఁడీ నృత్యంబు లప్సరోజనులార చేరిక మ్రొక్కుఁడీ సిద్ధులార

తే. శుద్ధకర్పూరవాసిత సురభిమధుర భవ్య నూతన మైరేయ పానజనిత
సుఖవిలీనత నమరారి సొక్కినాఁడు శాంతి లేదండ్రు నిచ్చలుఁ జారులధిప.

ఇట్లు లోకంబు లాకులంపడం జేయుచుఁ దద్భటులు తిరుగుచుం జాటుచుండఁగా నిఁక సామాన్యమానవుల మాట యిట్టిదని వచింప నేరికి శక్యము? ఇట్టు లుండియు హిరణ్యకశిపుఁడు

పూజ్యభంగి రాజ్యంబును బాలింపఁ జూచుచుండెను. ఆతని యాటోపంబునకు వెఱచి.

సీ. సకలమహౌషధీ సహిత విశ్వంభర స్థలిని దున్నక పండు సస్యచయము
కామధేన్వాదుల కరణి సర్వులు కోరు కోర్కులు గగనంబు గురియుచుండు
వననిధుల్ రోహణుల్ మహీసందోహ మూను వీసాల రత్నముల వహించు
సర్వసహాంబులు నొక్కకాలంబున నఖిలర్తుగుణముల నలరఁగల్గు
తే. వంబుసాపూరిత ద్రోణు లగుచు నొప్పఁ,
బర్వతేంద్రములు సర్వదిక్పాలవివిధ
గుణములు తెల్లను దాన కైకొనుచు దైత్య
విభుఁడు త్రైలోక్యరాజ్య సంవృద్ధి నుండ.

ఈరీతి రాజ్యంబుఁ బరిపాలించుచుండఁగా రాక్షసు లను చుట్టలెల్ల కినలు గ్రమ్మరుమఁ దాపసుల సంతాప ముందఁ జేయుచు దేవమాత్రము కరుణలేక లోకుల బాధించుచు యజ్ఞములకు విఘ్నములు గావించి దేవతల బలహీనులుగా నొనరించుచుఁ గడు నెరవులేక వర్తింపసాగిరి. అత్తఱి: దీర్పరాని బాధల నొందై నివాసముల మాని దిక్కుతోఁచక తిరుగుచు విపన్నులై,

ఉ. ఎన్నఁడు మాకు దిక్కుగల దెన్నఁడు దైత్యుల బాధమాను మే
మెన్నఁడు వృద్ధిఁ బొందఁగల మెవ్వరు రక్షకులంచు దేవతా
కిన్నరసిద్ధసాధ్యమునిఖేచరనాయకు లాశ్రయించి రా
పన్నగతల్పు భూరిభవబంధవిమోచను బద్మలోచనున్.

పూటపూట కాదానవేంద్రుని యత్యుగ్రదండనము భరింపరానిది కాఁగా నిసుమంతయు నోర్వఁజాలక యమరు లెల్ల నొక్కచోఁ గూడి,

ఉ. ఎక్కడ నున్న వాఁడు జగదీశ్వరుఁ డాత్మమయుండు మాధవుం
డెక్కడి కేగె శాంతులు మునీశులు భిక్షులు గారు క్రమ్మఱం
దిక్కుల నెల్ల నెక్కడుఁ దుదిం జొర దిక్కుగనట్టి దిక్కునై
మ్రొక్కెద మేము హస్తయుగముల్ ముకుళించి మదీయరక్షకున్.

అని ప్రార్థించుచు నాహారనిద్రలు మాని నిరంతరధ్యానము లొనరించిరి. ఆసమయమున శ్రీహరి వారికిం గానరాక మేఘపథమున నినదంబున నిట్లు పలికెను.

మ. భయముం జెందకుఁ డంద్ఱు నిర్జరవరుల్ భద్రంబు మీ కయ్యెడున్
జయముల్ లాభము భూతసంతతికి మత్సందర్శన ప్రాప్తి స
వ్యయమై చేరు; నెఱుంగుదున్ దితిసుతవ్యాపారభాషావిప
ర్యయముల్ కాలము గూడఁ జంపెదఁ జనుం డందాఁక మీ త్రోవలన్.

ఆ. శుద్ధసాధులందు సురలందు శ్రుతులందు,
గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందుఁ దగిలి నాయందు వాఁ
డెన్నఁ డలుగు నాఁడె హింస నొందు.

మఱి యొక్క రహస్యము దెల్పెద నాలకింపుఁడు.

క. కన్న కొడుకు శమదమసం, పన్నుఁడు నిర్వైరుఁ డనఘుఁ బ్రహ్లాదుని వాఁ
డెన్నఁడు రోషంబున నా పన్నత నొందించు నాఁడె పట్టి వధింతున్.

వాఁడు వరబలగర్వితుఁడు. చచ్చువాఁడు కాఁడే యని సంశయింతురా? వినుఁ డొక్కమాట?

శా. వేధోదత్త వరప్రసాదగరిమన్ వీఁ డింతవాఁడై మిమున్
బాధల బెట్టుచు నున్నవాఁడని మదిన్ భావింతు భావించి నే
సాధింపం దఱికాదు గావునఁ గడున్ సైరించితిన్ మీఁదటన్
సాధింతున్ సురలార నేఁడు చనుఁ డా శంకింప మీ కేటికిన్.

అని పలికి యూరకుండెను. దేవత లాపలుకుల కాసంతసించి హిరణ్యకశిపున్మృతికై వేచియుండు మని భగవంతుని బ్రార్థించి తమతమనెలవుల కేగ్గి పోయిరి.

## ప్రహ్లాదచరిత్రము

కొంతకాల మీరీతి సాగెను. హిరణ్యకశిపునకు విచిత్ర చరిత్రు లగునలువురు కొడుకులు పుట్టిరి. అందు,

సీ. తనయందు నఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున జరగువాఁడు
పెద్దలఁ బొడగన్న భృత్యునికైనడిఁ జేరి నమస్కృతుల్ చేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన మాతృభావనఁ జేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను దీనులఁ గావఁ జింతించువాఁడు
తే. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు,
దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలితమర్యాదుఁడైన ప్రహ్లాదుఁ డధిప.

ఆకుమారుఁడు సకలగుణసంపన్నుఁడై యలరారుచు వినుతి పాత్రుఁడై

సీ. ఆకారజన్మవిద్యార్థవరిష్ఠుఁడై గర్వసంస్తంభసంగతుఁడు గాఁడు
వివిధమహానేకవిషయసంపన్నుఁడై పంచేంద్రియచయములచేఁ బట్టు వడఁడు
భవ్యవయోబల ప్రాభవోపేతుఁడై కామరోషాదులఁ గ్రందుకొనఁడు
కామినీప్రముఖభోగము లెన్నిగల్గిన వ్యసనసంసక్తిఁ బా వంకఁ బోఁడు
ఆ. విశ్వమందుఁ గన్న విన్న యర్థములందు
వస్తుదృష్టిఁ జేసి వాంఛ యిడఁడు
ధరణినాథ దైత్యతనయుండు హరిపర
తంత్రుఁడై హతాన్యతంత్రుఁ డగుచు.

తనకు సాటి చతుర్దశభువనంబులందును లేక వర్తిల్లుచుండెను. సకలసద్గుణంబులు తమంతన తమ రరు దెంచి ప్రహ్లాదు నాశ్రయించి వేఱొకచోటునకుఁ బోనొల్లక యుండెను. ఆప్రహ్లాదుఁడు పుట్టినప్పటినుండియు నాతనిఁజూచి తల్లియుఁ దండ్రియు నితఁడు కులోద్ధారకుఁ డగుననియు, నీతఁడు సకలజనస్తుతిపాత్రుఁ డగు ననియు మాతృపితృభక్తిపరాయణుఁ డగుననియుఁ జింతించి సంతోషాంబుధి నోలలాడుచుండిరి. రాక్షసులకన్న దేవత లాతనిం జూచి సంతసించుచు నీతనివంక హిరణ్యకశిపు మృతిని గన్నులారఁ గాంతుము కదా యని సదా యానందించుచుండిరి.

ప్రహ్లాదుఁడు తనతోడిబాలురతో నాడుకొనుచున్నను వారికి భగవద్భక్తిని దెల్పుచు, సత్ప్రవర్తనము లలవడఁజేయుచు వారిని దనకు వశవర్తులనుగాఁ జేసికొని యుండెను. కాని లోకములోని పిల్లలవలెఁగాక మహర్షివలె భగవంతునియందే తనచిత్తమును జేర్చి ప్రవర్తించుచుఁ దనను జూచువారెల్ల నితఁడు మహాపురుషుఁ డనితలంచున ట్లుండెను. ఒక్కతరుణమున బాలుర వదలి తా నొంటరిగాఁ దిరుగుచు శ్రీమన్నారాయణమూర్తితో నాడుకొనుచు నుండెను. సదా భగవంతుఁ డాతనికిఁ గనంబడు చున్నయ ట్లుండెను. మఱియు నామహాపురుషుఁడు

సీ. వైకుంఠ చింతావివర్జితచేష్టుఁడై
యొక్కెడ జేయుచు నొక్కచోట
నశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై
యుద్ధతుఁడై పాడు నొక్కచోట
విష్ణుఁ డింతియకాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట

నలినాక్షుఁ దనుసంధానముఁ గంటి నే నని
యుబ్బి గంతులు వైచు నొక్కచోట
ఆ. బలుకు నొక్కచోటఁ బరమేశుఁ గేశవుఁ,
బ్రణయహర్ష జనితబాష్పసలిల
మిళితపులకుఁడై నిమీలితనేత్రుఁడై
డొక్కచోట నిలిచి యూరకుండు.

ఇట్లాతఁడు సామాన్యబాలునివలెఁ గాక ప్రవర్తించుచుండెను. ఇంచుక శైశవమునఁ గాలము గడచెను. హిరణ్యకశిపుఁడు తనమనస్సున నీకుమారుఁడు సామాన్యబాలునివలెఁ బ్రవర్తింపఁడు. భక్తిపరవశుఁడైనట్లు నటించుచున్నాఁడు. ఆలోచింపఁగా వెఱ్ఱివానివలెఁ గనఁబడుచున్నాఁడు. అని తలఁచియు విచారించుచు నక్కటా! యీనాకుమారుఁడు స్వర్గరాజ్యమును లెక్కసేయఁడు. ధనధాన్యములవంకనైనఁ జూడఁడు. ఎట్టి యపురూపపదార్థమును దెచ్చి యిచ్చినను ప్రీతితోఁ బరిగ్రహింపఁడు. పోనీ! వెఱ్ఱివాఁడేమో యనుకొందునా వీనిమాటలు వేదవాక్యములవంటివిగా నున్నవి. ఇట్లుండుటకుం గారణము చదువు చెప్పింపక పోవుటచేతనే యయి యుండవచ్చును. ఇంతియగాక, ఎంతటి బుద్ధిశాలి యైనను చదువనివాఁ డజ్ఞుఁడే యగును. ఎంతటి మూర్ఖుఁడైనను జదివినచో సదసద్వివేకచతురత గల్గును. కావున గురువులను బిలిపించి వీనిని చదివించెదను. దాన వీఁడు చతురుఁడగును. అని యోజించి శుక్రాచార్యతనయులఁ జండామర్కులు ననువారి రావించి సవినయముగా నమస్కరించి కరములు ముకుళించి, మహాత్ములారా!

శా. అంధప్రక్రియ నున్నవాఁడు పలుకం దన్మత్ప్రితాప్రక్రియా
   గంధం బించుక లేదు మీరు గురుపుల్ కారుణ్యచిత్తుల్ మనో
   బంధుల్ మాన్యులు మాకుఁ బెద్దలు మహిం బాటించి యీబాలకున్
   గ్రంథంబుల్ చదివించి నీతికుశలుం గావించి రక్షింపరే.

అని ప్రార్థించి కుమారు నప్పగించెను. వారును హిరణ్యకశిపు నానతిఁ గైకొని రాజకుమారునిం బ్రీతిమీఱఁ బిలుచుకొనిపోయి సమానవయస్కు లగుసహశ్రోతల రాక్షసకుమారులం గొందఱం గూర్చి రాజగృహాంతికమున నొకసుందరవిశాలసౌధమును బ్రవేశించి చక్కఁగాఁ జదువు చెప్పనారంభించిరి. ప్రహ్లాదుఁడును.

క. ఏపగిది వారు చెప్పిన, నాపగిదిం జదువుఁగాని యట్టిట్టని యా
   క్షేపింపఁడు తానన్నియుం, రూపించిన మిథ్య లని నిరూఢమనీషన్.

విద్యాభ్యాస మీరీతిఁ గొంతకాలము సాగఁగా హిరణ్యకశిపుఁ డొక్కనాఁడు కుమారు విద్యావిషయ మెట్లున్నదో పరీక్షింపఁ గోరెను. వెంటనే బాలకుం దోడుకొని రావలయు నని గురువులకు వార్త నంపెను. వారును బాలునిం దోడుకొని వచ్చి రాక్షసరాజును దర్శించిరి. గురువులం గూడివచ్చి భక్తిభరంబునఁ జెంత నిలుచున్న కుమారుం గాంచి పరమానందంబునఁ జేరం జీరి కౌఁగిటం జేర్చి వత్సా! యని తొడపై నునుచుకొని తనమనమున నౌరా!

క. అనుదినసంతోషణములు, జనితశ్రమతాపదుఃఖసంశోషణముల్
   తనయుల సంభాషణములు జనకులకుం గర్ణయుగళసద్భూషణముల్.

అని తలంచుచు నాయనా! నీకు భద్రం బెయ్యదియో చెప్పుమని సాదరముగాఁ బ్రశ్నించెను. ప్రహ్లాదుఁడును కరములు ముకుళించి,

ఉ. ఎల్లశరీరధారులకు నిల్లను చీఁకటినూతిలోపలం
ద్రెళ్లక వీరు నేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్దనని దివ్యకళామయ మంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ.

అని మెల్లఁగాఁ బలికెను. ఆమాటలు విని మనమున నింపుక కోపము పొడసూపినను కుమారునిఁ గాంచినంతనే యది నశింప మెల్లగా నాయనా! యని పిలిచి నవ్వుచు

శా. నాకుం జూడఁగఁ జోద్యమయ్యెడిఁ గదా నాతండ్రి యీ బుద్ధి దా
నీకున్ లోపలఁ దోఁచెనో పరులు దుర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో యీదానవశ్రేణికిన్
వైకుంఠుండు కృతాపరాధుఁ డతనిన్ వర్ణింప నీకేటికిన్.

అని పలికి మఱియుఁ బుత్రునిం జూచి యించుక గట్టిగా

మ. సురలం దోలుటయో సురాధిపతులన్ స్రుక్కించుటో సిద్ధులం
బరిశోధించుటయో మునిప్రవరులన్ బాధించుటో యక్షకి
న్నరగంధర్వవిహంగనాగపతులన్ నాశంబు నొందించుటో
హరియంచున్ గిరియంచు నేలచెడ మోహాంధుండవై పుత్రకా.

అని హెచ్చరించెను. ప్రహ్లాదుఁడు తండ్రినిఁ జూచి సాహసముగాఁ దండ్రీ! మోహనిర్మూలనంబు చేసి యేభగవంతునందుఁ దత్పరులై జ్ఞానముగల పురుషులకుఁ బరులు తమకు ననుమానాస్పదం బయిన యసత్పురుషగ్రాహ్యంబగు భేదంబు గానరాదో అట్టి పరాత్పరునకు నమస్కరించుచున్నాఁడను. మఱియు

శా. అజ్ఞుల్ గొందఱు నేము దా మనుచు మాయం జెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యు దురన్వయక్రమములన్ భాషింపఁగా నేర రా

జిజ్ఞాసాపథమందు మూఢులుగదా చింతింప బ్రహ్మాదివే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ భాషింపఁగా నేర్తురే.

అని పలికి గురువగు శుక్రపుత్త్రుం గాంచి భక్తిశ్రద్ధలు వెలయ మోమునఁ జిఱునగవు మొలకలెత్తఁగా భగవద్భక్తిని బోధింపఁ దలంచి మెల్లఁగాఁ దండ్రి వినుచుండఁగా మహాత్మా! బ్రాహ్మణోత్తమా!

సీ. మందారమకరంద మాధుర్యమునఁ దేలు మధుపంబు బోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు రాయంచ చనునె తరంగిణులకుఁ
లలితరసాల పల్లవఖాదియై చొక్కు కోయిల చేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికా స్ఫురితచకోరకం బరుగునే సాంద్రనీహారములకు

తే. నంబుజోదరదివ్య పాదారవింద చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబు జేర నేర్చు వినుతగుణశీల మాటలు వేయు నేల?

అను ప్రహ్లాదుని పలుకుల విని రాజసేవకుండు గాన నా పురోహితుండు దనుజరాజకుమారుం జూచి యాగ్రహంబు కనఁబడుచుండఁ దిరస్కారపూర్వకంబుగా నిట్లు పలికెను. వత్సా! ప్రహ్లాదా!

ఉ. పంచశరద్వయస్కుఁడవు బాలుఁడ వించుక గాని లేవు భా
షించెదు తర్కవాక్యములు చెప్పిన శాస్త్రములోని యర్థ మొ
క్కించుక యైనఁ జెప్ప వసురేంద్రుని ముందట మాకు నౌదలల్
వంచుకొనంగఁ జేసితివి వైరివిభూషణ వంశదూషణా!

అని పలికి రోషంబున రాజసేవకులం జూచి

చ. తనయుఁడు గాఁడు శాత్రవుఁడు దానవభర్తకు వీఁడు దైత్యచం
దనవనమందుఁ గంటకయుతక్షితిజాతము భంగిఁ బుట్టి నాఁ

డనవరతంబు రాక్షసకులాంతకుఁ బ్రస్తుతిచేయుచుండు దం
డనమునఁ గాని శిక్షలకు డాయఁడు పట్టఁడు కొట్టుఁ డుద్ధతిన్.

అని యంతతో నిలువక రాక్షసేంద్రుం జూచి రాజభక్తి యల రారఁగా మహాప్రభూ!

క. ఈపాపనిఁ జదివింతుము, నీపాదము లాన యింక నిపుణతతోడం
గోపింతుము దండింతుము, కోపింపకు మయ్య దనుజకుంజర! వింటే.

అని ప్రార్థించి యందులకాతం డనుమోదింపఁ బ్రహ్లాదకుమారుం దోడుకొని పోయి యేకాంతమునఁ గూరుచుండఁ బెట్టుకొని శక్తికొలఁదియుఁ గనఁబఱచుచు నాబాలకునకుఁ బెక్కుమాఱులు రాజనీతిమార్గము లన్నింటిని బూసగ్రుచ్చిన ట్లుపదేశించెను. అంతియగాక యుద్ధధర్మములఁ దెల్పెను. ప్రజారక్షణోచితధర్మ విశేషముల బోధించెను. నీతిశాస్త్రములంతయుఁ బఠింపఁజేసెను. మఱియు నితరవిశేషవిషయములెల్ల శ్రద్ధగా నెఱింగించెను. ప్రహ్లాదుఁడు నించుకంతయును గురువు ధిక్కరింపక అశ్రద్ధ నూనక యేవగింపక భక్తియలరఁ బాఠములఁ బఠించెను. అడిగినప్రశ్నములకు బదులు చక్కఁగాఁ జెప్పెను. దానిచే నతఁడీ బాలుఁడు నీతికోవిదుం డయ్యె నని నమ్మెను. పరమానందమున నావార్తలఁ దల్లికిం దెల్పెను. ఆలీలావతీదేవియుఁ బరమానందభరితస్వాంతయయ్యెను. కొడుకుం జీరఁ బంచి యుపలాలించెను. తండ్రికడకుం గొంపోవుదునని పురోహితుండు తెలుప వివిధవిధభూషణముల నలంకరించెను. బుద్ధిచెప్పెను. భక్తిమార్గము తెల్పెను. తండ్రికడ నేమియుఁ దోఁచినట్లు మాటలాడకుము రా నాయనా యనిబుజ్జగించెను.మీతండ్రి లోకత్రయాధిపతి సుమీ! చండశాసనుఁ డని హెచ్చరించెను. అవ్వల పురో

హితుని వెంటఁ బంపెను. ఆతండు ప్రహ్లాదుం గాంచి, వ
సభకుం బోవవలయును. అందు నీతండ్రి నిన్నుం బరీ—
అప్పుడు,

ఉ. త్రిప్పకుమన్న 'ధూమకము దీర్ఘములైన త్రివర్గపాఠముల్
తప్పకుమన్న నేఁడు మన దైత్యవరేణ్యుని మ్రోల నేముమున్
చెప్పిన నీతి గాని మఱి చెప్పకు మన్న విరోధినీతులన్
విప్పకుమన్న [1]దుష్టమగు విష్ణుచరిత్రకథార్థజాలముల్.

అని బుజ్జగించి యతఁడు తనమాట జవదాఁటువాఁడు కాఁడని మది నెఱనమ్మి,

సీ. అడుగడుగునకు మాధవానుచింతనసుధా
మాధుర్యమున మేను మఱచువాని
అంభోజగర్భాదు లభ్యసింపఁగ లేని
హరిభక్తి పుంభావ మైనవాని
మాతృగర్భము సొచ్చి యున్నది మొదలుగాఁ
[2]చిత్త మచ్యుతు మీఁదఁ జేర్చువాని
సంకించి తనలోన నఖిలప్రపంచంబు
శ్రీవిష్ణుమయమని [3]చెలఁగువాని

తే. వినయకారుణ్యబుద్ధివివేకలక్ష
ణాదిగుణముల కాటపట్టైనవాని
శిష్యు బుధలోకసంభావ్యుఁ జీరి గురుఁడు
దండఱికిఁ ద్రొబ్బి తండ్రికి మ్రొక్కుమనుచు.

---

1. 'దుష్టతరవిష్ణుచరిత్రకథార్థజాలముల్' అని పా. 2. 'చిత్త మచ్యుతునందుఁ • జెలఁగువాని' అని పా. 3. 'చెప్పువాని' అని పా.

హిరణ్యకశిపుం గాంచి సానునయోక్తులలరారుచుండఁగా

క. శిక్షించితి [1]మన్యము లగు, పక్షంబులు మాని నీతి పాఠగుఁ డయ్యెన్
రక్షోవంశాధీశ్వర, వీక్షింపుము నీకుమారు విద్యాబలమున్.

అని విన్నవించెను. రాక్షససార్వభౌముండాపలుకు లాలించి సంతసించి తనపాదములకు వందనమొనరించి కరయుగంబు జోడించి నిలుచున్న చిన్నికుమారకుం గాంచి మహానందంబును జాలియుఁ దోలకాడ వెంటనే చేరఁదీసికొని గాఢాలింగన పురస్సరంబుగా నంకమునఁ గూరుచుండఁబెట్టుకొని చుంచువు దువ్వి చిబుకంబుఁ బుడికి చెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని మహానందంబున వెల్లువలై ప్రవహించు కన్నీటిధారల నాతని మోమును దమ్మిని దడుపుచు మృదులమధురతరాలాపంబు లలరు చుండ నాయనా!

శా. చోద్యం బయ్యెడి నింతకాల మరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు చెప్పిరో గురువులే వెంటం బఠింపించిరో
విద్యాసార మెఱుంగఁగోరెద భవద్విజ్ఞాతశాస్త్రంబులోఁ
బద్యం బొక్కటి చెప్పి సార్థముగఁ దాత్పర్యంబు భాషింపుమా.

అని పలికెను.

ఆర్యబాలులారా! పైపద్యమును జదివితిరి గదా. అర్థముతోఁగూడఁ దాత్పర్యమును జక్కఁగాఁ దెలుపుమా యని తండ్రి కొడుకు నడిగెను. ప్రతిపదమునకుఁ బ్రాతిలికమగు నర్థమును దొలుతఁ జెప్పవలయు. పిదప నాపదముల జోడింపునఁ దేలుచున్న విశేషార్థసారము తాత్పర్యమని భావించి

1 'మన్యుల వగు' అని పా.

భాషింపవలయు. ఇదియే పూర్వపద్ధతి. "ముక్కస్యమూ కార్థః" అన్నట్లుగాదు. ఇట్టి పద్ధతియే మీరలవలచుకొన వలయు. ఒక్క యుదాహరణమును వినుఁడు.

తే. విమల మధురమనోహర వృత్తి వెలయుఁ
వారిఁ గొనియాడ బుధు లెంత దూరమైనఁ
బోవుదురు గాన నేను నీ పొందుఁగోరి
దవ్వనక వచ్చితి నశేషతాపశమని.

అని వసుచరిత్రమున రామరాజభూషణమహాకవి చెప్పెను. శుక్తి మతియను నదికిని, కోలాహలమను పర్వతమునకు సంభాషణ జరుగుఘట్టమున నీపద్యమున్నది. సామాన్యార్థ మేమనఁగా— సకలతాపములఁ బోఁగొట్టు శుక్తిమతీనదీ! లోకమున స్వచ్ఛమై మనోహరమగు ప్రవర్తనముగల వారిని వినుతించుట కెంతదూర మైనను సజ్జనులుపోవుదురు. కాఁబట్టి నేనును నీచెంతనుండఁగోరి దూరమనక హిమాలయప్రాంతమునుండి వచ్చితి నని పలికెను. విశేషార్థము—పదములజోడింపు విశేషార్థ మిందుఁ గల దని బోధించును. కవి మనకాప్తునకు వచ్చి యిందుఁ రెండవయర్థము గల దని చెప్పఁడుగాని చదువువాఁడు తెలివిగలవాఁడేయైనచో నాపదముల జోడింపును గాంచినంతనే విశేషార్థ మిందుఁ గవి యనువదించె నని కనుఁగొనును. కోలాహలుఁడు కాముకుఁడు. శుక్తిమతి పద్మినీజాతి యన్నులమిన్న. కాఁబట్టి యిట్లూహింపఁ దగు. సకలతాపములను బోఁగొట్టుదానవుకదా నీవు శుక్తిమతీ! (నాకిపుడుగల పరితాపమును బోఁగొట్టఁజాలవా? యనిభావము) కపటములేక మనమున కింపును బెంచు నడకగలవారిని "కొనియాడ" కొని=పరిగ్రహించి, ఆడన్=విహరించుటకు,

బుధులు=ర్యసులగుజనులు ఎంతదూరమైననుపోవుదురు. కాన= ఇది లోకాచారము గనుక నేనును (తాపార్దితుఁడనుగానున్న నేను) దూరమునక వచ్చితిని. అని ఈయర్థము పదములకూర్పు వలనఁ గలిగినది. కాని యితరకారణములవలనఁ గాదు. కాఁబట్టి హిరణ్యకశిపుఁడు కుమారునిఁ బ్రతిపదమున కర్థమును జెప్పి యావలఁ దాత్పర్యమును జెప్పుమని యడిగెను. ఇది ప్రాచీన పద్ధతి. అదియే మంచిపద్ధతి. ఈకాలమున నది కొఱమా అగుట మీరు నెఱుఁగఁగలరు. ప్రాచీనపద్ధతియే విజ్ఞానప్రదమని నమ్ముఁడు. ఆవలఁ గథ వినుఁడు.

హిరణ్యకశిపుఁ డిట్లుపలికి యెంతతో నూరకుండక పుత్త్రునకు రోషము గల్గించి విద్యావిషయమున శ్రద్ధఁబూనునట్లు చేయనెంచి మహాప్రీతితో

శా. నిన్నుం గా మెచ్చరు నీతిపాఠమహిమన్ నీతోడిదైత్యార్భకుల్
కన్నారన్నియుఁ జెప్పనేర్తురు గదా గ్రంథార్థముల్ దక్షులై
యన్నా! యెన్నఁడు నీవు నీతినిధుఁడౌ దంచున్ మహావాంఛతో
మన్నించెన్ ననుఁగన్నతండ్రి భవదీయోత్కర్షముం జూపవే.

అని పలికి బిగ్గఁ గౌఁగిలించుకొనియెను. ఇట్లు తండ్రి తన్నడిగిన విషయము లన్నియు నెఱింగియు నాతనియజ్ఞానమును బాప నెంచి జనకుఁడు. సకలలోకాధిపతి, కఠోరహృదయుఁడు, పరాక్రమశాలి యని తలంపక శ్రీమన్నారాయణపాదారవిందధ్యానతత్పరుండై తనమ్రోల భగవంతుఁడు నిలిచియున్నట్లే భావించువాఁడు గావున మెల్లఁగాఁ దండ్రిం గాంచి మృదులతమ స్వరంబున,

క. చదివించిరి నను గురువులు, చదివితి ధర్మార్థముఖ్యశాస్త్రము లెల్లన్
జదివినవి గలవు పెక్కులు, చదువులలో మర్మ మెల్లఁ జదివితి తండ్రీ.

మ. తనుహృద్భాషల సఖ్యముఁ శ్రవణముఁ దాసత్వముఁ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయుం సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్ర మంచుఁ దలఁతుం సత్యంబు దైత్యేశ్వరా.

ఇంతియగాక.

శా. అంధేందూదయముల్ మహాబధిరశంఖారావముల్ మూకస
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసకవధూకాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడస
ద్గంధంబుల్ హరిభక్తివర్జితులరిక్తవ్యర్థసంసారముల్.

తండ్రీ! ఇంకొక్కమాట నాలకింపుము. మనస్సును సమాహితమగునట్లు చేయుము. తరణోపాయ మేది యని యాలోచింపుము.

సీ. కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వజిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి

తే. దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరు మనియెడు తండ్రి తండ్రి.

తొందఱపడక యింకొక్కమాట నాలింపుము.

సీ. కంజాక్షునకుఁగాని కాయంబు కాయమే పవనగుంభితచర్మభస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే ఢమఢమధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే తనుకుడ్యజాలరంధ్రములుగాక
ఆ. చక్రిచింతలేని జన్మంబు జన్మమే, తరళసలిలబుద్బుదంబుగాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుఁడే పాదయుగముతోడి పశువుగాక.

మహాత్ములు యోగులు నిరంతరధ్యాన మొనరించి యెఱింగి మనవంటిమూఢులకుఁ దెల్పిన భాషణముల నించుక యాలకింపుము.

సీ. సంసారజీమూతసంఘంబు విచ్చునే చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీలదావాగ్ను లాఱునే విష్ణుసేవామృత వృష్టిలేక
సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే హరిమనీషాబడబాగ్ని లేక
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే పద్మాక్షునుతి రవిప్రభలు లేక
తే. నిరుపమాపునరావృత్తి నిష్కళంక, ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక, తామరసగర్భునకు నైన దానవేంద్ర.

అను నీప్రహ్లాదునిపలుకులు హిరణ్యకశిపుని చెవులకు ములుకుల వలె నయ్యెను. శ్రుతిరంధ్రముల ద్వారా మనస్సున కెఱుక పడియె. వెంటనే యాతనినయనము లెఱ్ఱవాఱెను. అప్పుడే మోము వివర్ణతంగాంచెను. అధరము కంపింపసాగెను. భుజశిఖరము లెగుర మొదలిడెను. కరతలగతఖడ్గము తనంతన తానే క్రూరత వహించెను. దేహ మింక నూరకుండుట పాడిగాదని కాఁబోలు వడఁకసాగెను. ఇంతయేల సింహాసనమే యల్లలనాడఁ జొచ్చెను. ఆవెంటనే యాదానవనేత యదరిపడి క్రూరనేత్రము

లగ్నిజ్వాలలఁ గురియుచుండ శుక్రపుత్రుంగాంచి యీతఁడు దురాత్ముఁడై నావిరోధి యగు శ్రీహరికథలఁ జెప్పియుండు నని. యెంచుచు నిట్లు పలికెను.

చ. పటుతరనీతిశాస్త్రచయ పారగుఁ జేసెద నంచు బాలు నీ
వటుకొనిపోయి వానికి న నర్హ్యమూర్తైన విరోధిశాస్త్రముల్
కుటిలతఁ జెప్పినాఁడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిం
గటకట! బ్రాహ్మణాకృతివి గాక యథార్థపు బ్రాహ్మణుండవే.

ఏమయ్యా! ధర్మేతరమార్గమునఁ బ్రవర్తించి నాకొడుకును బాడుచేసితివి. నాద్రవ్యమును గొని మామకసహాయమున జీవించుచు, నందఱికన్న మిక్కుటమగు మర్యాదలం బొందుచు నీవిట్లు చేసితివే. ఇది పాపముకాదా! ఇట్టి నీకు సుగతిగలదా? అని మఱుమాటరాక యూరకుండెను. పురోహితుఁడు రాజునకుఁ దీవ్రక్రోధ మంకురించె నని యెఱింగి వడంకుచు మహాప్రభూ!

ఉ. తప్పిలు లేదు మావలన దానవనాథ! విరోధిశాస్త్రముల్
చెప్పము క్రూరులై పరులు చెప్పరు, మీచరణంబులాన సు
మ్మెప్పుడు మీకుమారునకు నింతయుఁ నైజమునీమ యెవ్వరుం
జెప్పెడి పాటిగాదు ప్రతి చింతఁ దలంపుము నేర్పునైపడిన్.

త్రిలోకాధినాథా, మఱొక్కమాట విన్నవింతు. అవధరింపుఁడు.

క. మిత్రులము పురోహితులము, పాత్రుల మే మదియుఁగాక భార్గవులము నీ
పుత్రుని నిటుపలె చేయఁగ, శత్రులమే దైత్యజలధిచంద్రమ వింటే.

అను పలుకుల నాలకించి హిరణ్యకశిపుఁడు మనమున నించుక మోదించెను. ఆమాటలు నిజములే యని నమ్మెను. వారిని సాద

రముగా వీక్షించెను. వెంటనే మోము మరలించెను. కొడుకుం
జూచి కుమారా! గురువు లుపదేశింపని యీనీతులు నీ కెవరు
బోధించిరి. వారి పేరు చెప్పుము. చాలు. ఆవల వారివిషయ
మాలోచించెద ననియె. ప్రహ్లాదుఁ డామాటల కించుకయు
భయంపడక నిశ్చలచిత్తుండై సుస్మితాననుండై తండ్రివంకఁ
జూచుచు మహాత్మా! జనకా!

ఉ. అచ్చపుఁ జీఁకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ జర్వితచర్వణు లైనవారికిం
జెప్పరఁ బుట్టునే పరులు చెప్పిన నైన నిజేచ్ఛ నైన నే
మిచ్చిన నైనఁ గానలకు నేగిన నైన హరిప్రబోధముల్.

ఉ. కాననివాని నూఁతగొని కాననివాఁడు విశిష్టవస్తువుల్
కాననిభంగిఁ గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణుఁ గొంద ఱట కందు రకించనవైష్ణవాంఘ్రిసం
స్థానరజోభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా.

తండ్రీ! తుదిమాట యొక్కదానిని వినుము. కోపాగ్ని
జ్వాలల మనస్సును గాల్పఁబూనకుము. శాంత మూనుము.

శా. శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ! వేయేటికిన్
గాథల్ మాధవశేముషీతరణిసాంగత్యంబువంగాక దు
ర్మేధన్ దాఁటఁగ వచ్చునే సుతవధూ మీనోగ్రవాంఛామద
క్రోధోల్లోలవిశాలసంసృతిమహాఘోరామితాంభోనిధిన్.

అను పలుకుల విని రక్కసులఱేఁడు తటుక్కునఁ గొడుకుపైఁ
గల మక్కువను దెగఁగోసి తొడలపైనున్నవాని గొబ్బున దిగఁ
ద్రోసి నిష్ఠురక్రోధంబు దీపింప వేఁడిచూపుల మింట మంట
లెగయుచుండఁ జెంతనున్న మంత్రులంగాంచి యిట్లు పలికెను.

మంత్రులారా! వరాహరూప మెత్తి తనపిన్నతండ్రిని జంపె నని
యీ ప్రహ్లాదుఁడు మనమునఁ గోపమూనక సేవకుఁడు క్షుద్ర
రాజును బొగడినట్లు హరిని బొగడుచున్నవాఁడు. నాకరవాల
మునకుం దనప్రాణవాయువుల నర్పింపఁ బూనియున్నవాఁడు.
నాతో విరోధమున కొడిగట్టినాఁడు. లోకమున నెందైన నిట్టి
పాపాత్మునిఁ బితృద్రోహినిఁ జూచితిరా! అని యంత నిలువక
శూరదానవపుంగవులం గాంచి,

శా. పంచాబ్దంబులవాఁడు తండ్రినగు నాపక్షంబు నిందించి య
త్యంచద్భీతియుం లేక విష్ణు నహితుం గీర్తించుచున్నాఁడు, వ
ద్దంచుం జెప్పిన మానఁ డంగమునఁ బుత్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీమీపటుత్వంబులన్.

అని వారిని హెచ్చరించి తీవ్రమగు కోపము తనుముంపఁగా
హుంకరించి కరవాలము జళిపించి

శా. అంగవ్రాతములోఁ జికిత్సకుఁడు దుష్టాంగంబు ఖండించి శే
షాంగశ్రేణికి రక్ష చేయుక్రియ నీయజ్ఞుం గులద్రోహి దు
స్సంగుం గేశవపక్షపాతి నధముం జంపించి వీరవ్రతో
త్తుంగఖ్యాతిఁ జరించెదం గులము నిర్దోషంబుఁ గావించెదన్.

కాఁబట్టి మీ రిప్పుడే

క. హంతవ్యుఁడు రక్షింపను, మంతవ్యుఁడు గాఁడు యమునిమందిరమునకున్
గంతవ్యుఁడు వధమున కుప, రంతవ్యుం డనక చంపి రండీపడుచున్.

అని దానవనాయకుండు రూక్షంబుగాఁ బలికిన విని రాక్షసవీరు
లాక్షణమ పెక్కండ్రు శూలంబులఁ గేలం బూని వక్త్రంబులు
తెఱచుకొని యుబ్బి పెడబొబ్బలిడుచు బాలుండని కాని, రాచ
బిడ్డఁడని కాని, కనికరింపఁదగిన ప్రాయముగలవాఁడని కాని, లోక

మహాన్యసచ్ఛీలుండని కాని, ఇన్నింటినిబట్టి యవధ్యుఁడని కాని యూహింపక క్రూరస్వాంతులై శూలములం గొని ప్రహ్లాదుని కోమలతమాంగములఁ జూచి క్రుమ్మిరి. ఎన్నిమాఱులు శూలములఁ బ్రహరించుచున్నను ప్రహ్లాదుఁడు వల దని కాని, అమ్మా యని కాని, ఇంక నిట్టిమాటలు పలుకను నన్ను రక్షింపుఁడీ యని కాని పలుకక నిరంతర మహాపరాత్పరుని నారాయణమూర్తిని ధ్యానించుచు నూరకుండెను. ఆశూలపుఁబోటు లాతని యంగమున కించుకంతయు నొప్పిని గల్గింపఁ జాలవయ్యెను. శూలములతోఁ దన్నుఁ గ్రుమ్ముచున్నపుడెల్ల నోపన్నగశయనా! ఓదనుజభంజనా! ఓజగదధీశా! ఓమహాపన్నశరణ్యా! ఓనిఖిలపావనా! అని వినుతించెను గాని, కన్నుల నీరు పెట్టుటగాని, భయముచే నంగములు వడఁకించుటగాని చేయక యూరక నిర్వికారుఁడై యుండెను.

ఇట్లు దానవులు చేయు ఘోరకృత్యము లాప్రహ్లాదుని మారు నొప్పింపఁ జాలవయ్యెను. ఒక్కమాత్రైనను ఈ బాధలకుఁ దాళఁజాల ననకుండుటంజూచి వారచ్చెరువునొందిరి. ఆవిధ మహిరణ్యకశిపుఁ డెఱింగి యేకాంతమునఁ గూరుచుండి ఔరా!

ఉ. శూలములన్ నిశాచరులు స్రుక్కక దేహము నిగ్రహింపఁగా
బాలుఁడు నేలపైఁబడఁడు పాఱఁడు చావఁడు తండ్రినైన నా
పాలికి వచ్చి చక్రధరుపక్షము మానితి నంచుఁ బాదముల్
ఫాలము సోఁక మ్రొక్కఁ డనపాయతనొందుట కేమిహేతువో.

అని సంశయించుచు నెన్నియోవిధంబుల నింకను బాధింపుదు నని చింతించి దిగ్గజములచేఁ ద్రొక్కించియుఁ బాములచేఁ

గఱపించియు ననేకరీతుల బాధింపుఁ డని దానవవీరుల కాజ్ఞాపించెను. వా రట్లే చేసిరి. వానిచేఁ బ్రహ్లాదుఁడు బాధింపఁబడఁ డయ్యెను. అణుమాత్రమైన బాధింపఁబడినట్లు తోఁపఁజేయక నవ్వుచు శ్రీహరినామసంకీర్తనము చేయుచుండెను. ఆవిధమునంతయు దానవులు వచింపఁగా నాలకించి దానవేంద్రుఁ డొక్కనాఁడు రహస్యస్థలంబునఁ గూరుచుండి ముక్కుపై వ్రేలిడుకొని అక్కటా !

ఉ. ముంచితి వార్ధులన్ గదల మొత్తితి శైలతటంబులందు ద్రొ
బ్బించితి శస్త్రరాజిఁ బొడిపించితి మీఁదనిభేంద్రపంక్తి నొ
ప్పించితి ధిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందుఁ ద్రో
యించితిఁ బెక్కుపాట్ల నలయించితిఁ జావఁ డిదేమి చిత్రమో.

ఇంతియగాక

చ. ఎఱుఁగఁడు, జీవనోపధము లెవ్వరు భర్తలు లేరు బాధలం
దరలఁడు నైజతేజమునఁ దక్ష్యము జాడ్యము లేదు మిక్కిలిన్
వెఱయుచు నున్నవాఁ డొకని వేషము దైన్యము నొందఁ డింకనే
తెఱఁగున ద్రుంతు వేసరితి దివ్యము వీనిప్రభావ మెట్టిదో.

వాస్తవము నూహింప వీఁడు సామాన్యుఁడు కాఁడు. వీనితోడి వైరంబున నాకే మృతిసిద్ధించు నని తోఁచెడిని. అని చింతనము చేయుచుఁ జండామర్కుల రావించిన వా రరుదెంచి యాతనిసంశయముల నెఱింగి ధైర్యము చెప్పం దలంచి గంభీరముగా,

శా. శుభ్రఖ్యాతివి నీప్రతాపము మహాశ్చోద్యంబు దైత్యేంద్ర రో
షభ్రూభంగవిజృంభణంబున దిగీశవ్రాతముల్ బోరులన్

విభ్రాంతంబుగఁ జేసి యేలితిగదా విశ్వంబు వీఁ డెంత యీ
దభ్రోక్తుల్ గుణదోషహేతువులు చింతం బొంద నీ కేటికిన్.

శా. వక్రుండై నిజజనుండు వృద్ధగురుసేవం జేసి మేధానయో
పక్రాంతిన్ విలసిల్లు మీఁదట వయఃపాకంబుతో బాలకున్
శక్రద్వేషణ బద్ధుఁ జేయుఁడు మదిం జాలింపు మీరోషమున్
శుక్రాచార్యులు వచ్చునంత కితఁడున్ సుశ్రీయుతుం డయ్యెడున్.

అని హితంబుఁ దెలిపిరి. ఆమాటల కించుక యూఱడిల్లి గురుపుత్రులారా! గృహస్థులైన రాజుల కుపదేశింప ననువగు ధర్మంబుల నుపదేశించి నాకుమారుని సన్మార్గమునకుం ద్రిప్పుఁడని యాదేశించెను. వారంతఁ దదాజ్ఞ మౌళిం దాల్చి సకలవిధ ధర్మంబుల నుపదేశించిరి. ఆప్రహ్లాదుఁడు రాగద్వేషంబులచే విషయాసక్తులగు వారలకు గ్రహింప ననువగు ధర్మార్థకామంబులు తనకు నగ్రాహ్యంబు లని తలంచెను. అంతియగాక అనర్థంబులం దర్థకల్పనంబుచేయుట దిగ్భ్రమం బనియు నూహించెను.

ఆవల గురువులు కర్మానుష్ఠానమున కరుగఁగాఁ దనతో నాడుకొనవచ్చిన బాలకులం జీరి సోదరులారా! మనగురువులు మంచివిద్య చెప్పుటలేదు. ఇది యసద్విద్య. నేనొక్క చదువు చెప్పెద. అది నిరపాయము. అని వారి నేకాంతంబునఁ గూరుచుండఁబెట్టుకొని సాదరంబుగా,

ఉ. బాలకులార! రండు మనప్రాయపుబాలురు కొంద ఱుర్విపైఁ
గూలుట కంటిరే గురుఁడు క్రూరుఁ డనర్థచయంబునందు దు
శ్శీలత నర్థకల్పనముఁ జేసెడి గ్రాహ్యముగాదు శాస్త్రమే
మేలెఱిఁగించెదన్ వినిన మీకు నిరంతర భద్ర మయ్యెడిన్.

అని భక్తిమార్గంబునఁ గల భేదంబులం దెలుపుచు

సీ. కంటిరే మనవారు ఘనులు గృహస్థులై విఫలులై కైకొన్న వెట్టికనము
భద్రార్థులై యుండి పాయరు సంసార పద్ధతి నూరక పట్టువడిరి
కలయోనులం దెల్ల గర్భాద్యవస్థలఁ బురుషుండు దేహియై పుట్టుచుండుఁ
దన్నెఱుంగఁడు కర్మతంత్రుఁడై కడపట ముట్టఁడు భవశతములకు నైన

ఆ. దీన శుభము లేదు దివ్యకీర్తియు లేదు, జగతిఁ బుట్టిపుట్టి చచ్చిచచ్చి
పొరలనేల మనకుఁ బుట్టని చావని, త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి.

ఇంతియ గాదు. మఱొక్కయుదాహరణమును వినుడు. అది మీరు నెఱింగినదియే. వినం దెల్పెద.

శా. హాలాపానవిజృంభమాణమదగర్వాతీతదేహోల్లస
ద్బాలాలోకనశృంఖలానిచయ సంబద్ధాత్ముఁడై లేశమున్
జాలానిష్క్రమణంబుఁ గానఁడు మహావిద్వాంసుఁడుం గామినీ
హేలాకృష్టకురంగశాబకముగన్ హీనస్థితిన్ వింటిరే.

ఆ. విషయసక్తులైన విబుధాహితులతోడి, పనికి వలదు ముక్తిమార్గవాంఛ
నాదిదేవు విష్ణు నాశ్రయింపుఁడు ముక్త, సంగజనులఁ గూడి శైశవమున.

అని పెక్కురహస్యములు తెలిపెను, ఆబాలు రావాక్యముల నాలకించి ప్రమోదవాహినీనిమగ్నమానసులై,

ఉ. మంటిమి గూడి భార్గవకుమారుల యొద్ద ననేకశాస్త్రముల్
వింటిమి లేఁడు సద్గురుఁడు వేఱొకఁ డెన్నఁడు రాజశాల మం
కొంటికి నైనరావు చొరఁగా వెలికిం జనరాదు నీకు ని
ష్కంటకవృత్తి నెవ్వఁడు ప్రగల్భుఁడు చెప్పె గుణాఢ్య! చెప్పుమా.

మహాత్మా!

క. సేవింతుము నిన్నెప్పుడు, భావింతుము రాజ వనుచు బహుమానములన్
గావింతుము తెలియుము నీ,కీవింత మతిప్రకాశ మే క్రియఁ గలిగెన్.

అని ప్రశ్నించిరి. ప్రహ్లాదుఁడా బాలకుల కనేకనీతివాక్యము లుపదేశించి శ్రీహరిభక్తి ముక్తిసాధన మని చక్కఁగాఁ దెలిపెను. ఆమాటలకు బాలకులెల్ల మిగుల హర్షించిరి. గురువుల యుపదేశముల విన నిచ్ఛగింపరైరి. తుదకు

క. ఆడుదము మనము హరి రతిఁ, బాడుదమే ప్రొద్దు నిష్ణు భద్రయశంబుల్
వీడుదము దనుజసంగతి, గూడుదము ముకుందభక్తకోటిన్ సూటిన్.

అను ప్రహ్లాదోపదేశము గట్టిగా నమ్మిరి. ఆవిధ మెఱింగి శుక్రాచార్యపుత్త్రులు దానవనాథుపాలికిం బోయి మోము వెలవెల పోవఁగా,

శా. రక్షోబాలుర నెల్ల నీకొడుకు చేరం జీరి లోలోన నా
శిక్షామార్గము లెల్లఁ గల్ల లని యాక్షేపించి తా నందఱన్
మోక్షాయత్తులఁ జేసినాఁడు మనకున్ మోసంబు వాటిల్లె నీ
దక్షత్వంబునఁ జక్కఁజేయవలయున్ దైతేయవంశాగ్రణీ.

క. ఉల్లసిత విష్ణుకథనము, లెల్లప్పుడు మాకుఁ జెప్పఁ డీగుఱుఁ డని న
న్నుల్లంఘించి కుమారకు, లొల్లరు చదువంగ దానవోత్తమ వింటే.

తుదిమాట వినుము.

క. ఉడుగఁడు మధురిపుకథనము, విడివడి జడుపగిదిఁ దిరుగు వికసనమున నే
నొడివిన నొడువులు నొడువఁడు, దుడుకనిఁ జదివింప మాకు దుర్లభమధిపా!

అని తెలియఁ బలికిరి. ఆమాటల నాగ్రహించి తనయు రావించి యించుకయును గరుణంబూనక నిష్ఠురక్రోధవివశుఁడై యాడుగఁ జిచ్చి ప్రహ్లాదా! మూర్ఖుఁడా! దిక్పాలకులు నాయాజ్ఞ శిరసావహింతురు. నాదర్శనమునకు గోరి యింద్రకోలంది కాచి యుందురు. అగ్నిప్రభృతులు నాగృహమున వంటచేయు

చుందురు. దిక్పాలపత్నులు నా యింటః జేటులై యుందురు అట్టి నాయానతిమీఱి యేమో ప్రేలుచున్న వాఁడవు. మూర్ఖా

శా. కంఠక్షోభము గాఁగ నొత్తిలి మహాగాఢంబుగా డింభ వై
కుంఠుం జెప్పెదు దుర్జనుం డనుచు వైకుంఠుకు వీప్రత్రో
త్కంఠాబంధురుఁడేని నే సమరులన్ ఖండింప దండింపఁగా
కుంఠీభూతుఁడు గాక రావలదె మద్ఘోరాహవక్షోణికిన్.

కుమారా! ఆచార్యులు వచింపకయున్న యర్థమును దెలిసి నట్లు బోధించి బాలుర గురువిముఖులఁగా నొనర్చితి వఁట. ఇంతియగాక పగవాఁడగు విష్ణుని వర్ణించితివఁట. దీనిచే దానవ వంశాచారంబుల నేఁట గలిపితివి. ఇట్టి మూఢాత్ముని గులపాంసు నుని నీచుని నిప్పుఁ జంపుట పాపము గాదు. వంశమునకు మేలు గల్గించిన ట్లగును. అంతియగాక వంశమును నిర్దుష్టముగా నొనరించిన పుణ్యము లభించును. మఱొక్కమాట వినుము.

క. దిక్కుల గెలిచితి నన్నియు, దిక్కెవ్వఁడు రోరి నీకు దేవేంద్రాదుల్
దిక్కులరాజులు వేఱొక, దిక్కెఱుఁగక కొల్తు రితఁడె దిక్కని నన్నున్.

క. బలవంతుఁడ జగములను, బలములతో జనక వీరభావమున మహా
బలుల జయించితి నెవ్వని, బలమున నాడెదవు నాకుఁ బ్రతిపక్షుఁడవై.

అని పలికినఁ బ్రహ్లాదుఁడు చిఱునవ్వునఁ దనమనోభావమును దెలుపుచుఁ దండ్రితో మెల్లఁగా

క. బలయుతులకు దుర్బలులకు, బలమెవ్వఁడు నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వఁడు ప్రాణులకును, బలమెవ్వం డట్టి విభుఁడు బల మసురేంద్రా!

క. దిక్కులు కాలముతో నే, దిక్కున లేకుండుఁ గలుగు దిక్కుల మొదలై
దిక్కుగల లేనివారికి, దిక్కెవ్వఁడు వాఁడు నాకు దిక్కు మహాత్మా!

తండ్రీ! మఱొక్కబుద్ధి వినుము. కోపమున మదిని జెదఱ నీయకుము.

ఉ. లోకము లన్నియుం గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకముఁ జిత్తముం గెలువనేరవు నిన్ను నిబద్ధుఁ జేయు నీ
భీకరశత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధి లేఁ డొకఁడు నేర్పునఁ జూడుము దానవేశ్వరా!

ప్రియజనకా! నా ప్రార్థన నంగీకరింపుము.

క. పాలింపుము శేముషి నుర్మూలింపుము కర్మబంధముల సమదృష్టిం
జాలింపుము సంసారముఁ, గీలింపుము హృదయమందుఁ గేశవభక్తిన్.

అని పలుకుచున్న భాగవతశేఖరుం గాంచి దోషాచర ఖరుం డాగ్రహమున,

శా. నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాథుండ నాకంటె నీ
భూతశ్రేణికి రాజు లేఁ డొకఁడు సంపూర్ణప్రభావుండ మ
ద్భ్రాతం జంపిన మున్ను నీపెదకిటిం బల్మారు నారాయణుం
డేతద్విశ్వములోన లేఁడు మఱి వాఁ డెందుండురా దుర్మతీ!

పాపాత్ముఁడా! ప్రహ్లాదా!

క. ఎక్కడఁ గలఁ డే క్రియ నే, చక్కటి వర్తించు నెట్టి జాడను వచ్చున్
జక్కడుతు నిన్ను విష్ణుని, బెక్కులు ప్రేలెదవు వాని భృత్యునిపగిదిన్.

అని ఘోరధ్వనితోఁ బల్కెను. ఆమాటలకుం బ్రహ్లాదుఁడు హరి కింకరుఁడే యౌట శంకింపక ప్రమోదపులకాంకురసంకలిత సర్వాంగుండై యించుకంతయుఁ గోప మూనక త్వరపడక హృదయారవిందపీఠంబున శ్రీనాథుం దలంచి నిలిపి నమస్కరించి బాలవర్తనంబున నర్తనంబుఁ జేయుచు,

మ. కలఁ డంభోధిఁ గలండు గాలిఁ గలఁ డాకాశంబునన్ గుంభినిం
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోతచంద్రాత్మలన్

కలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తు లందంతటం
కలఁ డీశుండు కలండు తండ్రి వెదకం గా నేల యీ యాయెడన్.

క. ఇందుఁ గలఁ డందు లేఁ డని, సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన, నందందే కలఁడు దానవాగ్రణి వింటే.

అని కుమారుఁడు పలుకుచుండఁగా నెందున్న వాఁడో చూపు మని తండ్రి యాక్షేపించుచుండఁగా శ్రీహరి యాదానవనేతం జంప నరసింహాకృతి సర్వత్ర నెలకొనియుండెను. అత్తఱి నాదానవేంద్రుఁ డించుకంతయు నోర్పుపూనక

క. డింభక సర్వస్థలముల, నంభోరుహనేత్రుఁ డుండు ననుచు మిగుల సం
రంభంబునఁ బలికెద వీ, స్తంభంబునఁ జూపఁగలవె చక్రిం గ్రక్కిన్.

క. స్తంభమునఁ జూప వేనియుఁ, గుంభిని నీశిరముఁ ద్రుంచి కూల్పఁగ రక్షా
రంభమున వచ్చి హరి వి, స్రంభంబున నడ్డపడఁగ శక్తుం డగునే.

అని గద్దించెను. ఆమాటలకు జంకక విసుగుకొందక యేవ గింపక త్వరపడక ధైర్యము నెడఁబాయక సంతసమును దెలుపు నట్టి చూపులఁ జాలింపక ప్రహ్లాదుఁడు భక్తవత్సలుఁడగు భగ వంతునిభటుఁడు కావున,

శా. అంభోజాసనుఁ డాదిగాఁగఁ దృణపర్యంతంబు విశ్వాత్ముఁ డై
సంభావంబున నుండు ప్రౌఢ విపులస్తంభంబునం దుండఁ డే
స్తంభాంతర్గతుఁ డయ్యు నుండుటకు నే సందేహముం లేదు ని
ర్దంభత్వంబున నేఁడు గానఁబడు ప్రత్యక్షస్వరూపంబునన్.

అను పలుకులు చెవుల సోఁకినంతనే మండిపడి యుద్దండ విక్రముఁ డగుదానవనాథుండు హుంకరించి నిశాతఖడ్గంబు కరంబున నమర్చి జళిపించుచుఁ గొదుకుఁ దిరస్కరించుచు యుగాంత కాలహుతవహునిపోల్కిఁ గానంబడుచు,

మ. వినరా డింభక మూఢచిత్త గరిమన్ విష్ణుండు విశ్వాత్మకుం
డని భాషించెద వైన నిందుఁ గలఁడే యంచున్ మహాక్రోధియై
దనుజేంద్రుం డఱచేత వ్రేసెను మహోగ్రప్రభాశుంభమున్
జనదృగ్భీషణదంభమున్ హరి జనుస్సంరంభమున్ స్తంభమున్.

ఆవ్రేటున కా స్తంభంబు పగిలెను. పటపట యనుశబ్దము పుట్టెను. అది రోదోంతరంబుల నిండెను. సకలజగద్భయంకర రీతిం బొలుపారెను. అది విని జంతుసంతానంబులు నిశ్చేష్టితము లయ్యెను. కొండలు పగిలి ధరణిం ద్రొళ్లెను. ఆధ్వనియుఁ బైధ్వనిలోఁ జేరి వ్యాపింప సముద్రములు ఘూర్ణిల్లెను. ఆ ధ్వనియు వానితోఁ గలిసెను. బ్రహ్మాండకటాహంబును విదళింపఁ జూచెను. ఆసమయమున నా స్తంభమునుండి నరసింహమూర్తి యావిర్భవించెను. ఆరూపము చూడఁగా,

క. నరమూర్తి కాదు కేవల, హరిమూర్తియుఁ గాదు మానవాకారముఁ గే
సరియాకారము నున్నది, హరిమాయారచితమగు యథార్థముచూడన్.

అని యాతరుణమున హిరణ్యకశిపుఁ డూహించెను. అంతతో నాతనియూహ నిలువ లేదు.

ఉ. తెంపున బాలుఁ డాడిన సుధీరత సర్వగతత్వముం బ్రతి
ష్ఠింపఁ దలంచి యిందు నరసింహశరీరముఁ దాల్చి చక్రి శి
క్షింపఁగ వచ్చినాఁడు హరిచే మృతియంచుఁ దలంతు నైన నా
సొంపును బెంపు నందఱును జూడఁ జరింతు హరింతు శత్రుఘ్నన్.

అను నభిప్రాయము హిరణ్యకశిపునకుం గల్గఁ జేసెను.

అంత నాదానవేంద్రుఁడు ధైర్యము నూది గదాదండ ముద్దండగతిం గరంబునం బూని శ్రీనరసింహమూర్తి కెదురు నడచెను. చెంతఁ జేరినకొలఁదిని తదీయాప్రతిమానతేజోవిశేషంబున

దైత్యపతి నిర్గతప్రభుం డయ్యెను. అంతలో గదాదండంబు గిర గిరం ద్రిప్పి నరసింహమూర్తిపై వైచెను. ఆపరాత్పరుండా ప్రేటును లెక్కఁగొనక వానిం బట్టుకొనియె. వాఁడు నిలువక మిట్టిపడి పట్టు తప్పించుకొని చెలరేఁగెను. దేవత లించుక సంశయించిరి. అంతలో నరసింహమూర్తి యాదానవుని యాటోపంబు సైరింపక

## నృసింహమూర్తి హిరణ్యకశిపుని వధించుట

సీ. పంచాననోద్ధూత పావకజ్వాలలు భూనభోంతర మెల్ల బూరితముగ
దంష్ట్రాంకురాభీల ధగధగాయితదీప్తి నసురేంద్రు నేత్రము లంధములుగఁ
గంటకసన్నిభోత్కట కేసరాహతి నభ్రసంఘము భిన్నమై చలింపఁ
బ్రళయాభ్రచంచలా ప్రతిమభాస్వరములై ఖరనఖరోచులు గ్రమ్ముదేర
తే. సటలు జళిపించి గర్జించి సంభ్రమించి
దృష్టి సారించి బొమలు బంధించి కెరలి
జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి
పట్టె నరసింహుఁ డా దితి పట్టి (నపుడు).

ఆపట్టున దానవనాయకుఁడు హుంకరించెను. గాని వదలించు కొని పోవ శక్యము కాదయ్యెను. అత్తఱి

మ. విహగేంద్రుం డహిఁ ద్రచ్చుకైవడి మహోద్వృత్తిన్ నృసింహుండు సా
గ్రహుఁడై యూరువులందుఁ జేర్చి నఖసంఘాతంబులన్ వ్రచ్చె దు
స్సహ దంభోళికఠోరదేహు నచలోత్సాహున్ మహాబాహు నిం
ద్రహుతాశాంతకభీకరున్ ఘనకరున్ దైత్యాన్వయశ్రీకరున్.

శా. చించున్ హృత్కమలంబు శోణితము వర్షించున్ ధరామండలిం
ద్రెంచుం గర్కశనాడికావళులు ఛేదించున్ మహావక్షముం
ద్రుంచున్ మాంసము సూక్ష్మఖండములుగా దుష్టాసురున్ వ్రచ్చి వ
ర్తించుం బ్రేవులు కంఠమాలికలు కల్పించున్ నఖోద్భాసియై.

సీ. వక్షఃకవాటంబు వ్రక్కలు చేయుచో ఘనకుఠారంబుల కరణి నొప్పు
గలభీరహృదయపంకజము భేదించుచోఁ గుద్దాలములభంగిఁ గొమరుమిగులు
దమనీవితానంబు దవిలి ఖండించుచోఁ బటులవిత్రంబుల పగిది మెఱయుఁ
జఠరవిశాలాంత్రజాలంబుఁ ద్రెంచుచోఁ గ్రకచసంఘంబుల గరిమఁ జూపు
తే. సంతగతుఁడైన దైత్యుని సాగ్రహమున
శస్త్రచయముల నొంపక సంహరించి
యమరు నరసింహు నఖరంబు లతివిచిత్ర
సమరముఖరంబులై యుండె (జనవరేణ్య.)

ఇట్లు హిరణ్యకశిపుని విదళించి తనపై కరుదెంచు దైత్యనివహంబులం జక్రధారల నిశ్శేషంబుగా వధించెను. ఈరీతిగా

శా. రక్షోవీరుల నెల్లఁ ద్రుంచి రణసంరంభంబు చాలించి దృ
ష్టిక్షేపంబు భయంకరంబుగ సభాసింహాసనారూఢుఁడై
యక్షీణాగ్రహుఁడై నృసింహుఁడు కరాళాస్యంబుతో నొప్పెఁ దత్
వీక్షింపం బలికింపనోడి యితరుల్ విభ్రాంతులై డాఁగఁగన్.

ఆరూపము భయంకరమై చెలఁగెను. ఎవ్వరును డాయ నోడిరి. బ్రహ్మాదులు వేదమంత్రముల వినుతించిరి. దిక్పాలకులు పొగడిరి. మహర్షులు ధ్యానించిరి. శ్రీదేవియుఁ బ్రార్థించెను. దాని ఆఘోరరూపము చూడ నలవిగాకుండెను. ఎవరుగాని దాని శాంతింపఁజేయ నేర మని నిశ్చయించిరి. అత్తఱిఁ జతురాననుం డాలోచించి ప్రహ్లాదుకడకుం బోయి సవినయముగా

క. తీవ్రమగు రోషమున మీ, తండ్రినిమిత్తమునఁ జక్రి దారుణమూర్తిన్
వేంద్రము విడువఁడు మెల్లనఁ, దండ్రీ శీతలునిఁ జేసి దయచేయఁగదే.

అని ప్రార్థించెను. ఆప్రార్థనము నాదేశముగా శిరసావహించి ప్రహ్లాదకుమారుఁడు మందగమనంబున నమందవినయవివేకం

బుల నానరసింహమూర్తిని డగ్గఱి భయభక్తి వినయంబులు పెనంగొనఁగా నిలువంబడునంతనే

ఉ. ప్రాభవమొప్ప నుత్కటకృపామతియై కదియంగఁజేరి సం
శోభితదృష్టిసంఘములఁ జూచుచు బాలుని మౌళియందు లో
కాభినుతుండు పెట్టె నసురాంతకుఁ డుద్భటకాలసర్పభీ
తాభయదానశస్తము ననర్ఘశమంగళహేతుహస్తమున్."

ఇట్లు శ్రీనరసింహమూర్తి యభయదానంబు చేసిన నాకుమారుండు వినయవినమితకంధరుండై యనేకవిధంబుల వినుతించెను. ఆస్తోత్రరాజమునకుఁ బరమకరుణాతరంగితహృదయుండై పరమేశ్వరుండు సాదరాలోకనంబులం జూచి,

సీ. నీయట్టి సుజ్ఞాన నిపుణు లేకాంతులు కోర్కులు నాయందుఁ గోరనొల్ల
రట్టైనఁ బ్రహ్లాద యసురేంద్ర భర్తవై సాగి మన్వంతర సమయ మెల్ల
నిఖిలభోగంబులు నీవు భోగింపుము కల్యాణబుద్ధి నాకథలు వినుము
సకలభూతములందు సంపూర్ణుఁ డగు నన్ను యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి

ఆ. కర్మచయము లెల్ల ఖండించి పూజన, మాచరింపు మీశ్వరార్పణముగ
భోగముల నశించుఁ బుణ్యవ్రతంబులఁ, బాపసంచయములు పాయు నిన్నుఁ.

మఱియొక్కమాట వినుము.

ఆ. నరుఁడు ప్రియముతోడ నాయవతారంబు, నీచరిత్రము దాఁగీర్తనలను
మానసించునేని మఱిసంభవింపఁడు, కర్మబాధచయముఁ గడచి పోవుఁ.

అని పలికి బ్రహ్మాదుల నాదరించి నరసింహమూర్తి యదృశ్యుండయ్యె. ప్రహ్లాదుఁడు హరపంకజగర్భప్రభృతులకుఁ బ్రణమిల్లిన వార లాతని నాశీర్వదించి తమతమనివాసంబులకుం జనిరి. ప్రహ్లాదుఁ డంత జనని నూఱడించి భగవద్భక్తిపరాయణుండై సుఖం బుండెను.

ఆర్యబాలకులారా! ప్రహ్లాదుఁడు తండ్రియాజ్ఞమీఱెను గదా. గురువులాజ్ఞ లెక్కసేయక పోయెఁగదా. ఇది శాస్త్రసమ్మతమా? యని ప్రశ్నింపరాదు. ఎవరుగాని ధర్మమార్గమును మీఱినపుడు వారియందుఁ గల మరియాదను వీడుట తప్పుగాదని నిశ్చయింపుఁడు. ప్రహ్లాదుఁడు సామాన్యబాలుఁడు కాఁడనియు, దుష్టుని హింసించుటకు శ్రీహరి యాతని నొకసాధనముగాఁ బుట్టింప నవతరించె ననియుఁ దలంపుఁడు. ప్రహ్లాదుని ప్రవర్తనము శ్రద్ధగాఁ బరికించి తదనుగుణముగాఁ బ్రవర్తింపఁ బ్రయత్నింపుఁడు. ఏయేగుణముల నాప్రహ్లాదుఁడు త్రిలోకవినుతకీర్తి యగుచున్నాఁడో, వాని నలవఱచుకొనఁ బ్రయత్నింపుఁడు. ఈచరిత్ర పఠనమునకు ఫల మదియే. ఇదియే నేమీకుఁ దెలుపఁదగుమాట. ఇఁక నవ్వలికథను వినఁ బ్రయత్నపడుఁడు.

ఇది సప్తమస్కంధము.



# అష్టమస్కంధము

---

## గజేంద్ర మోక్షణము

ప్రహ్లాదచరిత్రము విని శుకయోగిచంద్రునిం గాంచి పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను. యోగీంద్రా! భక్తవరుని చరిత్రమూలముగా శ్రీమన్నారాయణమూర్తి యొనరించిన ధర్మరక్షణము వింటిని. పరమానందభరితుండ నైతిని. కాని యింకను బరాత్పరుని దివ్యగాథల నాలకింప నా మది త్వరపడి చుండు. ఆపదుద్ధారకుని యద్భుతచర్యల వినిపింపవే యని ప్రార్థించెను. పరీక్షిన్మహారాజు ప్రశ్నము నాలకించి సంతసించి శుకయోగి యిట్లనియె. రాజేంద్రా! చక్కని ప్రశ్న మొనరించితివి. ఎన్నిమారులు ప్రశ్నించినను విసుగులేక భగవచ్చరిత్రము వచింప నిచ్ఛ యుదయించుచునే యుండును. భక్తవరా! వేఱొకయద్భుతగాథను దెలిపెద వినుము.

మనువులు పదునలువురు కదా. అందు నాలవమనువు కాలమున జరిగిన కథ వినుము. మను వనఁగా ధర్మాధికారి. ఒక్కొక్కమనువుకాలమున నొక్కొక్క యధికారివర్గ మేర్పడును. ఈనాలవమనువు కాలమున నున్న యధికారులఁ దెల్పెద. నాలవమనువు పేరు తామసుఁడు. ఉత్తమున కితఁడు సోదరుఁడు. ఆయుత్తముఁడు మూఁడవమనువు. ఆతని కితఁడు తమ్ముఁడు. ఈతామసమనువు ధర్మరాజ్యమును బాలించు తఱి కేతు,

వృష, నర, ఖ్యాతి ప్రభృతులు రాజులు మనువుకొడుకులు పదుగురుండిరి. దేవతలు సత్యకహరివీరసంజ్ఞగలవారు. వారల కధిపతి యింద్రుఁడు వానిపేరు త్రిశిఖుఁడు. జ్యోతిర్వ్యోమ ప్రభృతులు సప్తర్షులు. ఆకాలమున భగవంతుఁ డగుహరి హరిమేధునకుఁ గొడు కయ్యెను. హరిమేధుని భార్య పేరు హరిణి యని. వారికి జనించిన పురుషుఁడు భగవదంశమున దుష్టుల శిక్షించి శిష్టులఁ గాపాడుచుండును. ఆమనువు కాలమున మకరముచేఁ బట్టుపడిన గజరాజును విడిపించి ప్రాణదానముచేసిన భగవంతుని కథయే యిపుడు చెప్పునది. అనుటయు రాజెంతయు నచ్చెరువంది యోగీశ్వరా! ఒకటి జలచరము. ఒక్కటి వనచరము. ఈరెండుజంతువులకుఁ బోరాట మెట్లు గలిగెను. భగవంతుఁ డాయారాటము నెట్లు మాన్పెను. ఘోరాటవిలో భద్రగజమునకుఁ గలిగిన యాపద నెట్లు తొలఁగించి శ్రీహరి తన మహిమను లోకులకుఁ దెలిపెను. ఆకథను విస్తరించి వచించి నాకానందమును గల్పింపుమా యని చేతులొగ్గి ప్రార్థించెను. యోగివర్యుం డానందతరంగితాంతరంగుఁడై,

సీ. రాజేంద్ర విను సుధారాశిలో నొకపర్వ
  తము త్రికూటం బనఁ దనరుచుండు
యోజనాయుతము పొడవు నున్నతత్వంబును
  నంతియ వెడలుపు నలిశఁ బొల్చుఁ
గాంచనాయసారకలధౌతమయము లై
  మూఁడు శృంగంబులం మొనయుచుండుఁ
దట శృంగబహురత్నధాతుచిత్రితము లై
  దిశలు భూనభములు తేజరిల్లు

తే. భూరిభూజలతాకుంజపుంజములును
మ్రోసి పఱతెంచు సెలయేటి మొత్తములును
మరగి తిరిగెడు దివ్యవిమానములును
జఋలఁ గ్రీడించు కిన్నరచయముఁగలిగి.

ఎంతయు నాశ్చర్యమును బుట్టించుచు నాపర్వత మెంతయో విఖ్యాతిం గాంచెను. అందలి సాంద్రారణ్యములు చూడ భయంకరములుగా నుండును. సింహాదులే యందు జంకి తిరుగుచుండు నన నింకఁదక్కుంగల ముక్కుడిమృగముల లెక్కింపనేల? దాని యుపత్యకయందు ఘోరారణ్య మొకటి కలదు దానిమహిమము వర్ణనాతీతము. దానియందుఁ గల ఘోరమృగముల లెక్కింప నొక్కఁడైన జగమున మొనగాఁడు లేఁడు. అందుఁ గొన్ని వన్యగజంబులు స్వేచ్ఛమెయిఁ దిరుగుచుండును. మొత్తముగా సంచరించుట వాని వాడుక.

ఒకనాఁ డావన్యగజములగుంపు డప్పిగొని కాఱు మబ్బులం దిరస్కరించు దేహంబులతోఁ గొండలనైనఁ బిండి చేయు పౌరుషములతో బయలువెడలుచుండునపుడు,

సీ. పులులమొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు
ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు
భూదారములు నేల బొఱియలలో డాఁగు
హరిదంతముల కేగు హరిణచయము
మడువులఁ జొరఁబాఱు మహిషసంఘంబులు
గండశైలంబులఁ గపులు ప్రాఁకు
వల్మీకముఁలు సొచ్చు వనభుజంగంబులు
నీలకంఠంబులు నింగి కెగయు

తే. వెఱచి చమరీమృగంబులు విసరువాల చామరంబుల విహరణ శ్రమముఁబాయ
భయదపరిహేల విహరించు భద్రకరులగాలి వాఱిన మాత్రాన జాలిఁబొంది.

ఇట్లు సకలసత్వభయంకరంబు లగు నాయేనుఁగు తండములతో నొక్కకరినాథుఁడు తన కరేణుకోటితో వెనుకఁ జిక్కెను. ఈశ్వరేచ్ఛచేఁగదా ప్రపంచము నడుచుచుండును. అవ్వల నయ్యేనుఁగుల మిన్న యొక్కమార్గమునఁ బోవుచుఁ దనచేడియలు వెనుకొని రాఁగా గహనమున విహరించి విహరించి మిక్కుటంబగు డప్పిచే బాధింపఁబడుచు మహోత్కంఠమునఁ బోయి పోయి

మ. అటఁ గాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజకహ్లారమున్
నటదిందీవరవారమున్ గమఠమీనగ్రాహదుర్వారమున్
వటహింతాలరసాలసాలసుమనోవల్లీకుటీతీరమున్
జటులోద్ధూతమరాళచక్రబకసంచారంబుఁ గాసారమున్.

ఆపంకజాకరంబుం బొడఁగాంచి నంతనే వాని యానందమునకుఁ బారములేక పోయెను. తాను ముందును దనచేడియలు వెనుకనుగా నందు డిగి యిష్టానుసారము జలములం ద్రావి కమలములఁ దొండములలాగివైచుచు వానిచే నొకదాని వేతొకటిగాఁ బ్రహారించుకొనుచు వచింప ననువుపడని వినోదములఁ గాలముఁ గడపుచుండెను. అట్టితఱి నాసరోవరంబు తనతొంటి యందమును గోలుపోయెను. విన్నదనంబునఁ జెలువముపోవ వెలవెలఁబాఱు చేడియవలెఁ గనఁబడసాగెను. అప్పుడు

సీ. భుగభుగాయతభూరిబుద్బుదచ్ఛటలతో గదలుచు దివికి భంగంబు లెగయ
భువనభయంకరఫూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ
వాలవిక్షేప దుర్వారజంఝానిల వశమున ఘుమఘుమావర్తమడరఁ
గల్లోలజాలసంఘట్టనంబులఁ దటీ తరు లమూలంబులై ధరణి గూల

తే. సరసిలోనుండి పొడఁగని సంభ్రమించి
యుందరి కుప్పించి లంఘించి హుంకరించి
భానుఁ గబళించి పట్టుస్వర్భానుపగిది
నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె.

ఆమకర మిట్లు ముందటి కాళ్లను బట్టుకొనఁగా హస్తివరం డుద్దామపౌరుషంబునఁ దొండమున దానిం బైకెత్తి దంతములఁ బొడిచి విసరివైచెను. జలగ్రహ మయ్యది యించుకం తయుఁ వెనుదీయక కరివాలము మూలమును గోరులఁ జీరెను. మరల నేనుఁగులతేఁ డద్దానిం దుండమునఁ గొట్టెను. అదియుఁ బదయుగళమును బీడించెను. ఇట్లా రెండును రేయింబవళ్లను భేదంబు లేక ఘోరంబుగాఁ బోరసాగెను. అత్తఱి

ఆ. మకరితోడఁ బోరు మాతంగవిభుని నొక్కరుని డించి పోవఁ గాళ్ళు రాక,
కోరి చూచుచుండెఁ గుంజరీయూథంబు, మగలుదగులు గారె మగువలకును.

కొంతకాల మిట్లు పోరాటము సాగఁగా

ఆ. జీవనంబు తనకు జీవనంబై యుంట, నలవుఁ జలము నంత కంత కెక్క
మకర మొప్పె, డస్సె మత్తేభమల్లంబు, బహుళపక్షశీతభాను పగిది.

అంతకంతకు బలంబు సన్నగిల్లుచున్నను మత్తేభంబు లేని బలంబుఁ దెచ్చుకొని యోపినంత పోరాడుచుండెను. కాని స్థానము బలము గల మకర మంతకంతకు విజృంభించి

శా. పాదద్వంద్వము నేలమోపి పవనున్ బంధించి పంచేంద్రియో
న్మాదంబుం బరిమార్చి బుద్ధిలతకున్ మాఁకాను హత్తించి ని
ష్ఖేదబ్రహ్మపదావలంబనగతిన్ గ్రీడించు యోగీంద్రు మ
ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరి పాదాక్రాంతి నిర్వక్రమై.

దుర్ధాంతవిక్రమంబునం దన్నుం బట్టి యిట్టట్టుకదలనీక బలమునఁ దన్నుఁ మించుచుండఁగా నేమియుం జేయందోఁపక

ఉ. ఊహకలంగి జీవనపుటోలమునం బడి పోరుచున్ మహా
మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం
దేహముఁ బొందు దేహిక్రియ దీనదశన్ గజముండె భీషణ
గ్రాహదురంతదంతపరిఘట్టిత పాదఖురాగ్రశల్యమై.

ఇట్లు,

క. అలయక సొలయక వేసట, నొలయక కరిమకరితోడ నుద్దండత రా
త్రులు సంధ్యలు దివసంబులు, సలిపెం బోరొక్క వేయిసంవత్సరముల్.

మ. పృథుశక్తిన్ గజ మాజలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సం
శిథిలంబై తనలావు వైరిబలముం జింతించి మిథ్యామనో
రథ మింకేటికి దీని గెల్వ సరి పోరంజాల రాదంచు స
వ్యథమై యిట్లను బూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తితోన్.

శా. ఏరూపంబున దీనిగెల్తు నిటమీఁ దేవేల్పుఁ జింతింతు నె
వ్వారిం జీరుదు నెవ్వ రడ్డ మిఁక నివ్వారిప్రచారోత్తమున్
వారింపం దగువార లెవ్వ రఖిలవ్యాపారపారాయణుల్
లేరే మ్రొక్కెద దిక్కుమాలిన మొఱాలింపం బ్రపుణ్యాత్మకుల్.

అక్కటా! అనేకగజవర్యములు నన్ను సేవించుచుండఁ బదిలక్షలకరిణీవతంసములకు నాథుండనై యుండితి. అట్టి నే నీ సరోవరమున కేల వచ్చితిని. ఈభయం బేమి చేయునో కదా పరమేశ్వరా! ఇంక నేదేవునిఁ బ్రార్థింతును? ఏపుణ్యాత్ములను వేఁడుదు? శరణాగతరక్షకులారా రండు. కాపాడుఁ డని యెవ్వారిం దలవంచి మ్రొక్కుదు. వినను సకలబ్రహ్మాండనాయకుండై సర్వాంతర్యామియై సర్వకర్తయై భక్తరక్షణబిరుదమునఁ దేజ

లిల్లుచుఁ గరుణాపారావారుఁ డనఁ ఆపదుద్ధారకుఁ డన, దీనజన కల్పభూరుహ మనఁ బొగడఁబడుచుఁ దనమహిమ నెవ్వారికిఁ దెలియ శక్యముగాక విరాజిల్లు నీశ్వరునిం బ్రార్థించెదం. ఆపరాత్పరుండు తక్క నింకొరు లెవ్వరు కాపాడఁజాలరు. ఇట్లు కొంతవడిఁ బ్రార్థించి సంశయముతో

క. కలఁ డందురు దీనులయెడఁ, గలఁ డందురు పరమయోగి గణముల పాలం
గలఁ డందు రన్నిదిశలను, గలఁడు గలం డనెడు వాఁడు గలఁడో లేఁడో.

అని యిట్లెంత యూహించిన నెంత ప్రార్థించినను గజరాజునకు దిక్కు కానరా దయ్యెను. అంతట మనంబున వేఱొక్క మార్గంబు చింతించి యీశ్వరసన్నిధానంబుం గల్పించుకొని భక్తిభరంబుతో నేకాగ్రమానసంబున మహానుభావా!

శా. లావొక్కింతయు లేదు ధైర్యము విలోలం బయ్యెఁ బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా.

క. విను దఁట జీవులమాటలు, చను దఁట చనరానిచోట్ల శరణార్థుల కో
యను దఁట పిలిచిన సర్వముఁ, గను దఁట సందేహ మయ్యెఁ గరుణావార్ధీ.

అని యిట్లు తన్ను రక్షింపు మని కుయ్యిడు గజరాజును రక్షింప భగవంతుఁ డాలోచింపసాగెను. ఈగజరాజు భగవత్సన్నిధానంబుఁ గల్పించుకొని కుయ్యిడుచుండఁగా

మ. అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో
త్పలపర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వలనాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై.

భక్తరక్షణమే ప్రధానకార్యముగా భావించిన యా పరాత్పరుఁడు శ్రీమన్నారాయణుండు మహాసంరంభంబున

మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్క నొత్తఁడు వివాదప్రోద్ధతశ్రీకుచో
పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

పురంబు నిర్గమించి నిజపరికరంబు మరల నవధరించి యాంబరంబునకు నుద్గమించి వేంచేయుచుండఁగా

మ. తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్ దానివె
న్కను బక్షీంద్రుఁడు వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖచ
క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగు వారాబాలగోపాలమున్.

ఇట్లు శ్రీమన్నారాయణుండు భక్తరక్షణపరాయణుండై

మ. వినువీథిం జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతిజీ
వనసంపత్తినిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు యోగీంద్రహృ
ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి
ష్ణు నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్.

ఈరీతిం బొడఁగాంచి

మ. చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె హరి పజ్జం గంటిరే లక్ష్మి శం
ఖనినాదం బదె చక్ర మల్లదె భుజంగధ్వంసియున్ వాఁడె క్ర
న్నన యేతెంచె నటంచు వేల్పులు 'నమో నారాయణాయే'తి ని
స్వనులై మ్రొక్కిరి మింట హస్తిదురవస్థావక్రికిం జక్రికిన్.

శ్రీహరి వారి నమస్కారణంబుల నంగీకరింపక పోయినపోయి యప్పంకజాకరంబుం బొడఁగని తనుమాలపించిన గజేంద్రుఁ డేమగునో యను నాతురంబున.

మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరముం ఖండింపఁగాఁ బంపె న
త్యరితాకంపితభూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబరశుక్రముం బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం
తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రముం జక్రమున్.

హరికరకమలనిర్ముక్తంబగు నాచక్రం బాతఱంబ చని

శా. భీమంబై తలఁ ద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మాశుక్రియన్
హేమక్ష్మాధరదేహముం జకితవన్యేభేంద్రసందోహముం
గామక్రోధనగేహముం గరటిరక్తస్రావగాహంబు ని
స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహముం గ్రాహమున్.

ఇట్లు సుదర్శన మాగజ రాజు పాలిటికి సుదర్శనమై మకరమును జంపఁగానే

క. మకర మొకటి రవిఁ జొచ్చెను,
మకరము మఱి యొకటి ధనదు మాటున డాఁగెన్
మకరాలయమునఁ దిరిగెడు
మకరంబులు కూర్మరాజు మఱుఁగున కరిగెన్.

ఇంతలో గజరాజు మబ్బుచాటునుండి విడివడిన శీతాంశుక్రియ మకరబాధానిర్ముక్తిం గాంచి వెలుంగఁగా

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశి సౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృత మహాభూతప్రచైతన్యమున్
సారోదారశితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును నిర్ధూతద్విషత్సైన్యమున్.

ఇట్లు తనయుత్సాహమును గనఁబఱచి శ్రీహరి పరమాదరంబునఁ జెంతకుం జని

క. నిడుదయగు కేల గజమును, మడుపున వెడలంగఁ దిగిచి మదజలరేఖల్
  దుడుచుచు మెల్లన పుడుకుచు, నుడిపెన్ విష్ణుండు దుఃఖము ర్వీనాథా!

దేహతాపము పాయఁగనే గజరాజు యథాపూర్వముగా నొప్పెను. అంత మకరము దేవలశాపముక్తిం గాంచి క్రూరతర గ్రాహరూపమును మాని తనపూర్వరూపమును దాల్చెను. అతఁడు హూహూనామగంధర్వుఁడు. పరమభక్తుఁడు గాన శాపముక్తిం బ్రసాదించిన భగవంతునకు నమస్కరించి తదనుమతి నొంది తనలోకమునకుం బోయెను.

ఆర్యబాలురారా! గజరాజు కథ వినుఁడు. ఈతఁడు తొలిజన్మమున ద్రవిళాధీశుఁడగు నింద్రద్యుమ్నరాజు. పరమ భక్తుఁడు. మునివృత్తి నవలంబించి శైలాగ్రభాగమునఁ దపము చేసెను. తనయాత్మ శ్రీహరి నునిచి ధ్యానించుచుండఁగా నగ స్త్యుం డచ్చోటికి కేతెంచి తనను గాంచి ప్రత్యుత్థానాదిసత్కా రంబు లాచరింపక యున్నరాజుం గాంచి కోపించి మూర్ఖుఁడా! గజయోనిం బుట్టువం గాంచు మని శపించెను.

క. మునిపతి నవమానించిన, ఘనుఁ డింద్రద్యుమ్నవిభుఁడు కొంజరయోనిం
  జననం బందెను విప్రులఁ, గని యవమానింపఁ దగదు ఘనపుణ్యులకున్.

ఇట్లు కావున నాశాపంబున నింద్రద్యుమ్ననృపతి గజరాజై జన్మించెను. అతనిభటులెల్లఁ గరులైరి. రాజు గజరాజైనను శ్రీహరి భక్తివదలక ధ్యానించెను. కాఁబట్టి

ఆ. కర్మతంత్రుఁ డగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు, నుభయ నియతవృత్తినుండెనేని
  చెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన, ప్రబలమైన విష్ణుభక్తి చెడదు.

అంతట శ్రీహరియుఁ దనపరివారంబుతో వైకుంఠము నకుం జనియె. ఈగాథ సకలాపన్నివారకం బగు. అని శుక యోగి యొఱింగించి మఱియు నిట్లు తెలిపెను. రాజా! వినుము. తామసునితమ్ముఁడు రైవతుఁడు. ఆతఁడు మను వయ్యెను. ఆ తరుణమునఁ బ్రతివింధ్యార్జునప్రభృతులు భూపాలకులు, వీరు మనువు నందనులు. హిరణ్యరోముఁడు, ఊర్ధ్వబాహుఁడు, వేద శీర్షుఁడు లోనగువారు మునులు. భూతరయాదులు దేవతలు. శుభ్రుఁ డనువానిపత్ని వికుంఠాంబ పరమసాధ్వియై యుండ నాదంపతులకు భగవంతుఁడు పుత్త్రుఁడై జన్మించెను. అప్పటిభగ వంతునిపేరు వైకుంఠుం డని, వైకుంఠలోకమును గల్పించి యందు నివసించెను.

ఆవల చతుఃపుత్త్రుఁడగు చాక్షుషుం డనువాఁడు షష్ఠము మనువయ్యెను. పురుఃపురుషసుద్యుమ్నాదులగు నాతనిపుత్త్రులు భూమీశ్వరు లైరి. మంత్రద్యుముఁ డింద్రుఁడుగా నుండెను. ఆప్యాదికు లమరులైరి. హవిష్మద్వీరకాదిఘనులు మునులు. వైరాజుఁ డనువానికి సంభూతివలనఁ బుట్టి యజితుఁడను పేరఁ బరఁగి భగవంతుఁడు ధర్మము గాపాడుచుండెను. ఆభగవం తుఁడే కదా కూర్మమై మందరాద్రిని సముద్రజలముల మునుఁగ కుండ మోచి యమరుల కమృతమును బ్రసాదించెను.

## క్షీరసాగరమథనము

అని పలుకు మునీంద్రునకు రాజేంద్రుఁ డిట్లు పలికెను. మహాత్మా! భగవంతుఁడు సముద్రమునఁ గూర్మావతారమునఁ బర్వతము నేల మోచెను? ఆకథ సవిస్తరముగా వచింపు మన యోగీశ్వరుఁ డానందమున నిట్లుబదులు చెప్పెను. రాజా! వినుము.

దేవతల యాటోపంబును సహింపక దానవులు తపఃప్రభావంబున గర్వించి శుక్రునాదేశంబున నింద్రాదులఁ బరాభవించిరి. ఇంద్రాదులు వారిధాటి కోర్వఁజాలక పోయిరి. వారెల్లంగూడి బ్రహ్మదేవునిపాలి కరిగి తమదుఃఖములఁ జెప్పుకొనిరి. విరించియు వారి దీనాలాపంబుల నాలించి ధైర్యము చెప్పి శ్రీమన్నారాయణు నేకాగ్రమానసంబున వారిం గూడి ప్రార్థించెను. శ్రీహరి వారి యెదుటఁ దోఁచెను. అత్తఱి

సీ. హారకిరీటకేయూరకుండలపాద కటకకాంచీలతాకంకణాది
కౌస్తుభోపేతంబుఁ గౌమోదకీశంఖ చక్రశరాసనసంయుతంబు
మరకతశ్యామంబు సరసిజనేత్రంబుఁ గర్ణాభరణకాంతి గండయుగముఁ
గలితకాంచనవర్ణ కౌశేయవస్త్రంబు శ్రీవనమాలికాసేవితంబు

ఆ. నైన మనోహరంబు నైన దివ్యసౌభాగ్య
మైన యతనిరూపు హర్ష మెసఁగఁ
జూచి బ్రహ్మ హరుఁడు సురలును దానును
బొంగి నమ్రముఁ దగుచుం బొగడఁ దొడఁగి.

చెక్కు వేదమంత్రంబుల వినుతించి దేవతల కష్టముల విన్నవించెను. ఆమాటల విని యాదిదేవుఁడు గంభీరభాషణంబు లొప్పారుచుండఁగా

క. ఓనలువ యోసురేశ్వర, యోనిటలతటాక్ష యోసురోత్తములారా
దానవులతోడ విగ్రహము, మానుగఁ బోరామి కలిగి మనుటే యొప్పున్.

ఏలయంటిరేని వినుఁడు. దానవులు తపోబలగర్వితులు. వీరాగ్ర సమర్థులరు. కావున నిపుడు సంగరముచేయుట పాడి గాదు. కావున నమృతోత్పాదనయత్నము చేయుఁడు. దానవులకొఱంతలు తీఱు. హృష్టపుష్టాంగుల రగు మీమ్ము వారు

గెల్వఁజాలరు. ఈయుపాయము తప్ప వేఱొండు లేదు. వినుఁడావిధాన మెఱింగింతును.

సీ. పాల మున్నీటిలోపల సర్వతృణలతా మథములు తెప్పించి చాల వైచి
మందరశైలంబు మంథానముగఁ జేసి తరచ వాసుకిఁ దరి త్రాడుచేసి
దానవసహాయతచేత నలి నందఱును మీరుద్ధరువుఁడు వేగ మతంద్రులగుచు
ఫలము మీఁ దయ్యెడు బహుళదుఃఖంబులఁ బడుదురు దైత్యులు పాపమతులు

ఆ. అలవ దేవిశేక యమృతార్థములు గల్గు విషధిలోన నొక్కవిషము పుట్టుఁ
గలఁగి వెఱవవలదు కామరోషంబులు వస్తుచయమునందు వలదు చేయ.

అని యాజ్ఞాపించి యంతర్ధానంబు నొందెను.

అసురు లంత నయ్యనంతునాజ్ఞ శిరసావహించి దానవులతోఁ గయ్యంబుసేయుట మాని నమస్కరించి ప్రార్థింపవై రోచనియగు బలి దానవుల నుడిపి దేవతల కభయదాన మొసంగెను. దేవతలు కొలఁదిదినములు కమృతాహరణప్రయత్నము దెలుప నసురు లంగీకరించిరి. సకలలతలను ద్రుణములనోషధులఁ దెచ్చి క్షీరసాగరమున వైచిరి. మందరపర్వతమును కవ్వముగా నమర్చిరి. వాసుకిని త్రాడుగా నేర్పఱిచిరి. ఇట్లు ప్రయత్నంబు చక్కఁగాఁ జేసి యప్పర్వతంబున దేవదానవులు పట్టి పైకెత్తి తెచ్చుచుండఁగా నాభారంబునకు సైపనోపక పట్టుదలఁగ నది వారిపైఁబడెను. దానఁ గొందఱు మృతి నొందిరి. కొందఱు వికలాంగు లైరి. దేవత లప్పుడు బుద్ధిమాని శ్రీహరికడ కేలపోయితి మని చింతించిరి. అంతలో

మ. గరుడారోహకుఁడై గదాదిధరుఁడై కారుణ్యసంయుక్తుఁడై
హరి కోటిప్రభతో నొహో వెలుఁగుచుం డంచుం బ్రదీపించి త

ద్దిం గేలన్ నలువొందఁగందుకము మాడ్కిం బట్టి క్రీడించుచున్
గరుణాలోకసుధన్ సురాసురుల ప్రాణంబులన్ సమర్థించుచున్.

పర్వతరాజమా! సముద్రమునకుం బొమ్మా. ఇది దేవతా కార్యము. లోకములకు మహోపకారము దీనఁ గలుగు. అని యాజ్ఞాపించెను.

పాఠకులారా! కొండను సముద్రమునకుం బొమ్మా యని హరి పలుక నది నడచునా యని శంకింపవలదు. మన యాజ్ఞవంటిది భగవదాజ్ఞ కాదుకదా. అది యప్రతిహతమై మనఁ జను. కావున మనయూహాపోహలు భగవచ్ఛక్తివిషయమై యుపయోగింపవు. నాస్తికవాదములం జెవి యొగ్గకుఁడు. అవలిచరిత్రమును వినుఁడు. భగవదాజ్ఞ కాఁగా నాపర్వతము పాలసముద్రమునఁ బడియెను. దేవదానవులు వాసుకిని త్రాఁడుగా నమర్చిరి. పూన్కిమై దానిం బట్టి చిలుకఁ దొడంగిరి. అందుఁ దొలుత దేవతలు వాసుకి ఫణమును బట్టుకొనిరి. దానవులు తోఁకను బట్టుకొనిరి. శ్రీహరి యాలోచించి దానవుల మాయామోహితులను గావించెను. దానవార లుగ్రమతులై దేవతలం గాంచి సురలారా! మీరు మహోత్తరపౌరుషవంతులవలె వాసుకి ఫణాగ్రమును బట్టుకొనియుండఁగా మేము పిఱికిపందలవలెఁ దోఁకఁబట్టుకొనియుందుమా. మేము పరాక్రమ విహీనులము కాము. కావున మీరు తోఁకఁబట్టుకొనుఁడు. మేమే ఫణాగ్రభాగమును బట్టుకొందుము. అని పలికిరి. పాపమా దానవు లిపుడు తమకు రానున్న కీడు నెఱుంగరు. వారి మనస్సులు విష్ణుమాయ స్వాధీనమున నున్నవి. ఆమాయ

లీదానవులఁ దోలుబొమ్మలవలె నాడింపఁబూనెను. ఇఁక నెట్లాడఁబడెనో యట్లాడుదురు.

ఆరీతి దానవులు పలుక దేవత లాఫణాగ్రమును వదలిరి. అసురులార్పుచు దానిం గైకొనిరి. ఇట్లు చిలుకుచుండఁగా దాని బాధ నోర్వఁజాలక వాసుకి విషముఁ గని పలవించుచుండఁగనే మందరపర్వత మాసముద్రమున మునిఁగెను. దేవదానవులు చేతులు పిసికికొన మొదలిడిరి. వెంటనే శ్రీమన్నారాయణ మూర్తి మహాత్తరకమఠాకృతిం దాల్చెను. ఆ యాకార మత్యద్భుతము. అది వీఁపున నిట్టి పర్వతముల నెన్నింటినేఁ దాల్పఁగలదు. అప్పుడు మధుసూదనుండు

మ. కమఠంబై జలరాశిఁ జొచ్చి లఘుముక్తాశుక్తిచందంబునన్
   సమదద్రీంద్రము నెత్తె వాసుకి మహానాగంబుతో లీలతో
   నమరేంద్రాదులు మౌళికంపములతో నౌ నౌఁ గదే బాపురే
   కమలాక్షా శరణంచు భూదిశలు నాకాశంబునున్ మ్రోయఁగన్.

ఆయద్భుతమహత్తరకార్యమును జూచి దివినున్న ఖచరులు తమలోఁ దాము

క. తరిఁగాంచ్రాన నొకఁ డంట, తరిగడవకుఁ గుదురు నాఁక త్రాఁ డట చేపల్
   తరిగవ్వంబును దా నఁట, హరిహరి! హరి చిత్రలీల హరిమె యెఱుఁగున్.

అని చెప్పుకొనిరి. పాఠకులారా!

ఆ. జలధిఁ గడవచేయ, శైలంబుఁ గవ్వంబు
   చేయ భోగిఁ ద్రాడు చేయఁ దరువ
   సిరియు సుధయుఁ బడయ శ్రీవల్లభుఁడు దక్క
   నొరుఁడు శక్తిమంతుఁ డొకఁడు గలఁడె.

వింటిరికదా!

ఆ. మూఁడు మూర్తులకును మూఁడులోకములకు
మూఁడుకాలములకు మూల మగుచు
భేద మగుచుఁ దుది నభేదమై యొప్పారు
బ్రహ్మ మనఁగ నీవ ఫాలనయన.

అని వేనవేలు విధంబుల వినుతించి హాలాహల బాధ నెఱింగించిరి.

పరమశివుం డామాట లాలకించి కరుణారసపరిపూర్ణహృదయుండు కావునఁ దన యర్ధాంగలక్ష్మి యగు గిరిజాదేవిం గాంచి స్మితపూర్వకముగా

క. ప్రాణేచ్ఛ వచ్చి చొచ్చిన, ప్రాణుల రక్షింపవలయుఁ బ్రభువుల కెల్లన్
బ్రాణుల కిత్తురు సాధులు, ప్రాణంబుల నిమిషభంగురము లని మగువా.

క. పరహితము చేయు నెవ్వఁడు, పరమహితుం డగును భూతపంచకమునకుం
బరహితమె పరమధర్మము, పరహితునకు నెదురు లేదు పర్వేందుముఖీ.

క. హరి మది నానందించిన, హరిణాక్షి జగంబులెల్ల నానందించున్
హరియును జగములు మెచ్చఁగ, గరళము వారించుటొప్పుఁ గమలదళాక్షీ.

అని ప్రాణేశ్వరుఁ డాదరంబునఁ బలుక నాసర్వమంగళాంబ నవ్వుచుఁ దన సమ్మతిం దెల్పెను.

పాఠకులారా!

క. మ్రింగెడు వాఁడు విభుం డని,
మ్రింగెడు నది గరళ మనియు మే లని ప్రజకున్
మ్రింగు మనె సర్వమంగళ,
మంగళసూత్రంబు నెంత మది నమ్మినదో.

ఇట్లు పార్వతి తనసమ్మతిం దెలుపఁగనే భగవంతుఁ డా క్షణంబ లేచి దేవతాధిపులు పరమసేవకులై వెంటరాఁగాఁ

బోయి పోయి యవార్యవీర్యంబున నెదురులేక విజృంభించు హాలాహలంబును ఫలమువలెఁ బట్టి మ్రింగెను. ఆవిషజ్వాలలామహాదేవునకు నించుకంతయు బాధకల్గించినవి కావు. ఆ విషమును గుటుకనిడిన లోకములు నశించు నని యెంచి కంఠమున నుంచెను. దానఁ గంఠము నల్లనయ్యెను. కావుననే గరళకంఠుఁ డనుపే రీశ్వరునకు వచ్చెను.

అవ్వల దేవాసురు లాపాలకడలిం దరువసాగిరి. అందుఁ గామధేనువు పుట్టెను. మునులు పుచ్చుకొనిరి. ఉచ్చైశ్శ్రవమను హయ ముద్భవించెను. బలి దానవుఁడు గ్రహించెను. ఐరావతము జనించెను. ఇంద్రుఁ డంగీకరించెను. కల్పవృక్షము పుట్టెను. దేవత లాదరించిరి. అప్సరోబృందము వెడలివచ్చెను. స్వర్గవాసు లాదృతిం దోడ్కొనిపోవ నుంకించిరి. చంద్రుఁ డుదయించెను. బ్రహ్మ యంబరమున యథాపూర్వముగ నెలకొన నియమించెను. మహాలక్ష్మి ప్రభవిల్లెను. ముకుందునకుఁ దగునని యెల్లరనిరి. వారుణీదేవియగపడెను. అసురులా మెనుగారవించిరి. అంతఁ దరువం దరువ నమృతకలశముచేఁ గొని ఆయుర్వేదవిదుఁడు వెడలివచ్చెను. రాక్షసు లాటోపంబున నాకలశమును దీసికొనిరి. దేవతలు గుటకలు మ్రింగుచుండిరి. శ్రీహరీ! ఇంక మాగతి యేమని మొఱపెట్టుకొనిరి. దానవులందు నొకనిచేతినుండి వేఱొకనిచేతి కాకలశము మాఱుచుండెను.

## శ్రీహరి మోహినీరూపమును దాల్చుట

అంతట శ్రీహరి యిఁకఁ దడవుచేయరా దని యూహించి జగన్మోహనమగు నాకార మొప్పారు మోహినియయ్యెను. ఆ మెరూపమును వర్ణింప నశక్యము. ఆరూపమును జూడఁగానే

యొడలెఱుంగక యీయమృతకలశము నొసంగి దీనిని మాకును దేవతలకుఁ బంచి యిమ్ము. పంక్తిగాఁ గూరుచుండుదుము. అని పలుక నామోహినియుఁ జెఱునవ్వున

క. సుందరు లగు పురుషులఁ గని
పొందెదు నాయందు నిజము పుట్టునె మీకున్
బృందారకరిపులారా
చెందరు కామినుల విశ్వసింపరు పెద్దల్.

ఐనను నా నేర్చువిధంబునఁ బంచి యిచ్చెద. ఓపిక మెఱయఁ గూరుచుండఁగలరే అని పలికెను. ఆర్యబాలకులారా!

క. ఆకాంతాలోకనములు, సాకూతలభాషణములు సాలాలితముల్
రాశిపరంపర లగుచున్, బాశములై వారి నోట్ల బంధించె (జాఁడీ).

వారూరకుండుటం గాంచి యాసుందరి మందమందగమనంబున దేవతల నొకపంక్తిగ నసురుల నొకపంక్తిగఁ గూరుచుండఁ జేసి యిదిగో వచ్చెద. ఆతురపడకుడీ దానవులారా! యని యాశ్వాసించుచు దేవతల కమృతమును బోయుచుండఁగా రాహువు కామరూపంబున దివిజుల నడుమం గూరుచుండి త్రాగుచుంటఁ గాంచి రవిశశాంకులు తెలుప శ్రీహరిచక్రము గంఠము ఛేదింప నజుఁడు వియద్భాగంబున గ్రహపంక్తి నుండ నాజ్ఞాపించెను. ఒక్కబొట్టు మిగలకుండ నమృతమును దివిజులకుం బోసి పాత్రము నక్కడఁ బాఱవైచి హరి యథాపూర్వ రూపమున నలరారెను.

అవ్వల దేవదానవులకుఁ బోరు ఘోరంబుగా సాగెను. అమృతపానంబున దివిజులు రాక్షసుల గెల్చిరి. శ్రీహరి సాయమై

యుండెను. రక్కసులోడి పాఱిరి. పాతాళంబు వారికి శరణ మయ్యెను.

## —● వామనచరిత్రము ●—

అని ఇట్లు శుకయోగి తెలుపఁగా రాజు పరమానంద మున యోగీంద్రా! బలిచక్రవర్తిని యాచించి భగవంతుఁ డింద్రునకు స్వర్గము నిచ్చె నని విందు. ఆచరిత్రమును విన వేడు కయ్యెడు నన యోగి యిట్లనియె. రాజేంద్రా! పరమభక్తుఁడవు. కావున విష్ణుగాథల నాలకింపఁ గోరెదవు. విను మాచరితము నెఱింగించెద.

బలి పురుహూతునిచే నోడింపఁబడి శుక్రుని నాశ్ర యించి తదుపదిష్టమార్గంబున విశ్వజిద్యాగ మొనరించెను. అగ్ని నుండి దివ్యకాంచనరథము, సూర్యాశ్వములఁ దిరస్కరించు గుఱ్ఱములు, కంఠీరవధ్వజము, మహాత్తరదివ్యధనువు, తూణీర ద్వయము, అభేద్యవజ్రకవచము వెడలివచ్చెను. వాని సాయ మున నమర్త్యులతోఁ బోరాడి గెల్చెను. దేవేంద్రుఁడోడిపాఱెను. స్వర్గము బలివశము నుండెను. దేవతలు పడరానియిడుమలఁ బడుచుండిరి. శచీదేవి దుఃఖాక్రాంతహృదయ యయ్యెను.

అదితి కశ్యపునిఁ గాంచి తనకొడుకులవగల నెఱింగిం చెను. ఆమునివరుఁ డూహించి పయోభక్షణం బను వ్రతము నామెకు నుపదేశించెను. దాని నాచరించెను. శ్రీనారాయణ మూర్తి కనంబడినంతనే భక్తినమ్రకంధరయై చేతులు ముకుళించి వినుతించి మహాత్మా!

ఆ. అసురవరులు సురల నదలించి బెదరించి, నాక మేలుచున్న నాఁటనుండి
కన్నకడుపు గానఁ గంటఁగూరుకురాదు, కడుపు పొక్కమాన్పి కావవయ్య

అని ప్రార్థించెను. భగవంతుఁ డామె వాంఛితంబు విని సాదరంబుగా అవ్వా!

మ. బలిమిన్ దైత్యులఁ జంపరాదు వినయోపాయంబునం గాని సం
 చలనం బొందక నేను నీ నియతికిన్ సత్యోక్తికిన్ మెచ్చితిన్
 బలివిద్వేషియు నాశిలింపగఁ బూవుం బౌత్రమియంక్ మెచ్చు దై
 త్యుల రాజ్యంబు హరించు నింద్రునకు నిత్తున్ దుఃఖ మిఁకేటికిన్.

అని పలికి యదృశ్యుం డయ్యెను. అదితియుఁ గొంతకాలమును గర్భమును దాల్చి భగవంతునిఁ గుమారునిఁగాఁ గనియె. ఆ కాలము పరమపవిత్రము. పాఠకులారా!

మ. రవి మధ్యాహ్నమునం జరింప గ్రహతారాచంద్రభద్రస్థితిన్
 శ్రవణద్వాదశినాఁడు శ్రోణ నభిజిత్సంజ్ఞాతలగ్నంబునన్
 భువనాధీశుఁడు పుట్టె వామనగతిం బుణ్యవ్రతోపేతునన్
 దివిజాధీశ్వరు మాతకుం బరమపాతివ్రత్యవిఖ్యాతకున్.

ఇట్లు పుట్టిన యామహాత్మునకు వామన నామం బిడిరి. కొలఁదికాలమున కావిభున కుపనయనము చేసిరి. స్వర్గమున నున్న బలియొద్ద కెల్ల యాచకులు పోవుచుండ వారితోడ వామనుఁడును పోయెను. ఆతరుణమున బలిచక్రవర్తి యజ్ఞమును జేయుచుండెను. భూసురులం గూడి మఖవాటికం జొచ్చెను. ఆ మహనీయరూపమునుం గాంచి యచ్చటివా రచ్చెరువొందిరి. అంత వామనమూర్తి మెల్ల మెల్లన దానవచక్రవర్తిం జేరి సులలిత వాగ్భణితి యిట్లనె

మ. ఇతఁడే దానవచక్రవర్తి సురలోకేంద్రాగ్ని కాలాది ది
 క్పతిగర్వాపహరప్రవర్తితశోభస్ఫూర్తి దానాదిముఖ
 ప్రతిదానప్రవణానువర్తి సుమనోరామానునోక్షీదశో
 ద్ధతచంద్రాంశుకీర్తి రత్నాకరుణా ధర్మోన్నతస్ఫూర్తి తాన్.

అని పలికి కుశపవిత్రాక్షతసంయుతంబగు దక్షిణహస్తంబుసాఁచి పరమాదరంబున దీవించెను. ఆవటువును జూచి యానుమానీయు నందుఁ గనుపట్టు మహోత్తరతేజస్సును గాంచి యబ్బురపడి బలి పీఠమునుండి డిగి నమస్కరించి పాదంబులు కడుగ బంగారు కలశంబుగొని భార్య జలములు పోయఁ దాఁగడిగి తడియొత్తి యాజలము మస్తకమునఁ జల్లుకొనుచు మహాభక్తివినయములు తోఁపఁగా

మ. వడుగా యెవ్వరివాఁడ వెవ్వఁడవు సంవాసస్థలం బెయ్యది
య్యెడకున్ నీవరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్
గడుధన్యాత్ముఁడ నైతి నీమఖము యోగ్యం బయ్యె నాకోరికల్
గడచేరెన్ సుహుతంబులయ్యె శిఖులుం గల్యాణ మిక్కాలమున్.

అని యంతతో నిలువక పైఁబైఁబొంగు నుల్లాసంబున

మ. వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హయులో రత్నములో రథంబులొ విమృష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా.

అని ప్రశ్నించెను. ఆమాటలు విని వామనమూర్తి తనసర్వజ్ఞత్వ సర్వనియంతృత్వములు బయలుపడునట్లుగా

సీ. ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు నొకచోటనక యెందు నుండ నేర్తు,
నెవ్వనివాఁడ నం చేమని పలుకుదు నాయంత వాఁడనై నడువ నేర్తు,
నీనడవడి యని యెట్లు వక్కాణింతుఁ బూని ముప్పోకలఁ బోవ నేర్తు,
నది నేర్తు నిది నేర్తు నని యేల చెప్పంగ నేరుపు లన్నియు నేన నేర్తు.
తే. నొరులు గారు నాకు నొరులకు నే గాదు
నొంటివాఁడఁ జుట్ట మొకఁడు లేఁడు

సిరియుం దొల్లి [illegible] చెప్పడ [illegible]

సుజనులందు [illegible] [illegible] యుండదు.

బలిచక్రవర్తి! [illegible]వంశము సద్వంశము. ప్రహ్లాదుఁడు జగద్విఖ్యాత[illegible] మహాదాతవగు నిన్ను నే నీవఱకు యాచించినది లేదు. [illegible]ను బ్రహ్మచారిని. ఎక్కువలు కోరఁదగనిదికదా [illegible] క్రమము. కాబట్టి

[illegible] పాదముల నొకటి రెండడుగుల, మేరయిమ్ము సొమ్ము మేర యొల్ల

[illegible]దీన బ్రహ్మాండకోటి మొత్తైన, దాన కుతుకసాంద్ర దానవేంద్ర.

అని పలికి యూరకుండెను. ఆపలుకుల కానందించి బలిచక్రవర్తి బరమాదరంబున

ఆ. ఉన్నమాటలెల్ల నొప్పుగ విప్రుండ, సత్యగతులు వృద్ధసమ్మతంబు

బడుగఁ దలఁచి కొంచె మడిగితి వోకెల్ల, దాతపెంపు సొంపుఁ దలఁపవలదె.

వత్సా! కేవల మర్భకుఁడవు. కావున నేమడుగవలయునో యెఱుంగవు.

మ. వసుధాఖండము వేఁడితో గజములన్ వాంఛించితో వాజులన్

వెసనాహారము గోరితో యువతులన్ వీక్షించి కాంక్షించితో

పసిబాలుండవు నేరవీ వడుగ నీ భాగ్యంబు లీపాటిగా

కసురేంద్రుం గని పదత్రయం బడుగ నీయల్పంబు నీ నేర్పునే.

అని పలుకఁగా విని కపటనాటకసూత్రధారుఁ డగు వామనమూర్తి

మ. గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్ ముంజియో దండమో

వడుగే నెక్కడ? భూము లెక్కడ? కరుల్ వామాక్షులశ్వంబు లె

క్కడ? నిర్లోభితకర్మ మెక్కడ? మదాకాంక్షామితంబైన మూఁ

డడుగుల్ మేరయ త్రోవ కిచ్చు టది బ్రహ్మాండంబు నాపాలికిన్.

ఇంతియకాక మఱొక్క కారణంబు గలదు. అదియే ముఖ్యము ఆలకింపుము.

క. వ్యాప్తిం జెందక వగవక, ప్రాప్తంబగు లేశమైనఁ బదివే లనుచున్
దృప్తిం జెందని మనుజుఁడు, సప్తద్వీపముల నైనఁ జక్కంబడునే.

మహారాజా! దాతసొంపు పెంపు తలఁపవలదే యంటివి. నిజమే కాని

ఆ. నీవు రాజవనుచు నిఖిలంబు నడుగుట, దగవుగాదు చాలఁ దగినకొలఁది
యేను వేఁడికొనిన యీపదత్రయమును, జాలుదనక యిమ్ము చాలుఁజాలు.

అన్నంతనే బలి దానవచక్రవర్తి మనంబునఁ బొంగుచు నుత్సాహంబున రమ్మని యుర్వీదానంబు చేయఁ బూనెను. ఆమాటల వైఖరిం గనిపెట్టి శుక్రాచార్యుఁడు బలిని నివారించి యిట్లు పలికెను. దానవేంద్రా! ఈతఁడు విప్రుఁడు కాఁడు. దేవతాకార్యంబు నెఱవేర్పంబూని హరి యీరూపమున వచ్చినవాఁడు. ఈతని కపటమెఱుంగక యిత్తునంటివి. నీచే దానంబుఁ గొని లోకత్రయ మాయింద్రున కిచ్చును. మఱల నీవెట్లు బ్రతికెదవు? నిన్ను నమ్మియున్న దానవుల నెట్లు కాపాడఁజాలుదువు. మాట యిచ్చితి. ఎట్లు మారవచ్చు ననకుము. విశేషశాస్త్రము సామాన్యశాస్త్రమును బాధించును. కావున

ఆ. వారిజాక్షులందు వైవాహికములందుఁ, బ్రాణవిత్తమానభంగమందుఁ
జకితగోకులాగ్రజన్మరక్షణమందు, బొంకవచ్చు నఘము పొందఁ దధిప.

అని మఱియుఁ బెక్కుభంగులఁ దెలిపెను. ఆమాటలు చెవులకు ములుకులవలెఁ దోఁపఁగా బలి చేతులుమోడ్చి, ఆచార్యా!

శా. కారేరాజులు రాజ్యముల్ కలుగవే గర్వోన్నతిం బొందరే
వారేరీ సిరిమూటఁగట్టుకొని పోవం జాలిరే భూమిపైఁ

వేరైనం గలదే శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మఱచిరే యీకాలమున్ భార్గవా.

మఱియొక్కమాట యాలకింపుము.

శా. ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట మీఁదై నాకరం బుంట మేల్
గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే.

నానిశ్చితార్థమును వినుఁడు.

మ. నిరయంబైన నిబంధమైన ధరణీనిర్మూలనంబైన దు
ర్మరణంబైనఁ గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరుఁడైనన్ హరియైన నీరజభవుం డభ్యాగతుండైన నాఁ
దిరుగన్ నేరదు నాదుజిహ్వ వినుమా ధీవర్య! యింకేటికిన్.

క. మేరువు తలక్రిందైనను, బారావారంబు లింకఁ బాఱిన లోలో
ధారణి రజమై పోయినఁ, దారాధ్వము బద్ధమైనఁ దప్పక యిత్తున్.

అనిన శుక్రుండాగ్రహించి రాజేంద్రా! నీకు మేలుగోరిచెప్పిన మాటలు వినవైతివి. కావున గురువాక్యోల్లంఘనఫల మనుభవింపుము. శీఘ్రకాలమునఁ బదభ్రష్టుఁడవు కాఁగలవు అని శాపం బిచ్చెను. ఇట్లు శాపమును బడసియు రాజు తనమాటను మరలింపఁ బూనఁడయ్యెను. ఔరా! సత్యవాక్పరతి. కాఁబట్టియే

ఆ. బ్రదుకవచ్చుఁ గాక బహుబంధనములైన,
వచ్చుఁ గాక లేమి వచ్చుఁ గాక
జీవధనము లైనఁ జెడుఁ గాక పడుఁ గాక,
మాట తిరుగలేరు మానధనులు.

అని పెద్దలు పల్కిరి. అంతలో నామహామహునిభార్య వింధ్యావళి వటునిపాదములు కడుగ సువర్ణకలశమునఁ బావనజలముం గొని వచ్చెను. దానికిం బరమానందభరితుఁడై దానవచక్రవర్తి భక్తిభరమున

క. రమ్మా మాణవకోత్తమ, తెమ్మా నీవాంఛితంబు లేదన కిత్తుం
దెమ్మా యడుగుల నిటురా, కిమ్మా కడుగంగవలయుం నేటికిఁ దడయన్.

అని ప్రార్థించి వటువు పాదంబులఁ గడిగి తత్పావనజలంబు శిరంబునఁ జల్లుకొని యాచమనంబుచేసి దేశకాలాదిపరిగణనంబు సలిపి యించుకంతయును ఖేదమునొందక మహానందంబున

శా. 'విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
దప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామి' యంచుం క్రియా
క్షిప్రుండై దనుజేశ్వరుండు వడుగుం జే సాఁచి పూజించి బ్ర
హ్మప్రీతమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందఁగన్.

ఆతరుణమ్మున

ఆ. నీటిధారఁబడఁగ నీక యడ్డంబుగాఁ, గలశరంధ్రమాపఁగాను దెలిసి [డు
హరియుఁ గావ్యనేత్ర మటఁ గుశాగ్రంబున, నడువ నేకనేత్రుఁ డయ్యె నతఁ

ఆవల బలియిచ్చిన పదత్రయమాత్రభూదానంబుఁ బరిగ్రహించి పరమానందంబు నొంది యావామనమూర్తి చక్రవర్తిం జూచి రాజేంద్రా!

క. క్షితిదానమిచ్చు నతఁడును, నతికాంక్షఁ బరిగ్రహించు నతఁడును దురిత
చ్యుతులై శతవత్సరములు, శతమఖలోకమునఁ గ్రీడ సల్పుదు రెలమిన్.

అని పలికి భూదానముం బుచ్చుకొంటి నని సంతోషింపకుమా యని హెచ్చరించెను. అంతట నమ్మాయావటుండు

శా. ఇంతింతై వటుఁ డింతయై మఱియుఁ దా నింతై నభోవీథిపై
నంతై తోయదమండలాగ్రమున నల్లంతై ప్రభారాశిపై
నంతై చంద్రుని కంతయై ధ్రువునిపై నంతై మహర్వాటిపై
నంతై సత్యపదోన్నతుం డగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.

అట్టి లోకంబు లావరించి యొకపాదంబున భూమిని, వేఱొక యడుగున నితరభాగంబు నావరించి మూఁడవయడుగున కేమి చూపెదవో చెప్పుమా యని బలి నడిగెను. ఆమాటలకు జంకక విసుగుకొందక భక్తిభారంబున

ఆ. సూనృతంబుగాని నుడియదు నాజిహ్వ, బొంకఁజాల నాకు బొంకులేదు
నీతృతీయపదము నిజము నాశిరమున, నెలవుచేసిపెట్టు నిర్మలాత్మ.

అని పలికిన మెచ్చి శ్రీహరి యాతని ననుగ్రహించి పాతాళంబున నుండ నాజ్ఞాపించెను. బలియింటఁ దాఁ గావలిగాచుచుండ నంగీకరించెను. దేవత లంత వామనమూర్తిం గొని యమరావతి కరిగిరి. ఇంద్రుఁడు యథాపూర్వముగఁ బాలించుచుఁ ద్రిభువనాధిపతియన విఖ్యాతిం బడసి యుండెను.

ఇది అష్టమస్కంధము.

# నవమస్కంధము.

## అంబరీషోపాఖ్యానము

పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగిం గాంచి మహాత్మా! వామనమూర్తిమహిమమును వింటిని; కాని యింతతో సంతృప్తి నొందుద మను నూహ కలుగకున్న యది. ఇంకను భగవన్మహిమమును వినఁగోరెద నని పలుక యోగిచంద్రుఁ డిట్లని యెను. రాజేంద్రా! నీవంటి పరమభాగవతోత్తమునకు విష్ణుకథాశ్రవణమునఁ దృప్తియుండునా. ఎంత విన్నను అంత యుత్సాహ మింకను వినవలె నని కలుగుచుండును. కావున నా తెలిసినంత వఱకు భగవన్మహిమముఁ దెల్పెదను. భగవద్భక్తుని చరిత్రమును వినుము.

నాభాగునితనయు నంబరీషుఁ డనుట విఖ్యాతమే కదా. ఆతనియందప్రతిహతమగు బ్రాహ్మణశాపము వ్యర్థమయ్యెను. ఇదియే చిత్రము. ఆవిషయమును దెల్పెద. సావధానుఁడవు కమ్ము. నాభాగునకు నంబరీషుఁడు కుమారుఁ డయ్యెను. ఆతఁడు సుగుణగరిష్ఠుఁడు. కాఁబట్టి

సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదములయందు, పలుకులు హరిగుణపఠనమందు
కరములు విష్ణుమందిరమార్జనములందు, శ్రవములు హరికథాశ్రవణమందు
చూపులు గోవిందరూపవీక్షణమందు, శిరము కేశవనమస్కృతులయందు
పదము లీశ్వరగేహపరిసర్పణములందు. కామంబు చక్రికైంకర్యమందు

తే. సంగ మచ్యుతజనకేనుసంగమంద, ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద
రసన తులసీదళములంద రతులు పుణ్యసంగతులయందయారాజచంద్రమునకు.

ఇట్టి యభ్యాసములవలన రాజర్షి యనువేరాయంబరీషునకుం గల్గెను. అమ్మహారాజు సదా హరిధ్యానము చేయుచుండుటం బట్టి

ఆ. అతని కీహ మానె హరులందుఁ గరులందు, ధనములందు, గేహములందుఁ
బుత్రులందు బంధుమిత్రులయందును, బరమునందు సంతిపురమునందు.

అట్టు లౌట శ్రీమన్నారాయణమూర్తి కరుణించి యంబరీషునకుఁ దన చక్రము నిచ్చెను. అదియే ప్రతిభటభీకణంబును నిజ జనరక్షణంబును జేయుచుండెను. కాన నారాజర్షి రాజ్యము వ్రాజ్యభంగి నలరారుచుండె.

ఆయంబరీషుఁడు హరిభక్తితత్పరత్వమున ద్వాదశీవ్రతము చేయఁబూనెను. ఒక్కసంవత్సర మావ్రతము చేయ సంకల్పించెను. భార్యయు సంతోషమున భర్తతో నావ్రతము చేయ సమ్మతించెను. వ్రతాంతమునఁ గార్తికమాసంబున మూఁడు రాత్రు లుపవసించి కాళిందీసలిలంబుల స్నానమొనరించి మధువనంబున మహాభిషేకవిధానంబున నిమిత్తపరికరసంపన్నుండై హరి నభిషిక్తుం జేసి మనోహరగంధంబు లర్పించి విమలపావనతమ కుసుమంబు లర్పించి మహాభక్తిచే ఆఱు నర్బుదముల గోవుల సద్బ్రాహ్మణులకు దానమిచ్చి మృష్టాన్నము వారికిం బెట్టి తాను పారణము చేయఁబూనెను. ఆసమయమున దుర్వాసుఁ డరుదెంచెను. తద్దర్శనమునఁ గృతార్థుఁడనైతినని తలంచి యాతిథేయ సత్కారము లొనరించి కుశలప్రశ్నంబుఁ గావించి, 'మహాత్మా! యీ దాసునింట భుజింపుమా' యని ప్రార్థింప నమ్ముని యంగీకరించెను.

దుర్వాసుఁ డప్పుడ కాళిందికిం బోయి స్నాన మొనరించి జపము చేసికొనుచు రాక తడవుచేసెను. అర్ధముహూర్తమే ద్వాదశి యవశిష్టముగ నుండెను. ఆలోపలఁ బారణ చేయవలయు ననునియమ ముండుటంబట్టియు ముని రాకముందే భుజించుట పాడిగాదనియుఁ దలంచి విద్వజ్జనంబులఁ బిలుపించి ప్రాంజలియై మహర్షి చేష్టితం బెఱింగింప వారూహించి శాస్త్రంబులం బరికించి 'రాజేంద్రా!

ఆ. అతిథిపోయి రామి నధిప యీద్వాదశి, పారణంబు మానఁ బాడిగాదు
కుడువకుంట గాదు కుడుచుటయును గాదు, సలిలభక్షణంబు సమ్మతంబు.

అని ధర్మసందేహంబు వాపిరి. రాజర్షియు వారియానతిం గొని జలపారణంబు చేసి మునిరాక కెదురుచూచుచుండఁగా దుర్వాసుఁ డరుదెంచి రాజచేష్టితమును బుద్ధి నెఱింగి కూడఁ బుట్టిన క్రోధము రెండింతలు కాఁగా క్షుద్వ్యాధ పీడించుచుండఁగా 'రాజా! గర్వమున విఱ్ఱవీఁగి ననుఁ దిరస్కరించితివి, ధర్మభంగ మొనరించితివి, దుష్కర్ముఁడవు, నాకోపము రుచి యించుక చూతువుగాక' అని యాగ్రహమున జట మొదలంటఁగా బెఱికి దానియం దొకకృత్య యుత్పత్తి కాఁగా శూలహస్తయగు నాశక్తిని రాజుపైకిం బంపెను. ఆశక్తియు నాటోపంబున రాజు శిక్షింపఁ గవిసెను.

ఆ. ఆప్రకార మెఱిఁగి హరి విశ్వరూపుండు, భక్తితపసిచేయం బేదబుకుఁ [దిం
జక్కఁబెట్టు మనుచుఁ జక్రంబుఁ బంచిన, వచ్చె నదియుఁ బ్రళయవహ్నివలె

ఆచక్ర మవార్యవిక్రమంబున మృత్యువుంబోని మునికృత్యను క్షణమాత్రమున దహించి మునివెంటం బడఁగా నాతఁడు భీతిల్లి యెందెందో తిరిగితిరిగి యెవ్వ రెవ్వరినో యాశ్రయించి తుదకు సంరక్షించువా రెవ్వరును లేరని తెలిసికొని త్రిమూర్తులలో

నిజపురం గాంచి వారివలని లాభముం గానక శ్రీహరిం జేరి ప్రార్థింపఁగా నామహాపురుషుఁడు 'మునీంద్రా!

ఆ. నాకు మేలుగోర నాభక్తులకగాని; భక్తజనుల కేన పరమగతియు [భంగి.
భక్తుఁ డెందుఁ జనినఁ బఱతెంతు వెనువెంటఁ, గోవు వెంటఁ దగులు కోడె

కాఁబట్టి, యిప్పుడు

కం. అదె పో బ్రాహ్మణ నీకును, సదయుండు నాభాగసుతుఁడు జనవినుతగుణా
స్పదుఁ డిచ్చు నభయ మాతని, మది సంతసపఱచి వేఁడుమా శరణంబున్.

అని ప్రోత్సహించెను. మునియు నాయంబరీషుని పాలికిం బోయి పాదంబులపైఁ బడి లేవకుండఁగా మునిపతి తనపాదముల స్పృశించెఁ గదా యని భీతిం జెంది కరంబులు ముకుళించి భక్తి పరవశుండై నిలువంబడి

ఆ. కమలలోచనుండు ఖలుల శిక్షింపంగ, బాలుచేయ నీవు పాలుపడితి
వైన నింకఁ జాలు నాపన్నుఁడై యున్న, తపసిఁ గావు మీవు ధర్మవృత్తి.

అని ప్రార్థించెను. అంతలో నూరకుండక భగవంతుం దలంచి

ఆ. విహితధర్మమందు విహరింతు నేనేని, ఇష్టమైన ద్రవ్య మిత్తునేని
ధరణిసురుఁడు మాకు దైవతం బగునేని, విప్రునకు శుభంబు వెలయుఁగాక.

అనఁగానే చక్రము మునిని బాధింపక భగవంతునికడ కరిగెను. దుర్వాసుఁడు గర్వముడిగి మెల్లనిమాటల నారాజర్షి దీవించి

మ. నరనాథోత్తమ మేలుచేసితి కదా నాతప్పు మన్నించి శ్రీ
హరిపాదాబ్జము లింతముట్టఁగొలుతే యాశ్చర్యమా నెన్ను చో
నరుదండ్రే నినుబోఁటి సాధునకుఁ దానై యిచ్చుటల్ కాచుటల్
సౌరిదిక్కై జగుణంబులై సరసవచ్చుం గాదె భద్రాకృతిన్.

అన విని రాజర్షి మహర్షిం బ్రార్థించి యిష్టమృష్టాన్నంబుం బెట్టినం గుడిచి పరమానందంబున

శా. కంటిన్ నేఁటికి నిన్ను నీవచనముల్ కర్ణ ద్వయింబ్రీతిగా
వింటి న్నన్నముఁ గొంటి నీగృహమునన్ వేడ్కన్ ఫలం బబ్బె నే
మంటిం బోయెద నీచరిత్రమ మరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
వింటన్ మేదిని సన్నుతింపఁగల రీమీఁదన్ నరేంద్రాగ్రణీ.

అని తన దారింబోయెను. రాజర్షియు యథావిధి వ్రతము సంపూర్తినొందించి భగవద్భక్తాగ్రేసరుం డన నెగడి సుఖంబుండెను.

అని పలికి మఱియు యోగీంద్రుఁ డిట్టు లనియెను. రాజచంద్రమా భగవద్భక్తులమహాత్మ్యమును వింటివికదా. భగవంతుని మహిమ మపారము. ఒకప్పుడు భక్తులద్వారా ధర్మము నిలుచునట్లు చేయుచు నొకప్పుడు తానే యవతరించి దుష్టులం జెండి శిష్టులంగాంచి ధర్మసంరక్షణ మొనరించుచుండు నాభగవంతుని తత్త్వ మెఱుంగ శక్యముకాదు. దీని కుదాహరణముగా శ్రీరామావతారమును దెల్పెద వినుము.

## శ్రీరామచరిత్రము

ఇక్ష్వాకువంశము భువనవిఖ్యాతము. అందు విఖ్యాత భూపాలురు పెక్కండ్రుగలరు. వారిలో దశరథుఁ డొక్కరుఁడు. ఆయనకు ముగ్గురుభార్యలు. కౌసల్యాసుమిత్రాకైకలని వారి పేరులు. ఆభార్యలం దొక్కర్తుకకైనను సంతానము లేకుండెను. అకొఱత చిరకాల మాభూపాలుని బాధించుచుండెను. ముసలిముప్పున మహర్షులయాజ్ఞ నారాజు పుత్రకామేష్టి

చేసెను. ఆమఖమున నగ్ని దేవుఁడు పరమపవిత్రపాత్రమునఁ బర
మాన్నముఁ గొనివచ్చి రాజున కిచ్చెను. ముందే దేవతలు
ప్రార్థింప శ్రీహరి మనుజరూపమున నవతరించి రావణు జంప
నిశ్చయించియే యుండెను. కాబట్టి యాపాయసమునఁ దా
నిమిడియుండెను, అగ్నిదేవుఁడు పాయసము నియ్యఁగనే దశ
రథుఁ డాపాయసమును కౌసల్యకు సగము కైకకు సగము
నిచ్చెను. వారిరువురు దశరథుభావ మెఱింగి తమతమభాగ
ముల నర్ధమాత్రము ప్రీతిచే సుమిత్ర కొసంగిరి. ఆపాయసభక్షణ
మున వారు పూలాండ్రుగఁ గనఁబడిరి.

తొమ్మిదినెలలు నిండఁగనే కౌసల్యాదులు మువ్వురు
పుత్రులం గాంచిరి. కౌసల్య కొడుకుపేరు శ్రీరాముఁడు. కైక
కొడుకు నామము భరతుఁడు. సుమిత్ర కొడుకు లిరువుర నామ
ములు లక్ష్మణశత్రుఘ్నులు. అందు రామలక్ష్మణు లుద్దులైయుం
డిరి. భరతశత్రుఘ్ను లుద్దులైయుండిరి. దశరథుఁ డాకొడుకుల
నల్వురం గాంచి పరమానందాంబుధి నోలలాడుచుండెను. కొంత
కాల మాయానందమునకు మేర లేకుండెను. వారికి వేదాది
విద్యల నేర్పించెను. ఉపదేశమాత్రముననే వారు సకల
విద్యల గ్రహించిరి. ఈడుజోడుబాలురఁగూడి యాడుకొను
చుండిరి.

ఒకానొకదినమున దశరథుఁడు కొలువునేయుచుండఁగా
విశ్వామిత్రుఁ డరుదెంచి యథావిధిఁ బూజితుఁడై కూరుచుండి
కుశలప్రశ్నానంతరము 'దశరథా! నేనొకయజ్ఞముచేయుచుండ
నొకవిఘ్నము గల్గినది. నీసహాయమును గోరి వచ్చితి. తద్విఘ్న
నివారణార్థము భవత్సూనుని రామునిం బంపుమా' యని

వేఁడెను. వసిష్ఠముని యనుమతి రాజందుల కంగీకరించెను. రామ
లక్ష్మణులం దోడుకొని మునిజనపదములం జూపుచుఁ దాటక
యుండు వనముఁజొచ్చి యందున్న తాటక పైకిరాఁగా రాము
నిచేఁ జంపించి తనయాశ్రమమునకుం బిలుచుకొనిపోయి యజ్ఞ
మారంభించెను. మారీచ సుబాహుప్ర లరుదెంచి రక్తవర్ష
మును గురియింప రామలక్ష్మణు లాదానవులపై శరవర్షమును
గురిపించుచుండ రాముఁడు విక్రమించి సుబాహుప్రను బొరి
యించి మారీచుని వాయవ్యాస్త్రమునఁ జిమ్మఁగా నతఁడు
సంద్రమునఁ బడి యెట్లో బ్రదికెను.

విశ్వామిత్రుఁ డంత రామలక్ష్మణులం దోడుకొని మిథి
లానగరమునకుం బోవ రాముఁడు హరచాప భంగ మొనరించి
సీతం బెండ్లియాడెను. ఊర్మిళ లక్ష్మణునకుఁ గళత్ర మయ్యెను.
భరతునకు మాండవి పత్ని. శత్రుఘ్నునకుఁ శ్రుతకీర్తి దార
యయ్యెను. వారువివాహానంతర మయోధ్యకరుగుచుఁ ద్రోవలోఁ
బరశురాముని భంగపఱచి వైష్ణవశరాసనంబు రాముఁడు గ్రహి
యింప సుఖముగఁ బురప్రవేశ మొనరించిరి.

భరతుఁడు సోదరుంగూడి మేనమామయింటి కరిగెను.
దశరథుఁడు రామచంద్రుని యువరాజుఁజేయ నిశ్చయించు
కొనఁగా భరతునిమాత కైక మంథర యనుపరిచారికచేఁ బురి
కొల్పఁబడి మున్నిచ్చిన రెండువరముల నిప్పు డిమ్మని దశరథు
నడుగుచు నొకవరమునకు రాముని వనములకుఁ బంపుటయు,
రెండవవరమునకు భరతుని యువరాజుఁ జేయుటయుఁ దన
కిష్టము లని కోరెను. సత్యపాశబద్ధుఁడు కాన నేమియు ననలేక
కొడుకు నడవులకుం బంపఁజాలక పరితపించుచుండు రాముఁ

డెలింగి సీతను లక్ష్మణుం దోడుకొని వనములకుం బోయెను. దశ రథుఁడు రామవియోగమున కోర్వఁజాలక మరణించెను.

భరతుఁ డయోధ్యకు వచ్చి తండ్రికిఁ బరలోకక్రియలు చేసి చిత్రకూటమున కేఁగి యన్నను బ్రార్థించి యతఁడు రాసమ్మ తింపకపోఁగా శ్రీరామచంద్రుని పాదుకలఁ బ్రార్థించి వానిపై రాజ్యభారము నిడి నందిగ్రామమునుండి రాజ్యమును బాలించు చుండెను. రాముఁ డంతఁ జిత్రకూటమును వదలి దండకారణ్య మును బ్రవేశించి విరాధాదిదుష్టదానవులఁ జంపుచుఁ బోయి పంచవటీతీరమున నొకపర్ణశాల నిర్మించి యందుండి రావణు చెల్లెలు శూర్పణఖ వచ్చి తన్నుఁ గామింప సోదరునిచే దాని ముక్కుచెవులు కోయించి యామెకు సాయముగాఁ దన్ను దండింపవచ్చిన ఖరదూషణాది దుష్టదానవులఁ జంపెను.

రావణుఁ డావార్త శూర్పణఖనుండి విని భీతుఁడై మారీ చుని మాయాహరిణముఁ గమ్మని పంచి తానందొకచోనుండెను. సీతమ్మ ఆ హరిణమును దెచ్చి యిమ్మని యడుగ రాముఁడు దానివెంట నంటి దూరముగాఁ బోయి యది మాయ యని తోఁప బాణప్రయోగముచేయ నది ప్రాణముల వదలుచు రాముని కంఠస్వరము ననుకరించు నాదమున నక్కటా! లక్ష్మణా! యని యార్చి చచ్చెను. ఆనాదము విని సీత దూఱఁగా లక్ష్మణుఁ డచటికిం బోవ రావణుఁడు సన్న్యాసి వేషమున వచ్చి సీత నెత్తుకొనిపోవుచు నామె విడిపింప వచ్చిన జటాయువుం జంపి లంకకుం బోయెను. రాముఁ డనుజుంగూడి వచ్చి సీతం గానక పంపాసరః ప్రాంతమునకుం బోయి సుగ్రీవు

నితోఁ జెలిమి చేసి యతనియన్నయగు వాలి నొక్కకోలం గూలనేసి కపిరాజ్యమునకు సుగ్రీవునిం బట్టభద్రునిఁ జేసెను.

ఆకపిపతి వనచరుల నాల్గుదెసల సీతను వెదుకం బంపెను. హనుమదంగదాదులు దక్షిణదిక్కునకుం బోయిరి. హనుమ సాగరమును లంఘించి లంకం గలయం దిరిగి యశోక వృక్షముక్రింద నున్న జానకిం గాంచి మాటలాడి ముద్రిక యొసంగి యామె రామునకుం జూప నొసంగిన యానవాలును గైకొని తనరాకఁ దెలుప వనభంగము గావించి యక్షకుమారాదులం బొలియించి యింద్రజిత్ప్రయుక్తబ్రహ్మాస్త్రనిబద్ధుండై రావణుని దర్శించి నీతి నుపదేశించి తనతోఁకం గాల్పఁగా నాగ్రహించి లంకం గాల్చి రామునిఁ గానఁబోయి సీతాకుశల వార్తం దెల్పెను.

రామాదులు బలసమేతులై లవణసాగరముకడకుం బోయిత్రోవయిమ్మని ప్రార్థించిరి గాని యాసముద్రుఁడు బదులు పల్కకుండెను. రాముఁ డాగ్రహించి బాణప్రయోగము చేయఁబూన నాసాగరుఁడు ప్రత్యక్షమై తనపై సేతువుఁ గట్ట ననుమతింపఁ బర్వతాదులు వైచి సేతువుఁ గపులు కట్టఁగా నందఱు సాగరము నుత్తరించి లంకానగరప్రాంతమున విడిసిరి. వానరు లానగరము నావరించి ప్రాకారాదులం గూల్చి నానా విధంబులం బాధచేసిరి. దానికిం గోపించి రావణుఁడు పంపిన ధూమ్రాక్షాదిదానవులఁ బొలియించిరి.

పిదప నతికాయుండు యుద్ధమునకు రాఁగా లక్ష్మణుండు సంహరించెను. కుంభకర్ణుఁడు మహాహవ మొనరించి రాముని చేతఁ జచ్చెను. ఇంద్రజిత్తు లక్ష్మణుని మార్కొని తా సురలోక

మున కరిగెను. తనవార లనిఁబడ రావణుఁ డాగ్రహించి సంగర రంగమునకు రాఁగా నింద్రుఁడు రామునకుఁ దన రథమును మాతలితోఁ బంపెను. దాని నెక్కి రాముఁ డాహవోన్ముఖుం డయ్యెను. రామరావణులు తలపడిరి. ఆసంగ్రామము మహా ఘోరరీతిని గనుపట్టెను. అపుడు శ్రీరామమూర్తి మహాగ్రహ మున రాక్షసాధమున

మ. చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ బుత్తెంచుటో
కపటబ్రాహ్మణమూర్తివై యబల నాకాంతారమధ్యంబునం
దపహరించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్నిసం
తపనం బేగతి నోర్చువాఁడవు దురంతం బెంతయున్ రావణా.

అని పలుకుచు నంతకంత కుప్పొంగురోషంబున

మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండభీమంబు గాఁ
బ్రళయోగ్రానలసన్నిభం బగు మహాబాణంబు సంధించి రా
జలలాముం డగు రాముఁ డేసె ఖరభాషాశ్రావణున్ దేవతా
బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్ రావణున్.

ఆబాణంబున రావణుండు దెగియె. రాక్షసాంగనలు దిక్కేడి విల పించిరి. విభీషణుఁడు రామునిప్రోత్సాహమున పగ యుడిగి యన్నకునౌర్ధ్వదైహికక్రియ లొనరించి పట్టాభిషిక్తుఁడై సీతం దోడ్కొనివచ్చి రామున కప్పగించెను. రాముఁ డాభూజాతం గాంచి తద్విమలమతి నెఱుంగువాఁడు కాన నామెవలన దోషంబు లే దని భావించియు నగ్నిశుద్ధం గావించి పరిగ్రహిం చెను. అంతట విభీషణాదులతోడరాఁ బుష్పకము నెక్కి మున్ను చూచిన స్థలములు మాఱియుండుట సీతకుఁ జూపుచు నయో

ధ్యఁ జేరెను. భరతుఁడు ముందే యెదుర్కొని రాజ్యభారం బప్పగించెను. అందఱును రాముం గూడి యయోధ్యానగరంబుఁ బ్రవేశించిరి. రాముఁడు జనసుల కభివాదనంబు చేసి పెద్దలకు వందనము లొనరించి వారియాశీస్సులం బడసి దశరథవిహీన మగు నంతఃపురమును చింతాభరంబునఁ బ్రవేశించెను.

వసిష్ఠాదులు సుముహూర్తమున శ్రీరామచంద్రుని సింహాసనాసీనుం గావించి చతుస్సముద్ర పావన నదీజలంబుల నభిషేకించిరి. భరతుఁడు రాజ్యవిశేషముల విన్నవించెను. పౌరులెల్లఁ బరమానందభరితులై రాముం గొల్చిరి. ఆకాలమందు

సీ. పొలఁతులవాలుచూపులయంద చాంచల్య, మబలలనడుములయంద లేమి
కాంతాలకములంద కౌటిల్యసంచార, మతివలనడపులయంద జడిమ
ముగుదలపరిరంభములయంద పీడన, మంగనాకుచములయంద పోరు
పడఁతులరతులంద బంధసద్భావంబు, సతులఁ బాయుటలంద సంజ్వరంబు
తే. ప్రియులు ప్రియురాండ్రమనముల బెరసి తార్పు
లంద చౌర్యంబు వల్లభులాత్మసతుల
గాంగి క్రొమ్ముళ్ళ వట్టులం దక్రమంబు
రామచంద్రుఁడు పాలించు రాజ్యమందు.

ఇది నవమస్కంధము.



# దశమస్కంధము

## పూర్వభాగము

### — శ్రీకృష్ణచరిత్రము —

అని యిట్లు శుకయోగి తెలుపఁగా ప్రార్థించి పరీక్షి
న్నరేంద్రుఁడు మహాత్మా!

క. శీలము గల యదుకులమున, జేలా పుట్టెను మహాత్ముఁ డీశుఁడు విష్ణుం
డేలీల మెలఁగె నేమే, వేళల నేమేమిచేసె వివరింపు తగన్.

అని ప్రశ్నించుచు యోగివర్యా! మునుపు బలరాముఁడు
రోహిణీదేవిపుత్త్రుఁ డని చెప్పితిరి. ఆమహాత్ముఁడు దేవకీదేవి
కడుపున నెట్లు ఉండెను? తనతండ్రియిల్లు వదలి గోవిం
దుఁడు మంద కేలపోయెను? ఎందుండి యేయేకార్యముల
నొనరించెను. నాకీవిషయములఁ జక్కఁగా వినిపించి కృతార్థు
నిగా నొనరింపుమా యని ప్రార్థించెను. శుకయోగియు
సంతోషబాష్పాకులితేక్షణుఁడై రాజా! ధన్యుఁడవు. ధన్యుఁ
డవు. ధన్యుఁడవు. భగవత్కథాశ్రవణమున నిన్ను మించిన
యసంతృప్తుల నేఁ జూడలేదు. నీజన్మమే పవిత్రతమము. ఇఁక
శ్రీకృష్ణచరిత్రమును వినుము. ముక్తి కరతలామలక మగును.

మహారాజా! కొంతకాలముక్రిందట రాజలాంఛన
ములఁ దాలిచి దైత్యులు భూమి నాక్రమించిరి. ధర్మమును
దాఱుమాఱు చేసిరి. వారిభారమును మోయఁజాలక భూమి

దుఃఖాక్రాంతయై బ్రహ్మకడకుం బోయి విలపించెను. బ్రహ్మయు భూమిం దోడుకొని శ్రీహరిచెంతకుం బోయి భూమివగలం దెలిపెను. హరి తా నవతరింపఁబూని దేవతలం గాంచి మీరును భూమి నవతరించి నాకు సాయముగా నుండుఁ డని యాజ్ఞాపింప వారట్లు చేయఁజనిరి. భూదేవియుఁ దనకష్టము వాయు నన్న యాదరంబున బనివినియెను.

పరీక్షిన్మహారాజా! మథురాపురము యాదవులకు నివాసము. అందు శూరసేనుఁడు విఖ్యాతిగాంచి యుండెను. అతని కొడుకు వసుదేవుఁడు. ఆతఁడు దేవకీదేవిం బెండ్లియాడెను. ఆదేవకి కంసునకుఁ దోడఁబుట్టువని యెఱుంగుము. వసుదేవుఁడు దేవకిం దోడుకొని రథమెక్కి పయనము సాగించెను. అత్తఱిఁ గంసుఁ డుల్లాసియై చెల్లెలు మఱఁదియు రథముపైఁ గూరుచుండఁగా గుఱ్ఱములపగ్గములు చేనంది రథము తోలుచుండెను. శుభవాద్యములు మ్రోయుచుండెను. నగరమును దాఁటి చనుచుండునపుడు కంసుని మనము భీతిల్లునట్లుగా

క. తుష్టయగు భగిని మెచ్చఁగ
నిష్టుఁడవై రథము గడపె దెఱుఁగవు మీఁదన్
శిష్టయగు నీతలోదరి
యష్టమగర్భంబు నిన్ను హరియించుఁ జుమీ.

అని యాకాశవాక్కు స్పష్టముగా ముమ్మాఱులు వినఁబడియెను. ఆమాటల కులికిపడి పగ్గముల విడిచి వెట్టి భయంకర కృపాణమును బాణిం దాల్చి దేవకీదేవిం జంపఁ బ్రయత్నించెను. వసుదేవుఁ డాతని వేగిరపాటుం జూచి తడవు సేసినఁ గార్యము చెడు నని యెంచి దుష్టాత్ము నీతని సాంత్వనములఁ జక్కఁబెట్టు

టయే యిపుడు చేయఁ దగు పని యని సంభావించి మెల్లగా ననునయించుచు భోజరాజా!

ఉ. అన్నవు నీవు చెల్లెలికి నక్కట మాడలు చీర లిచ్చుటో
మన్నన చేయుటో మధుర మంజులభాషల నాదరించుటో
మిన్నుల మ్రోతలే నిజము మే లని చంపకుమన్న మాని రా
వన్న సహింపుమన్న తగదన్న నినుఁ శరణంబు వేఁడెదన్.

మఱొక్కమాట

చ. చెలియల్ కన్నియ ముద్దరా లబల నీ సేమంబ చింతించు ని
ర్మల దీనిఁ బయలాడు మాటలకు నై మర్యాదఁ బోఁదట్టి స
త్కులజాతుండవు పుణ్యమూర్తి వకటా! కోపంబు పాపంబు నె
చ్చెలి నోహో తెగఁ ద్రెంపఁ బాడి యగునే చింతింపు భోజేశ్వరా.

మహారాజవు. నీ విట్టిపాప మొనరించిన నీపాలనముఁ గుఁ లోఁబడిన మానవు లేమందురో యని యించుక యూహింపుము. దేహ మిది స్థిరము కాదు. నీటిబుగ్గవంటిది సుమా. దీని నమ్మి శాశ్వతకీర్తిని బోఁగొట్టుకొనఁ బ్రయత్నింపకుము. పరహింస మహాపాపము సుమా. దానిని మించిన ఘోర కార్యము వేఱొకటి లేదు.

క. కావునఁ బరులకు హింసలు, కావింపఁగ వలదు తనకుఁ గల్యాణముగా
భావించి పరుల నొంచినఁ, బోవునె తత్ఫలము పిదపఁ బొందక యుండే.

అని పలికె మఱొక్కపక్కి యాత్మకుఁ దగుల నిట్టు లనియె. రాజేంద్రా! ఆకాశవాక్కు నీచెలియలియష్టమగర్భము నిన్ను హరించు నని కదా వినఁబడియె. ఎనిమిదవసంతానమే కాదు. పుట్టినబిడ్డలనెల్ల నిచ్చుచుందును. ఆసంతానముల నీ

యిష్టానుసారముగా వధింపుము. ఇదిరా కదా నీకోరిక. నీచెలి యలు నీమేలు కోరునది. నీనాశనమును గోరుసా అని యెన్ని యో నీతు లుపదేశింపఁ గంసుఁ డెట్టకేల కంగీకరించి దేవకిని జంప మానెను.

అవల దేవకీదేవి ప్రతియేటఁ గన్నకొడుకుల నాఱుగుర కంసున కర్పించెను. వాఁడు నిశితకరవాలమున వారిం జెండెను. ఏడవగర్భము కొలఁదికాలమునకే జారసూపెను. భగవం తునియాజ్ఞ యోగమాయ దానిం గొని చని రోహిణీదేవి గర్భమున నుంచెను. గర్భము పోయె నని యెల్లరు చెప్పుకొనిరి. కంసుఁ డావార్త నాలించెను. రోహిణి యవ్వల మహాపురుషుని బలరాముని గాంచెను. గర్భము సంక్రమింపఁజేయుట సంక ర్షణుఁ డను పేరఁ బరఁగెను. అవ్వల దేవకీదేవి యెనిమిదవగర్భ మును దాల్చెను. దేవకీవసుదేవు లాసమయమున నద్భుతరీతి వెలింగిరి. చూచువా రెల్ల నిది యద్భుతముగ నున్న దే యని యూహించుచుండిరి. ఆతరుణమున వారిని గంసుఁడు కారాగార మున నునిచి కావలివారిని నియమించి కడు జాగరూకుఁడై యుండెను. నెలలు తొమ్మిదియు నిండెను. ఎప్పుడు ప్రసవించునో యని కంసుఁడు వేచియుండెను. ఆత్తరుణముననే గోకులమున నున్న నందునిభార్య యశోద గర్భమును ధరించెను. ఆమెకు నవమాసములు నిండెను.

ఆసమయమున దేవత లదృశ్యాకారముల నరుదెంచి దేవకీగర్భస్థుఁడగు పురుషోత్తముని బహువిధంబుల వేదవాక్కుల వినుతించి త్వరగా నవతరించి కంసాదిదుష్టదానవులఁ జంపి

ధర్మరక్షణ మొనరింపుమా యని ప్రార్థించి తమతమ నెలవుల కరిగిరి. బ్రహ్మాదు లిండ్లకుం బోవుచుః బ్రీతితో దేవకిం గాంచి

మత్తకోకిలము. తల్లినీ యుదరంబులోనఁ బ్రధానపూరుషుఁ డున్నవాఁ
డెల్లి పుట్టెడుఁ గంసుచే భయమింత లేదు నిజంబు మా
కెల్లవారికి భద్ర మయ్యెడు నింక నీ కడుపెప్పుడుం
జల్లఁగావలె యాదవావలి సంతసంబును బొందఁగన్.

అని దీవించి వెళ్లిరి.

## శ్రీకృష్ణావతారము

అంత శుభదివసంబున నడిరేయి రోహిణీనక్షత్రమున దేవకీదేవి ప్రసవించెను. ఆతరుణమునఁ గావలికాచువారెల్లవాడలు తెలియకుండ నిద్ర యావరించెను. కంసు నాజ్ఞను వా రెఱుంగక హాయిగా నిదురించిరి. చీమ చిటుక్కుమన్న వినఁబడు నాకాలమున దేవకీదేవి ప్రసవవేదన ననుభవించుచుండ నొక్కప్రాణియైన నెఱుఁగకుండెను. భగవంతుఁడు భక్తరక్షణాదృతి నవతరించెను. ఆగర్భమున వాయువు నిండియుండెను గాని తొమ్మిదినెలలు భగవంతుఁ డందు లేఁడు. ఆగుహాత్మునకు జన్మదుఃఖము కలుగునా? ప్రసవకాలమున దేవకికి స్మృతి లేకుండెను. వాయువు వెడలిపోయెను. భగవంతుఁడు చిన్నిశిశురూపమున భూమినుండెను. అప్పుడు ప్రపంచమున మహోల్లాసకరములగు గుఱుతులు కనంబడియెను. సముద్రము లుప్పొంగెను. మలయవాయువులు వీచెను. దేవతలు పూలవానఁ గురియించిరి. గంధర్వు లాడిరి. అచ్చరమిన్నలు నృత్యమొనరించిరి. అప్పుడు

సీ. జలధరదేహు నాజానుచతుర్బాహు, సరసీరుహాక్షు విశాలవక్షుఁ
జారుగదాశంఖచక్రపద్మవిలాసుఁ, గంఠకౌస్తుభమణికాంతిభాసుఁ
గమనీయకటిసూత్రకంకణకేయూరు, శ్రీవత్సలాంఛనాంచితవిహారు
నురుకుండలప్రభాయుతకుంతలలలాటు, వైదూర్యమణిగణవరకిరీటు
తే. బాలుఁ బూర్ణేందురుచిజాలు భక్తలోక
పాలు సుగుణాలవాలుఁ గృపావిశాలుఁ
జూచి తిలకించి పులకించి చోద్యమంది
యుబ్బి చెలరేఁగి వసుదేవుఁ డుత్సహించె.

పాప మావసుదేవుఁ డాతటి స్నానముచేయ వీలు పడమి సానందరసాబ్ధినిమగ్నుఁడై విప్రులకుఁ బదివేల ధేనువుల మానసమున దారవోసెను. ఈకారాగారనివాసవిముక్తియయిన పిదప నిచ్చెద నని సంకల్పించెను. అంతలో నవ్వసుదేవు నకు దివ్యజ్ఞానము పొడసూపఁగా బాలగోపాలుని బహు విధముల వినుతించెను. దేవకియు భర్త వినుతించినట్లే విను తించెను. ఆస్తోత్రములకు భగవంతుఁడు సంతోషించి వారి పూర్వజన్మవృత్తాంతమును దెలిపి తనకృత్యము నెఱింగించి వా రపుడు చేయఁదగు కృత్యమును జక్కఁగాఁ దేటపఱచి నిజ రూపంబు వదలి యథాపూర్వముగ బాలుని రూపమును గ్రహించి యుండెను.

వసుదేవుఁ డాభగవంతునాజ్ఞను దల ధరియించి పాపని పుడిసిటిలో నిడుకొని కాలిసంకెళులు తమంతట విడిపోవఁ గా రాగారద్వారంబు చెంతకుం జని యం దొడలెఱుంగక నిదు రించు ద్వారపాలకులం గాంచి వెఱఁగంది ద్వారములు తమం తన ద్రోవనీయ నబ్బురపడుచుం బోయెను. యమునానది యిరు

దరులు కనఁబడకుండఁ బ్రవహించుచుండియు నావసుదేవునకు వెంటనే త్రోవ నొసంగెను. ఆరాత్రియందే నందునిభార్య యశోద యాడుపడుచుం గనియె. ఆశిశువును జూచి చూడక మునుపే నిద్రాభరంబున మేనుమఱచిన దయ్యె. ఇంతలో వసుదేవుఁ డా శ్రీకృష్ణుం గొనిచని నందుమందిరంబున యశోద ప్రక్కన నిడి యాకొమరితం గైకొని వడివడి నరుదెంచెను. యశోదకుఁ గొమరిత పుట్టుట కాని యామె నెత్తుకొని కొడుకు నిడి వసుదేవుఁడు పోవుటగాని తెలియక పోయెను. మేల్కాంచి తనకుఁ గల్గినది పుత్త్రుఁడే యని తలఁచెను.

వసుదేవుఁ డాబాలికం గొని కారాగృహమును బ్రవేశింపఁగనే ద్వారములు యథాపూర్వముగా మూయఁబడియెను. బాలిక కావుకావని యేడ్చెను. కావలివారు మేల్కాంచిరి. పదములు తడఁబడఁగాఁబరువెత్తి దేవకీ బిడ్డఁగనెనని కంసునకుం దెల్పిరి. కంసుఁ డులికిపడెను. నిశ్చేష్టుఁ డయ్యెను. కొంతవడికిఁ దెలివి గల్గగాఁ గరవాలమును గైకొనియెను. వెండ్రుకలు వీడఁగాఁ బై చీర వ్రేలియాడఁగా బురిటింటికిం బరుగిడెను. శిశువుఁ గదియఁ జనుచుండెను. అంత దేవకి యడ్డంబు వచ్చి కన్నీరు మున్నీరుగాఁ బ్రవహించుచుండ,

ఉ. అన్న శమింపుమన్న తగ నల్లుఁడు కాఁ డది మేనగోడలౌ
మన్నన చేయుమన్న విను మానిని జంపుట రాచపాడిగా
దన్న సుకీర్తివై మనఁగ దన్ను మహాత్ములుపోవు త్రోవఁబో
వన్న భవత్సహోదరిఁ గదన్న నినున్ శరణంబు వేడెదన్.

అన్నా! ఇంచుక యాలోచింపుము.

క. కట్టాయార్థుసకొడుకులఁ, బట్టి వధించితివి యామునంబడు చిది కొడకన్
నెట్టన చంపఁగ వలెనే, కట్టఁడివి గదన్న యన్న కరుణింపఁగదే.

మఱియొక్కమాట.

క. పుత్త్రుఁడు నీ బ్రదుకునకును, శత్త్రుం డని వింటి గాన సమయింపఁ దగుం
బుత్త్రులకు నోచనైతిని, బుత్త్రీదానంబు చేసి పుణ్యము గనవే.

అని ప్రార్థించుచు నడ్డముగాఁ బోయి శిశువునెత్తికొని పయ్యెద కొంగు కప్పెను. కంసుం డామాట లాలింపక క్రూరత్వమున నామె చేతినుండి యొడిసిపట్టుకొని పడిం బెడిసిపడం బుడమిం పడుగా బడవైచెను. ఆ బాలికయుఁ గంసుఁ డనుకొన్న రీతి నేలం బడక మింటి కెగసి దివ్యమాలికాభూషితాంగియై మింటనుండి కంసునిం గూర్చి యిట్లనియె!

ఉ. తెంపరివై పొరిం బొరిని దేవకి బిడ్డలఁ జిన్నికుఱ్ఱలన్
జంపితి వంతనైన సుఖశాంతి వహింపక నాలమీఁద నో
ప్పింపఁగ నిన్నిరో యిదియుం బీరమె బాసరసన్ జనించి నిన్
జంపెడి వీరుఁ డొక్కఁ డెస నక్కొకనొందెడువాఁడు దుర్మతీ

అని పలికి దేవగణసంస్తూయమాన యగుచు నదృశ్య యయ్యెను. అంతఁ గంసుఁ డాపలుకులకు సిగ్గుపడి భయపడి యింటికిం జని మఱునాఁడు దేవకీవసుదేవుల రావించి సగౌరవముగా నాదరించి వినయ మట్టిపడ

ఉ. పాపుఁడు బాలఘాతకుఁడ బంధువిరక్తుఁడ దుష్టచిత్తుఁడన్
గోపనుఁడన్ జరన్మృతుఁడ క్రూరుఁడ బ్రాహ్మణకాంతధంగి మీ
పాపలఁ జంపితిన్ బసులిపల్కుల నమ్మితి సాధులార! నా
పాపము లుగ్గడింపక కృపాపరులై కనరే క్షమింపరే.

అని ప్రార్థించెను. పాదములపై వ్రాలి లేవకుండెను. వా
రిరువు రాతనిదైన్యమును గాంచి ప్రశమితకోపులైరి. విధివశము
నకు మన మేమిచేయఁగలము లెమ్మా యని భీతిఁ బాపిరి.
అత్తఱి వసుదేవుఁడు కంసుననుమతి దేవకిం దోడ్కొని నిజ
మందిరంబున కరిగి సుఖముండెను.

అట నందుఁడు తనకుం గొడుకు పుట్టె నని విని మహా
నందంబునం బొదలి జాతకర్మకృత్యము నొనరించెను. గోకుల
మునఁ గల వారెల్ల యశోదం జూడవచ్చి యాయర్భకుని
వైఖరిం గన్నులారఁ గాంచి హర్షించిరి. కొందఱు

ఆ. ఏమి నోముఫలమొ యింత ప్రొద్దొక వార్త, వింటి మబలలార! వీను లలర
మన యశోద బిన్నిఁ మగవానిఁ గనె నట, చూచి వత్త మమ్మ సుదతులారా.

అని యొండొరులం బిల్చుకొనుచుఁ బోయి యబ్బురపాటున
నాబాలకుం గాంచి యశోదానందులయదృష్టమును గొని
యాడిరి. అప్పు డాతలోదరు లెల్ల

క. జోజో కమలదళేక్షణ, జోజో మృగరాజమధ్య జోజో కృష్ణా
జోజో పల్లవకరపద. జోజో పూర్ణేందువదన జోజో యనుచున్.

పాడి దీవించిరి.

రోహిణియును మగశిశువును గనుట విని నందుఁ డామెకు
వస్త్రభూషణాదుల నిచ్చి యాదరించెను. పిదప నందుఁడు మధు
రకుం జని కంసున కిచ్చుకప్పము నిచ్చి వసుదేవుం గానంబోవ
నాతం డానందు నాదరించి కుశలప్రశ్న పూర్వకముగా మాట
లాడుచు నతనియదృష్టమును బొగడుచు

క. నీకాంతయొద్ద నీవును, నీకాంతయుం గారవింప నిమఁ దండ్రిగ నా

లోకించుచు నీమందను, నాకొమరున్నాఁడు నంద నందాన్వితుఁడై.

అని పలుక నందుఁ డామాటకుఁ దృప్తుఁడు కాక ఆర్యా!

శా. నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబుఁ దోడ్తోడ ము
న్నీ కంసుండు వధించె మీసుతఁ దుదిన్ హింసింపఁ జేఁ దప్పి తా
నాకాశంబున కేఁగె బాల యది దైవాధీన మాపద్దశన్
శోకం బందునె తజ్జ్ఞుఁ డూఱడుము నాసూనుండు నీసూనుఁడే.

అని బదులు చెప్పెను. వసుదేవుఁడు కాలోచితముగా నీవిఁకఁ ద్వరగా వ్రేపల్లియకుం బొమ్ము. అనేకోత్పాతములు తోఁచెడు. జాగరూకుఁడవై యుండు మని హెచ్చరించిపంపెను. నందుఁ డింటికిం బోవుచు నదృష్టపూర్వంబులైన యుత్పాతంబులం గాంచి వసుదేవునిపలుకు లన్వర్థము లని తలంచుచు నింటికిం బోయెను.

## పూతన వ్రేపల్లెకుం బోవుట

కంసుఁడు తనమంత్రులం గూడి యాబాలిక పలికిన పలుకుల వినిపించి కర్తవ్య మాలోచించెను. వారేవో దంబములు పలికి యాకసము నెగురఁదన్నుదు మనియు, భూమిని జుట్టి చంకలోఁ బెట్టుకొందు మనియుఁ బలికిరి. కొలఁదిదినములకే కంసుఁడు పూతన యను రక్కసిం బిలిచి పల్లెపల్లెలు కనుఁగొనుచుం బోయి విచిత్రసంతానము గనంబడినఁ జంపి రమ్మని పంచెను. అదియు సుందరాంగమున విషపూరితవక్షోరుహయై వ్రేపల్లెకుం బోయి యాయింట నాయింటనున్న బాలకులం జూచుచు యశోదయింటికి వచ్చి బాలునిం గాంచెను. పూతన యిల్లుచొరఁగనే బాలకుఁ డాఁకలిగొన్న కరణి నేడ్చెను.

అంతలో నిదురించెను. అంతలో నవ్వెను. అట్టితఱిఁ బూతన నుయ్యెల కడఁజేరి యశోద వలదమ్మా పిల్లవాఁడు క్రొత్తవారిం జూచిన నేడ్చు ననునంతలోఁ ద్వరపడి బాలు నెత్తుకొని ముద్దాడి నాకన్న తండ్రీ!

క. నా చనుఁబా లొకగ్రుక్కెం, డో చిన్నికుమార త్రావు మొయ్యన పిదపన్
నీచెలువ మెఱుఁగ వచ్చును, నాచెలువము సఫలమగుచు నలినదళాక్షా.

అని ముద్దాడుచుఁ బాలు త్రావ మొదలిడెను. యశోద వల దనుచున్నను బాప మాపూతన యూరకుండ దయ్యెను. పూతన స్పృశింపఁగనే బాలుఁడు

సీ. మేల్కాన్న తెఱఁగున మెల్లన కనువిచ్చి
క్రీఁగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులించుచుఁ జేతు లాదరంబునఁ జాఁచి
యొదిగిలి యాఁకొన్న యోజనూఁది
బిగి చన్నుఁ గవఁ గేలఁ బీడించి కబళించి
గ్రుక్క గ్రుక్కకు గుటు గుటుకు మనుచు
నొకరెండు గ్రుక్కల నువిదప్రాణంబులు
సైతము మేనిలో సత్వమెల్లఁ
తే. ద్రావె నదియును గుండెలు కల్లడిల్లఁ
జిమ్మఁ దిరుగుచు నిలువక శిరము వ్రాల
నితరబాలుర క్రియ వాఁడ వీవు గావు
చన్ను విడువుము విడువుము చాలు ననుచు.

వాపోవుచు క్షణమాత్రమున నేలం గూలెను. దాని యాకారము మహావికృతమై చూచువారల కడ లోదవిం

చెను. అది పడినను దానివక్షముననుండిన బాలు నెత్తుకొని స్వ స్తన్యపానముచేయించి నందుఁ డానందపరవశుఁ డయ్యెను. వ్రేపల్లియలోనివా రంద ఱిది యేమి యబ్బుర మని గుసగుసలు పోసాగిరి.

ఆర్యబాలకులారా ! విషసహిత స్తన్యపానమున శిశువు మృతి నొందకుండుట యెట్లని మీకుం దోఁపవచ్చుఁ గాని దానికి సమాధానముగా భాగవతమునందు

క. విషధరరిపుగమనునకున్, విషగళసఖునకును విమల విషశయనునకున్
విషభవ భవ జనకునకున్, విషకుచచనువిషమూఁ గొనుట విష మే తలపన్.

అని వ్రాయఁబడిన పద్యమే హృద్యమగు సమాధానము. భగవంతునకుఁ జేయ శక్యములు గాని కార్యము లుండవు. ఇన్ని విధములఁ గనఁబడు సృష్టి చేసిన మహాత్మున కీస్వల్పకార్య మొన రించు టొక లెక్కయా. కాఁబట్టి సందియ మొందఁ బనిలేదు. తర్వాతికథ నాలకింపుఁడు.

## శకటాసురునిఁ గృష్ణుఁడు కాలఁ దన్నుట

కొలఁదిదినములు సుఖముగాఁ గడచెను. పూతన మృతి యెట్లో కంసుని చెవి కెక్కెను. దాన మతింత వాని మది బెదరుఁగాం చెను. బాలికపలుకులు సత్యము లని తోఁచెను. కాఁబట్టి విశ్వాసపాత్రుఁడయి తనకార్యముల నిర్వహింపఁ గంకణము గట్టుకొన్న శకటాసురుం జీరఁ బంచి కృత్యమును దెల్పి పంపెను. వాఁడు సకలమాయాకోవిదుఁడు. బాలగోపాలు నెత్తుకొని పోయి పాలియించఁ దగు నని యూహించెను. కాని యది శక్యమా ? పూతనగతి యేమాయె నని తలంకుఁ డయ్యెను.

మృతి చేరువకు రాఁగా నూహాలు పనికిరా వన్న సామెత తప్పదుగద !

గోకులమున శ్రీకృష్ణుఁ డొడిగిలఁబడ నేర్చె నని యశోద పండుగు చేయ నెంచి భర్తకుం దెలుప నందుఁ డానందించి బంధువుల రావించి బ్రాహ్మణులను బిలిపించి వారి యాశీర్వాదములఁ గైకొని మృష్టాన్నదానంబున బంధువుల నానందింపఁ జేసెను. శ్రీహరికిఁ దల్లి వాలిచ్చి పడుకొనఁ జేసెను. సువాసినీపూజచేయు సందడిలో నుండెను. కృష్ణుని చెంత నెవ్వరు లేకుండిరి. అంతలో బాలుఁ డాఁకొన్న చందమున లేచి పాదము పై కెత్తియుండెను. శకటాసురుఁ డరుదెంచి బాలకృష్ణు నెత్తుకొని పోవ నుంకింప నాదానవునిఁ గాలఁ దన్నెను. శ్రీహరి పాద తాడనమున నాశకటము తుత్తుమురై ధరఁ బడియెను. అందున్న ఘోరరసదార్థములు చెదరి నేలం బడియెను. శకటము శకలములై మహాధ్వని గలుగ ధరం బడియెను. అంద ఱాధ్వని విని యులికి పడి యరుదెంచిరి. దిగులుపడిరి. ఇదేమి యాగడ మని చింతించిరి. బాలునకు గొప్ప గండము తప్పె నని సంతసించిరి. ఎట్టులీ బాలుఁ డీశకటమును దన్నె నని పలుభంగుల నూహించిరి. సమాధానము తోఁపమిఁ గొందఱు దైవగతిగాని వేఱొక్కటి కా దని పెద్దలు వివేచిరి. ఏల యీయూహ లని కొంద ఱూరకుండిరి.

ఇంతలో యశోద యరుదెంచి విఱిగిపడియున్న శకటమును గాంచి ఆఁకలిగొని యేడ్చు చిన్నికుమారుని దిలకించి మహాప్రీతితో

ఆ. ఆఁకలితివి గదన్న యాఁకొంటివి గదన్న, మంచి యన్న యేడ్పు మాను మన్న

చన్ను గుడువుమన్న సంతసపడుమన్న, యనుచుఁ జన్నుఁగుడిపె నర్భకునకు.
నందాదు లాకార్యమును జూచి బాలునకు గ్రహము సోఁకె
నని దానిఁ దొలఁగింప బ్రాహ్మణులచే స్వస్త్యయనము చేయిం
చిరి. బాలకృష్ణుఁడు పాలుగ్రోలి తృప్తుఁడై నిదురించెను. గోపి
కలు తాంబూలకులు తీసికొని బాలు నాశీర్వదించి తమతమ
గృహముల కరిగిరి.

## తృణావర్తుఁడు శ్రీకృష్ణు నెత్తుకొని పోవుట

ఒకనాఁడు యశోదాదేవి తన కొమరుని దొడలపై
నిడుకొని ముద్దాడి మేనెల్ల నివురుచుండఁగా నామె భరింప
లేనంత బరువుగా శిశువు దేహము తోఁచెను. ఆబరువు మోయఁ
జాలక క్రిందఁ బరుండఁబెట్టి యిదేమి చోద్యము! వీఁడు
సామాన్యుఁడగు పురుషుఁడు కాఁడు. భూభారమును హరింపఁ
బుట్టిన మహాపురుషుఁ డని తోఁచెడిని. అని యూహించు
చుండెను. ఇంతలోఁ గంసునిపంపున నొకదానవుఁడు తృణావర్తుఁ
డనువాఁడు సుడిగాలియై వచ్చి దుమ్ముచే నచ్చట నుండు గోపి
కల నయనంబుల నాచ్ఛాదించి యెక్కుడుయెత్తున బాలు నెత్తు
కొని పై కెగసెను. బాలునిం గానక యందఱు చేతులఁ బిసికి
కొనుచుండిరి.

ఆదానవుఁ డాబాలునెత్తుకొని పై కెగసెను గాని
యతఁడు పెద్దకొండవలెఁ దోఁపఁగా నాభారమునకుఁ దాళఁ
జాలకపోయెను. ఇంతలో గోపాలుఁడు వానిం బట్టుకొని వ్రేలాడఁ
జొచ్చెను. మఱింత బరువు కాఁగా వాఁడు కొండపడినట్లు
క్రిందఁబడెను. పడినంతనే రక్తధారలు ముఖమునుండి ప్రవ
హింప విగతప్రాణుఁ డయ్యెను. ఆవింత చూచి యంద ఱచ్చెరు

వందిరి. తమపూర్వజన్మపుణ్యాతిశేషంబున నీకుమారుడు గల్గె ననియు, నెత్తుకొని ముద్దాడు భాగ్యము తమకు లభించె ననియుఁ దలంచిరి. ఇట్టి యుత్పాతము లెన్నివచ్చినను శ్రీకృష్ణున కపకారము కలుగదనియుఁ దలంచిరి. కొలదికాలము జరిగెను.

ఒకనాఁడు తల్లి పాలిచ్చుచుఁ గృష్ణునిముఖము నిరీక్షించెను. బాలు డావులించెను. ఆతనివదనమున సాగరములు ద్వీపములు కులశైలములు భూచక్రము అవి యివి యన నేల సకలబ్రహ్మాండములు కనఁబడియెను. యశోద తబ్బిబ్బుచెంది కన్నులు మోడ్చి యిదేమి కలయా, నిక్కువమా యని యూహించెను. ఉత్తరక్షణమున భగవన్మాయచే నావార్త మఱచెను.

## బలరామకృష్ణులు క్రీడించుట

ఒక్కనాఁడు గర్గముని యరుదెంచిన నందుఁడు కుల గురువగు నామునికి నమస్కరించి కుమారులం జూపి సంస్కారము లొనరింపవే యని ప్రార్థించెను. ఆముని వారిమహిమను దెలిపి బలరాముఁ డనంతుఁ డని, శ్రీకృష్ణుఁడు శ్రీమన్నారాయణమూర్తి యని వివరించి యథోచితసంస్కారములు జరిపి తనగృహమున కరిగెను. బలరామకేశవు లంత సరి యీడు బాలురతో నాడుకొనఁ బూనిరి. వరుసగా గృహమును దాటి పోవు నీడు వచ్చెను. వీథులలోఁ బొరుగిండ్లలో నాడుకొనుట కలవాటుపడిరి. ఆవల శ్రీకృష్ణుఁడు మాత్రము గోపికాగృహముల వెన్నఁదిన నారంభించెను. బాలచేష్టలచే వారి నానందపఱచుచుఁ గలఁతనొందఁ జేయుచుండెను. కొంతకాలమునకు వారితని చర్యల కులికి యశోదకడ కరుదెంచి తల్లీ!

క. బాలురకుఁ బాలు లేవని, బాలెంతలు మొఱలువెట్టఁ బకపక నగి యీ
బాలుం డాలము చేయుచు, సాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ.

ఇంతియ కాదు.

క. మీపాపఁడు మాగృహముల, నాపోవఁగఁ బాలు ద్రావ నగపడకున్నన్
గోపించి పిన్నపడుచుల, వాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ.

అని యెన్నియో భంగులఁ జెప్పిరి. చిట్టచివఱకు

క. ఓయమ్మ నీకుమారుఁడు, మాయిండ్లను బాలు పెరుఁగు మననీఁ డమ్మా
పోయెద మెక్కడికైనను, మాయన్నల సురభులాన మంజులవాణీ.

అని తమభావముల స్పష్టపఱచిరి. ఆమాట లాలించి యశోద కొడుకు నేమియు ననలేక వారిమాటలఁ దిరస్కరింపఁజాలక యాదరముతో

తే. అన్యమెఱుఁగఁడు తనయంత నాడుచుండు
మంచివాఁ డీతఁ డెగ్గులు మానరమ్మ
రామలార త్రిలోకాభిరామలార
తల్లులార గుణవతీమతల్లులార.

యని వారల నభ్యర్థించి సాగనంపెను. ఒక్కనాఁడు కృష్ణుఁడు మన్నుదినుచున్న వాఁ డని బాలకులెల్ల యశోదకుం దెల్పిరి. బలరాముఁడు నౌ ననెను. తల్లి కొడుకుం జేరి యన్నా! మన్నేటికి భక్షించెదవు? మఱివస్తువులు లేవా నాయనా? ఇదేటి యాహారమురా యని బుజ్జగింపు మాటల నడిగెను. బాలుఁ డమ్మా! మన్నుదినుటకు నే నేల వెఱ్ఱివాఁడనా? ఆఁకొంటినా? వీరి మాటలు నమ్మకుమా. నన్నుం గొట్టింప వీ రిట్లు చెప్పుచున్న వారు. నామాటలు నమ్మకున్న నానోరు వాసనచూచి తప్పున్న

దండింపుమా యని పలికి నోరు తెఱచి చూపఁగా నందు సకల బ్రహ్మాండములు కనఁబడియెను. యశోద కనుంగొని తనమదిని

మ. కలయో వైష్ణవమాయయో యితరసంకల్పార్థమో సత్యమో
తలఁపన్ జేరక యున్నదాననొ యశోదాదేవిఁ గానో పర
స్థలమో బాలకుఁ డెంత యీతనిముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపఁగన్.

అని నిశ్చయించెను. అంతలో భగవన్మాయ తనుం గప్పనూరకుండెను.

ఒక్కనాఁడు యశోద బాలునకుఁ బాలిచ్చి దధిమథనము చేయుచుండెను. అంతలోనే బాలుఁడు దధిభాండముల శకలంబులుగ నొనరింపం గాంచి బాలుం గానక చని వేఱొక యింటిలో ఱోలుతిరుగ వేసి దానిపై నెక్కి యుట్టిమీఁద నున్న వెన్నఁ దినుచున్న తుంటరికొడుకును గృష్ణుని

మ. కని చేతన్ సెలగోలపట్టుకొనుచుం గానిమ్ము కా నిమ్ము రా
తనయా యెవ్వరియందుఁ జిక్కుపడవే దండంబుచుంగాన నే
వినివారంబును బొంద నేవెఱపు నే విభ్రాంతియుం జెంద ము
న్ననియో నీవిటు నన్నుఁ గైకొనమి నేఁ డారీతి సిద్ధించునే.

అని హెచ్చరించి తనకొడుకు నడపడిం దలంచి తనమనంబు నందు

సీ. బాలుఁ డీతం డని భావింతు నందునా
యే పెద్దలును నేర రీక్రమంబు
పఱపెఱుంగుటకు నై వెఱపింతు నందునా
కలిగి లేకొక్కఁడు గాని లేఁడు

వెఱపుతో నాబుద్ధి వినిపింతు నందునా
తనుc దాసరయ్యె బుద్ధి తప్పునందు
నొండెఱుంగక యింట నుండెడి నందునా
చూచి చూడని దొంగ చోటు లేదు

తే. తన్ను నెవ్వరైనc దలపోయc బాఱెడి
యోజ లేదు భీతి యొకటియెఱుcగc
డెలమి నూరకుండc డెక్కు సక్కెములాడc
బట్టి శాస్తి చేయు భంగి యెట్టు.

అని తలంచి నెలగోల జళిపించుచుc బసవెత్తు బాలుంగూడం జని

సీ. స్తంభాదికంబులు తనకు సడ్డంబైన నిట్టట్టు చని పట్టి నీనివాని
నీతప్పు సైరింపు మింక దొంగిలcబోవ నే నని మునుముట్ట నేడ్చువానిc
గాటుక నెఱయంగc గన్నులు నులుముచు వెడలు కన్నీటితో నెగచువాని
నేదెస వచ్చునో యిది యని పలుమాఱు సురుcగుచుc గ్రిగంటc జూచువానిc

ఆ. గూడc బాఱి పట్టుకొని వెఱపించుచు, జిన్ని వెన్నదొంగ చిక్కె ననుచు
నలిగి కొట్టc జేతులాడక పూcబోcడి, కరుణతోడ బాలుc గట్టc దలcచి.

మెల్ల మెల్లన పరిహాసము తోcపc జేయునట్లుగా

క. వీరెవ్వరు శ్రీకృష్ణులు, గారా యెన్నcడును వెన్నc గాన రcట కదా
చోరత్వం బించుకయును, నేరరcట ధరిత్రి నిట్టి నియతులు గలవే.

నాయనా! ఇం కెందుcబోయెదవు? అని పలుకుచు నొక త్రాటితో ఱోటికిc గట్టివేసెను. బాలుc డూరకుండcగాc దల్లి యిల్లే కొంతసేపుండ నిచ్చిన బుద్ధి వచ్చునని యింటికిc బోయెను. బాలుcడు ఱోలు నీడ్చుకొని మద్దిచెట్లజంట యుండు చోటికిం బోయెను.

అట రెండు మద్దిచెట్లుండెను. అవి సాధారణవృక్షములుగావు. నలకూబరమణిగ్రీవు లను యక్షులు శాపవశమున నిట మద్దిచెట్టులుగాఁ బుట్టిరి. వారు కుబేరుని కొడుకులు. అహంకారమున వెండికొండమీఁదఁ జేడియలం గూడి మందాకినీతరంగంబులఁ గ్రీడించుచుండ నారదముని యట కరుగుదెంచెను. ఆచేడియలు వలువలు ధరించిరి. సురాపానమున నొడలెఱుంగని నలకూబరమణిగ్రీవులు మాత్రము వివస్త్రులై యుండిరి. వారిం గాంచి నారదుఁడు

శా. సంపచ్ఛుం డొరుఁ గానలేఁడు తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు దరిద్రుఁ డెత్తుపడి శుష్కీభూతుఁడై చిక్కి హిం
సింపం డన్యుల నాత్మకున్ సములుంగాఁ జింతించు నట్టాఁటఁ ద
త్సంపద్వాంధున కంజనంబు వినుమా దారిద్ర్య మూహింపఁగన్.

అని ప్రతీతం బగు గీతంబుం బాడి వారలం బిల్చి మీరు స్త్రీమదాంధులరు గాన భూలోకంబున నర్జునతరువులై జనింపుఁ డని శపించి యట్లే నూఱుదివ్యసంవత్సరము లుండి యటమీఁద గోవిందదేహస్పర్శనంబున ముక్తులరై సురలోకము నొందుఁ డని పలికి తన యిచ్చం బోయెను.

ఆవృక్షములకు శాపవిమోచనకాలము వచ్చెను. కావున శ్రీహరి యచటికి ఱోటి నీడ్చుకొనిపోయి యావృక్షముల నడుమ దానుండి యవ్వలికిం బోవ నీడ్చెను. ఆయూలూఖల మానడుమ పట్టనంత లావు గలది కాన నాచెట్లు నేలం గూలెను. అందుండి వెడలివచ్చి యానలకూబరమణిగ్రీవులు భగవంతుం బొగడి యనుమతులై తమలోకంబునకుం బోవుచు,

శా. నీపద్యావళు లాలకించు చెవులన్ నిన్నాడు వాక్యంబులన్
నీపేరం బనిచేయు హస్తయుగముల్ నీమూర్తిపైఁ జూపులన్
నీపాదంబులపొంత మ్రొక్కుశిరముల్ నీసేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా.

అని యభ్యర్థించి తమయిచ్చం బోయిరి. ఆ చోటికిం బోయి నందాదు లాయద్భుతకృత్యమును గాంచి యబ్బురపడిరి కాని బాలుఁడు దేవపాలకుఁ డని మాత్ర మెఱుంగఁ జాలరైరి. విష్ణుమాయ వారలం గప్పి యుండెను.

కొలఁదిదినముల కొకచోట నందాదులు చేరిరి. గోకుల మునఁ దోఁచిన యుత్పాతముల నెంచిరి. ఇచ్చోట నుండుట మేలా యని విమర్శించిరి. అందొక వృద్ధగోపకుఁడు తనయెఱుక మెఱసి వ్రేపల్లియం గల కష్టములఁ దేటపఱచి

క. ఘనవు గలదిరవు పసులకు, లసదద్రినదీమహీజలతికావళి పెం [కిన్.
పెసఁగును గాఁపురమునకును, బొసఁగును బృందావనంబు పోదఁ దచ్చటి

అని పొచ్చరించెను. ఆమాట సర్వజనసమ్మత మయ్యెను. అది నంబ నందానుమతి బృందారకు లమృతవారాశికడ కరిగినట్లు గోపకులు పయనంబు సాగించిరి. బలరామకృష్ణులను దల్లులు తొడలపై నునిచికొని సంతోషమున రథ మెక్కి వెడలిరి. బృందావనమునం బ్రవేశించి యందలి శీతలచ్ఛాయలఁ బరితృప్తి నివసించిరి. గోవు లందలి పావననిర్మలజలంబులం ద్రావి చల్లని మ్రాఁకుల నీడలఁ బరుండి యతిమృదులతృణముల మేసి నీరోగ ములై యొప్పారెను. బలరామకృష్ణులు తోడిగోపబాలురం గూడి హాయిగాఁదిరుగుచు గోవుల మేపుచు విహరించుచుండిరి. ఆబృందావనమున నుండి మానవుల హింసించు వత్సాసుర బకా

సురుల వధియించి శ్రీకృష్ణుఁడు వనము నిర్భయముగా నలరం జేసెను.

## బ్రహ్మ గోగోపకుల నంతర్ధానము చేయుట

ఒక్కనాఁడు శ్రీకృష్ణుఁ డెల్లరుంగూడి వనమునకుం బోయి చల్దు లారగించుచుండ నామహామహుని మహిమము నెఱుంగఁ గోరి బ్రహ్మ గోవులను గోపకులను దనశక్తిమెఱపి యంతర్ధానము చేసెను. శ్రీహరి యావృత్తాంత మెఱింగి సాయంకాలము గోవులతో గోపకులతో నింటికింబోయెను. ఈగోపకులు గోవులు శ్రీకృష్ణేచ్ఛాకల్పితరూపముల నలరి యుంచుకే నేవిధమున భేదము లేకయుండ నెవ్వరుగాని తెలిసికొనఁజాల కుండిరి. ఒక్క సంవత్సర మీకరణి గడచెను. బ్రహ్మ యద్భుతశక్తి నావనంబున నున్న గోవులకు గోపకుల కావత్సరము క్షణమాత్రముగాఁ దోఁచెను. ఒక్కనాఁడు విరించి వనంబున కరుదెంచి యం దొక్కచోట

సీ. తన కన్యములు లేక తనరారె ముమ్మూల, విభుఁడయ్యెఁ గ్రేపుల వెనకవాని
నఖిలజ్ఞుఁడై యొక్కఁడయ్యనజ్ఞాకృతిఁ, జెలికాండ్రఁ దెక్కండ్ర జీరువాని
బహిరంతరాద్యంతభావశూన్యుం డయ్యు,నంతంత నడుగుచొప్పరయువాని
గురుగభీరుండయ్యు గురువులు వాఱుచు, నట్టిట్టుఁ బాతర లాడు వాని
ఆ. జాతిరహితుఁ డయ్యు జతురగోపార్భక, భావమెల్ల నచ్చు పడినమేరి
చెలువువాని హస్తశీతాన్నకబళంబు, వానిఁ గాంచె నపుడు వాణిమగఁడు.

కాంచి రాయంచ డిగ్గి భక్తియుక్తుఁడై ప్రణామసహస్రంబు లొనరించి బహుభంగుల వినుతించి తనచేసిన యపరాధంబు క్షమింపఁ బ్రార్థించి గోవుల గోపాలకుల విడిపించి భగవంతు

ననుమతిని బడసి వాణిం గూడి పోవుచుఁ బ్రాంజలియై శ్రీకృష్ణపరమాత్మను గన్నులారఁ దిలకించి పులకాంచితసర్వాంగుఁడగుచు

సీ. శంపాలతికతోడిజలదంబుకైవడి, మెఱుఁగు టొల్లియతోడ మేనివానిఁ
గమనీయమృదుపాణిఁ గబళవేత్రవిషాణ, వేణుచిహ్నంబుల వెలయువాని.
గుంజావినిర్మితకుండలంబుల వాని, శిఖిపింఛవేష్టిత శిరమువాని
వనపుష్పమాలికావ్రాతకంఠము వాని, నలినకోమలచరణముల వానిఁ

ఆ. కరుణ గడలుకొనిన కడగంటివాని గోపాలబాలుభంగి బరఁగువాని
నగుమొగంబువాని నను గన్నతండ్రిని, నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష.

మ. నిను హింసించిన పూతనాదులకు మున్ నీమేటి సంకేత మి
చ్చిన నీకుం బురదారపుత్రగృహగోశ్రీప్రాణదేహాదు ల
ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ రక్షింప నే మిచ్చెదో
యని సందేహము తోఁచుచున్నది ప్రసన్నానీకరక్షామణీ.

అని వినుతించి తనలోకమునకుం బోయెను. భగవన్నిర్మితగో గోపకు లాభగవంతునియందే విలీనులైనొంద బ్రహ్మ యాచ్ఛాదించిన గోవులు గోపకులు యథారీతి నిండ్లకుం బోవ నంతయుఁ బూర్వపురీతి నుండెను.

ఒక్కనాఁడు బలరామకృష్ణులు వనమున గోవుల మేపుచుండ గార్దభాకారుండగు ధేనుకాసురుండు పొడసూప వాని బలరాముఁడు వధించెను. ఇట్లు దానవత్రయము నశింప నావనమెల్ల సర్వజనసులభగమ్య మయ్యెను. కాని యమునానదియందొక్కచోటు జనుల కగమ్యమై యుండెను. ఆవిషయము శ్రీహరి మనమునఁ దోఁచెను. గోపాలకులం బిల్చుకొని తాను మాత్రమే గోవులం దోలకొని శ్రీకృష్ణుఁడు వనమునకుం

బోయెను. బలరాముఁ డాదినమున నింట నుండెను. వేణువు లూఁదుచు గోపాలురు శ్రీకృష్ణు ననుసరించి వనమున విహరించు చుండిరి. గోవు లిచ్ఛానుసారముగ మేయుచుండెను. వారి తనమున మాన వేఁడీకాళీయుని మడింపఁ దగు నని యూహించెను. వెంటనే గోవు లాప్రాంతమునకే మేయుచుఁ బోవసాగెను. గోపాలకులు వాని వెంట వారింగూడి పోవుచుండిరి. మెల్ల మెల్లన నెల్ల రా మడుఁగును సమీపించిరి.

## శ్రీకృష్ణుఁడు కాళీయఫణిని మర్దించుట.

ఆ మడుఁగు కాళీయనాగవిషమున దూషితమై యే జంతువైనను దనచెంతకు రాఁజాలకుండు నంత భయమును గల్గించుచుండెను. ఆవిషవాయువు సోఁకినంత నాకాశమునఁ బాఱుపక్షులు గిరగిరఁ దిరిగి జానిలోఁబడి చచ్చుచుండును. ఏజంతువులు జాని యామడుఁగునకు నీరుద్రావఁబోవకుండును. ఇఁక మనుజులమాట యిటఁ జెప్పనేటికి? ఆచోటికి గోవులు పోఁగానే గోపాలకులలోఁ గొందఱు వాని మరలింపఁ జూచిరి. కృష్ణమూర్తి వారిని వారించి వేణునాద మొనరింప నవియన్ని యు నొక్కచోటఁ జేరి చల్లనినీడఁ బరుండెను. ఇదియె సుసమయ మని తలంచి యెవ్వరికిం జెప్పక యామడుఁగు నొడ్డున విశాలకదంబ మహీరుహము తన కొమ్మలచే నలుప్రక్కల నావరించి యుండఁగా నం దొక్కశాఖ మడుఁగు ప్రక్కకు సాగి ఆవిషవాయువులు సోఁకుటఁ గాలినట్లుండుదాని నెక్కి యందు దుముక భావించి

మ. కటిచేలంబు బిగించి పింఛమునఁ జక్కం గొప్పు బంధించి దో
స్తటసంస్ఫాలన మాచరించి చరణద్వంద్వంబుఁ గీలించి త

తక్కటశాఖాగ్రముమీఁద నుండి యుఱికెన్ గోపాలసింహంబు ది
క్తటముల్ మ్రోయ హ్రదంబులో గుబగుబధ్వానం బహీనంబుగన్.

ఆధ్వని చెవిసోఁకగనే యెవ్వఁడో మూర్ఖబాలుఁడు నా మడుఁగుఁ జొచ్చి కలఁచుచున్నవాఁ డని భూరితరరోషావేశం బునఁ దనచుట్టములం గూడి నీరు వెడలివచ్చి యీఁదుచున్న గోపాలకృష్ణునిం జుట్టుకొనియెను. ఇంచుకేని కదలకుండఁ జేసెను. దంతపాటవముకొలఁదిఁ గఱచెను. తన శక్తినంతయుఁ గనం బఱచి బాధించెను. శ్రీహరియు దానిశక్తిఁ గన నెంచి నిశ్చేష్టునికైవడి నుండెను. బాలురాయవస్థలోనున్న కృష్ణునింగాంచి భీతిల్లిరి. కొందఱు పరువిడి నందాదులకుం దెల్పిరి. యశోదాదు లతోఁ జెప్పుచుఁ జెప్పుచుఁ గృష్ణుని స్థితి యెట్లుండునో యని పరువిడిరి. పాప మాబాలకులకు శ్రీహరిమహిమ మిసుమంతయుఁ దెలియ లే దని చెప్పుట తప్పని నాకుం దోఁప లేదు.

నందాదు లావార్త యాలించినంతనే నోట మాట రామి నేమియుఁ జెప్పక యెవరిత్రోవన వారు పరుగిడిరి. కాళీయ ఫణి కృష్ణునిం గఱచుచున్న దన్నమాట విన్న యశోదాదుల ప్రాణములు మీఁదివి మీఁదికే యెగసిపోయెను. ఒక్కరికైనను నోట తడిలేదు. స్మృతి యనుమాటయే లేదు. ఎటుపోవల యునో తెలియదుగాని యంద ఱచ్చటికే పోయిరి. బలరాముఁ డొక్కఁడు మాత్రము శ్రీహరిమహిమము నెఱుంగుం గావున వారి నూఱడిలం జేయుచు ధీరుఁడై పోయెను. తక్కుంగల వారిలో నొక్కఁడైన ధీరుఁడు లేకుండెను. యశోదాదులు కుయ్యో మొఱ్ఱో యని విలపింప సాగిరి. బలరాముఁ డించుక సుస్వరంబున హెచ్చరించెను.

అంతట శ్రీకృష్ణుఁడు మేను పెంచెను. ఫణిదంతములు శకలంబు లయ్యెను. నాగము మేనిశక్తి నశించెను. భగవంతుని మేను సోఁకినకతన నతఁడు నిశ్చేష్టుఁడు కాఁ జొచ్చెను. బ్రదుకుదునన్న యాశ తొలఁగిపోవుచుండెను. అంతట

సీ. ఘనయమునానదీకల్లోలఘోషంబు, సరసమృదంగఘోషంబు గాఁగ
సాధుబృందావనచరచంచరీకగానంబు గాయకసుగానంబు గాఁగఁ
గలహంససారసకమనీయమంజుళ, ధ్వానంబులు తాళశబ్దములు గాఁగ
దివినుండి వీక్షించు దివిజగంధర్వాది, జనులు సభాసీనజనులు గాఁగఁ
తే. బద్మరాగాదిరత్నప్రభాసమాన, మహితకాళీయఫణిఫణామండపమున
నళినలోచనప్రఖ్యాత నర్తకుండు, నిత్యనైపుణమునఁ జేసె నృత్యమాడె.

ఆనర్తనమున మఱింత నాభుజగము చేష్టలు మానెను. మృతి గల్గక తప్పదని రక్తము గ్రక్కెను. ఆగతి వీక్షించి యాభుజగరాజపత్నులు భగవంతునిఁ జేరి నమస్కరించి బహుభంగులఁ బ్రార్థించుచు

ఉ. అకులమయ్యె భోగ మిదె యాఁదల లన్నియుఁ బ్రస్సెఁ బ్రాణముల్
రాకల పోకలం బొలిసె రాయిడిపెట్టక మా నిజేశుపై
నీకరుణాకటాక్షములఁ నిల్పఁగదే తగ నో సమస్తలో
కైకశరణ్య యో యభయకారణ, యో కమలామనోహరా!
ఆ. మమ్ముఁ బెండ్లిచేయుమా ప్రాణవల్లభు, ప్రాణ మిచ్చి కావు భక్తవరద
నీవు చేయుఁ బెండ్లి నిత్యంబు భద్రంబు, పిన్నవాటిపెండ్లి పెండ్లి గాదు.

అని విన్నవింప భగవంతుఁడు వారిదీనాలాపంబు లాలకించి కాళీయఫణి ననుగ్రహించి తననృత్యంబుఁ జాలించి యెల్లరు వినుచుండఁగా ఫణిపతితో

క. గోవర్గములు గోపజాలము, త్రావఁదు రిపుఁడుగాఁగ నీరు దగ దిం దుండన్
నీవును నీబంధుజనంబును, నీవనితలు సుతులు చనుఁడు నేఁ డంబుధికిన్.

అని యాజ్ఞాపింప శ్రీహరియానతి శిరసావహించి చన నుంకించి పాదములకడ నిలువఁగా నతనిభావ మెఱింగి శ్రీకృష్ణపరమాత్మ

ఆ. గరుడభీతి రమణకద్వీపమెల్లఁ గి
ముడువుఁ బొచ్చి తీవు మత్పదాబ్జ
లాంఛనములు నీశిరంబు నుండుఁ జూచి యా
పక్షిరాజు నిన్నుఁ బట్టఁ డింక.

అని యనుగ్రహించిన నాతండు సపరివారుండై యమునానదీ జలమార్గంబుననే చని రత్నాకరద్వీపంబునకుం బోయెను. శ్రీకృష్ణుఁడు జలము వెడలి రాఁగా నందాదు లానందపరవశులైరి. భగవంతుఁడు తనమాయచే వారి నాచ్ఛాదింప, వారు భగవంతుఁ డని మఱచి కుమారుఁగా భావించి ముద్దాడిరి. పిదప బృందావనమున నిర్బాధకముగా నందఱు కొలఁదిదినములు గడపిరి. బలభద్రుఁడు ప్రలంబాసురుం బొలియించి తనపరాక్రమంబు నెఱపెను. ఒకనాడు దావాగ్ని చుట్టుకొనఁగా నందున్న గోపకు లెల్ల భయభ్రాంతులై శ్రీకృష్ణుం జేరి

శా. నీచుట్టాలకు నాపదల్ గలుగునే నేఁడెల్ల నీవార మ
స్మాచారంబు లెఱుంగ మీశుఁడవు మాకాభీలదావాగ్ని నేఁ
డేచందంబున నింకఁ దాటుదుము మమ్మీక్షించి రక్షింపవ
న్నా చంద్రాక్ష! విపన్నులన్ శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్.

అని ప్రార్థింపఁ దనయమానశక్తి తేటపడ నా దావాగ్నిని మ్రింగి వారల విగతదుఃఖవ్యాకులులనుగా నొనరించెను. ఇట్లు సకలాప

దల శ్రీహరి తోడఁగింప నందాదు లానందపరవశులై బృందా వనమున నుండిరి. ఏకార్యము గాని శ్రీకృష్ణు ననుమతి లేక సాగకుండెను.

## నందాదు లింద్రయాగముచేయఁ బూన హరి నివారించుట

నందాదులు గుమిఁగూడి యింద్రయాగము చేయఁబూని శ్రీకృష్ణునికడకు వచ్చి తెలిపిరి. శ్రీహరి యింద్రయాగము వలదని పలుకుచు

క. కర్మమునఁ బుట్టు జంతువు, కర్మమునన వృద్ధిఁ బొందుఁ గర్మమునఁ జెడుం
గర్మమె జనులకు దేవత, కర్మమె సుఖదుఃఖములకుఁ గారణ మధిపా.

క. కర్మములకుఁ దగుఫలములు, కర్ములకు నిడంగ రాజుగాని సదాని
ష్కర్ముఁడగు నీశ్వరుండును, గర్మవిహీనునకు రాజు గాఁడు మహాత్మా.

అని యనేకవిధంబుల ధర్మంబు లుపదేశించెను. మఱియుఁ బర్వతమునకు విప్రప్రవరులకు మఖము చేయుట మంచి బుద్ధి యనియు హెచ్చరించెను. ఇంద్రయాగమునకుఁగా నేకరించిన వస్తువులతో నీకార్యంబు చేయుట మంచిది. కాఁబట్టి

శా. గంధాలంకరణాంబరావళులచేఁ గైచేసి యిష్టాన్నముల్
బంధుశ్రేణియుం మీరలుం గుడిచి సాభాహారలిక్ వేడుకల్
సంధిల్లన్ గిరిగోద్విజానలసమస్కారంబు గావింపుఁ డో
జం ధర్మం బని తోఁచె నేని జనకా జన్నంబు ధర్మం బగున్.

అనియు మందలించెను. ఆవచనంబులు మేలుమే లని యంద ఱంగీకరించిరి. పర్వతమునకు బహువిధపూజ లొనరించి నైవే ద్యము లర్పించిరి. దాన భగవంతుఁడు పరితృప్తి నొందెను. గోవుల నలంకరించిరి. విప్రులఁ బూజించిరి.

ఆరీతి నింద్రుఁ డెఱింగి మహోగ్రహంబున మేఘంబుల రావించి గంభీరభాషణంబుల

శా. ఉద్వృత్తస్సంపదనమ్మి నందతనయోద్యోగంబునన్ వెఱ్ఱులై
మద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లులఁ గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువుఁ బొంద రాల్ కురియుఁడీ శౌర్యం బవార్యంబుగన్.

అని యాజ్ఞాపింపఁగా మేఘంబులు భయంకరారావంబుఁ గావించుచుం బోయి యంబరంబు నెల్ల నావరించి పాషాణవర్షంబుఁ గురియింప గోపకు లాతురతం బొంది నిలువఁజాలక పుండరీకాక్షుకడకుం బోయి గోవులపరితాపంబులకు స్వాంతంబులు పల్లటిల్లఁగా

ఉ. అక్కట వానఁ దోఁగి వ్రజ మాకులమయ్యెఁ గదయ్య కృష్ణ నీ
వెక్కడ నుంటి వింత తడ వేల సహించితి నీపదాబ్జముల్
దిక్కుగ నున్న గోపకులు దీనతనొంద భయాపహారివై
గ్రక్కునఁ గావ కిట్టునికి కారుణికోత్తమ నీకుఁ బాడియే.

## గోవర్ధనాద్రిని గృష్ణుఁ డెత్తుట

అని విన్నవింపఁగా విని శ్రీహరి వారిభయం బుడిపి యొక్క కరంబున నవలీల నాపర్వతంబు నెత్తి ఛత్రాకారంబుగా వారి కమర్చి నవ్వుచు దీను లగువారిం గాంచి.

శా. బాలుం డీతఁడు కొండ దొడ్డది మహాభారంబు సైరింపఁగాఁ
జాలండో యని దీని క్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల దీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పైఁబడ్డ నా
కే లల్లాడదు బంధుజార నిలుఁడీ క్రిందం బ్రమోదంబునన్.

అని పలికెను. శ్రీహరి పలుకుల నమ్మి యంద ఱాపర్వతముం గ్రిందికిం బోయిరి. ఏ డహోరాత్రములు పర్వతమును గేల ధరించెను. గిరిభేది సిగ్గుపడి మేఘుంబుల వర్షింప మానుఁ డని పలికెను. వాన తగ్గెను. గోపకు లెల్ల హర్షంబునం బొదలిరి. గోపకులు నందునిం గాంచి కృష్ణునింగూర్చి

సీ. కన్నులు తెఱువని కడుఁ జిన్నిపాపఁడై, దానవి చనుఁబాలు ద్రాగి చంపె
మూఁడవనెలవాఁడు ముద్దులబాలుఁడై, కోపించి శకటంబుఁ గూలఁ దన్నె
నేఁడాదికుఱ్ఱఁడై యెగసి తృణావర్తు, మెడఁబట్టుకొని కూల్చి మృతునిఁ జేసె
దల్లి వెన్నలకు నై తను ఱోలఁ గట్టినఁ, గొమరుఁడై మద్దులఁ గూలనీడ్చెఁ
తే. బసులఁ గ్రేఁపులఁ గాచుచు బకునిఁ జీరె
వెలఁగతో వత్స దైత్యుని వ్రేసి గెడపె
సబలుఁడై ఖరదైత్యుని సంహరించె
నితఁడు కేవలమనుజుఁడే యెంచిచూడ.

క. ఓనంద గోపవల్లభ, నీనందనుఁ డాచరించు నేర్పరితనముల్
మానవులకు శక్యంబులె, మానవమాత్రుండె నీకుమారుఁడు తండ్రీ.

అని వినుతించిరి. నందుఁ డాత్మను గర్గమహాముని పల్కులం దలంచి వారలకుం దెలుప వారు కృష్ణుఁ డనంతుఁ డని పూజించిరి. ఇంద్రుఁడు శ్రీకృష్ణుని వినుతించి ప్రార్థించి తదాజ్ఞ శిరసునఁ దాల్చి పోయెను.

## శ్రీహరి యద్భుతగానము

కొంతకాలమునకు సకలజనామోదకరంబగు శరత్కాలము వచ్చెను. చంద్రుఁడు తన యసమానజ్యోత్స్నావితానమునఁ బ్రపంచము నావరించి మహానంద మెట్టివారికైన నిచ్చు

చుండెను. అత్తఱిఁ బుండరీకాక్షుండు బృందావనంబున నొక చోటఁ గూరుచుండి జగన్మనోహరంబుగా గానము చేసెను. ఆమురళీగానము పాషాణములకేని చపలతం గూర్పక మానదన నింక గోలోకమునుండి శ్రీకృష్ణప్రీతికై యవతరించిన గానప్రియులగు గోపికలమాట యిఁకఁ జెప్పనేటికి! ఆగానము విశేషించి యాసుదతుల శ్రుతిపుటముల ద్వారా మనములఁ బ్రవేశించెను. ఏపనిచేయుచున్న వారాపనిని వదలి యెవ్వరికిం జెప్పక యచటికిం బరుగిడిరి. ఔరా! ఏమి యాభగవన్మాయామహిమము!

ఆ. బాంధవమున నైనఁ బగనైన వగనైనఁ బ్రీతినైనఁ బ్రాణభీతినైన
భక్తినైన హరికిఁ బరతంత్రులై యుండు, జనులు మోక్షమునకుఁ జనుదు(రనుటది)

అను సుప్రసిద్ధమే కదా! ఇట్లు తనగానమును విని వచ్చిన యాచేడియలం గాంచి శ్రీహరి యల్లన మధురస్వరం బుల్లసిల్లఁగా కాంతలారా! మీరిటువచ్చుట పాడియా

సీ. ప్రాణేశుఁ డెఱిఁగినఁ బ్రాణంబునకుఁ దెగు, దండించు నెఱిఁగిన ధరణివిభుఁడు
మామ యెఱింగిన మనువెల్లఁ జెడిపోవుఁ, దలవరి యెఱిఁగినఁ దగులు చేయుఁ
దలిదండ్రు లెఱిఁగిన దలలెత్తకుండుదు, రేరా లెఱింగిన నెత్తిపొడుచు
నాత్మజు లెఱిఁగిన నాదరింపరు చూచి, బంధువు లెఱిఁగిన బహిరొనర్తు

ఆ. రితరు లెఱిఁగిరేని యెంతయుఁ జుల్కఁగాఁ
జూతు రిందు నందు సుఖము లేదు
యశము లేదు నిర్భయానందమును లేదు
జారుఁ జేరఁ జనదు చారుముఖికి.

మఱొక్కచక్కనిమాట

క. నడవడి కొఱ గాకున్నను, బడుగైనఁ గురూపియైనఁ బామరుఁడైనన్
జడుఁడైన రోగియైనను, విడుచుట మరియాద గాదు విభు నంగనకున్.

అనిన విని ఘోషవల్లవాంగనలు భక్తిపరతంత్రలై

మ. అకటా! నమ్మితి మేము క్రూరుఁడవ నిన్నర్థించె మాయింట్ల నా
సకలవ్యాప్తుల డించి నీపదసరోజాతంబు లర్చింపఁ జొ
క్కక యేతెంచితి మోసుఁడా ధ్యేయుఁడవు మోక్షాసక్తులం గాచు నా
టికిఁ గావం దగుఁ గావవే విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్.

శ్రీకృష్ణా!

సీ. నీపాదకమలంబు నెమ్మి దగ్గరఁగాని, తరలిపోవంగఁ బాదములు రావు
నీకరాబ్జంబులు నెఱిఁ జంటిలిడఁ గాని, తక్కినపనికి హస్తములు రావు
నీవాగమృతధార నిండఁ గ్రోలఁగఁగాని, చెవు లన్యభాషలు చేరి వినవు
నీసుందరాకృతి నియతిఁ జూడఁగఁగాని, చూడ వన్యంబులఁ జూడ్కి కవలు
ఆ. నిన్నుఁ గాని పలుక నేరవు మాజిహ్వ, లొల్ల నటుచుఁ బలుక నోడ వివ్వు
మామనంబు లెల్ల మరపించి దొంగిలి, తేమి చేయుదువార మిఁకఁ గృష్ణ.

అని పలుకునంతలో శ్రీహరి వారిం బరీక్షింపఁగోరి యదృశ్యుం డయ్యెను. అత్తఱి నామత్తకాశినులు తత్తఱంబున నిందు నందు వెదకుచు విభ్రాంతలు గావున

సీ. పున్నాగ కానవే పున్నాగవంద్యుని, దిలకంబ కానవే తిలకనిటలు
ఘనసార కానవే ఘనసారశోభితుఁ, బంధూక కానవే బంధుమిత్రు
మన్మథ కానవే మన్మథాకారుని, వకుళంబ కానవే వంశధరునిఁ
జందన కానవే చందనశీతలుఁ, గుందంబ కానవే కుందరదను
తే. నింద్రభూజమ కానవే యింద్రవిభవుఁ
గువలవృక్షమ కానవే కువలయేశుఁ
బ్రియకపాదప కానవే ప్రియవిహారు
ననుచుఁ గృష్ణుని వెదకి రయ్యబ్జముఖులు.

అనుచు వెదకుచు శ్రీహరిచరణాంబుజంబు లాభూతలంబున నంకితంబులై యుండంగాంచి మహాభక్తియుఁ బ్రేమము తనరారు చుండఁగా

సీ. ఈచరణంబులే యిందునిభానన, సనకాదిమునియోగ సరణి నొప్పు
నీపాదతలములే యెలనాఁగ శ్రుతిపథా, సీమంతవీథులఁ జెన్ను మిగులు
నీపదాబ్జంబులే యిభకుంభోత్తమయాన, పాలేటిరాచూలి పట్టుఁగొమ్మ
లీసుందరాంఘ్రులే యిందీవరేక్షణ, ముక్తికాంతామనోమోహనంబు
ఆ. లీయడుగుంబరజమె యింతి! బ్రహ్మేశాది, దివిజవరులు మౌళిదిశలఁదాల్తు
రనుచుఁ గొంద ఱబల లబ్జాక్షుఁ డేగిన, క్రమముఁ గని పోవ నతనిఁ గానరైరి.

మరలి వారెల్ల నింటికిం జనిరి. శ్రీకృష్ణుఁడు సర్వగతుఁడు గావున వారిభర్తలఁ దనరూపమునఁ గనంబడఁజేసి వారి సంతాపముల నివారించెను. జలక్రీడల రాసక్రీడల నిరంతరంబు వారిభర్తలు శ్రీకృష్ణరూపంబుల వారికిం గనంబడుచుండిరి. ఇట్లు సర్వాంతర్యామి యగు శ్రీకృష్ణపరబ్రహ్మ మలరారు చుండెను.

కొంతకాలమునకు శ్రీహరి వృషభాసురుం జంపి కేశి వ్యోమదానవులం బొలియించి బృందావనప్రాంతముల దానవ సంచారము లేకుండఁజేసి యందలి ప్రజల నెల్ల సంతోషపరవశు లఁగా నొనరించెను. పిదపఁ గొన్నినెల లించుకంతయు భీతి గాని విచారముగాని లేక నందాదు లానందమునకు నివాస మగు శ్రీకృష్ణునిచేష్టలం గాంచుచు హాయిగాఁ గాలమును గడపుచుండిరి. ఒక్కనాఁడు నారదముని శ్రీహరిచెంతకు వచ్చి కంసాదిదానవవధంబు చేయుట ముఖ్యకర్తవ్యం బని నొక్కి చెప్పిపోయెను. గోపాలబాలునిచిత్తమున నాయుపాయ కల్గెను.

వెంటనే కంసుని మదిని శ్రీహరిని బిలిపించి చంపింపఁ దగు నను
స్వప్నము పొడసూపెను. అక్రూరుఁడు తనకు మిత్రుఁడౌట
నాతనిం బిలువంబంచి మధురానగరంబున కరిగి బలరామకృష్ణులం
దోడ్కొని రమ్మని యాజ్ఞాపింప నాతం డామాటలఁ బరమా
దరంబునఁ దలపై నిడుకొని పయనము సాగించెను.

## అక్రూరుఁడు బృందావనమున కరుదెంచుట

పయనము చేయుచు మార్గమునఁ దనలో

ఉ. ఎట్టితపంబు చేయఁబడె నెట్టిచరిత్రము లబ్ధమయ్యెనో
యెట్టిధనంబు లర్థులకు నీఁబడెనో తొలిబామునందు నా
యట్టి వివేకహీనునకు నాదిమునీంద్రులు యోగదృష్టులం
బట్టఁగలేని యీశ్వరుని బ్రహ్మమయుం హరిఁ జూడఁ గల్గెడిన్.

ఉ. మాపటివేళ నేను జని మాధవుపాదసమీపమందు దం
డాపతితుండనైన నతఁ డాశుగకాలభుజంగవేగసం
తాపితభక్తలోకభయదారణమైన కరాబ్జ మౌఁదలన్
మోపి హసించి నా కభయముం గృపతోడుత నీయకుండునే.

అని తలంచుచు బృందావనముఁ బ్రవేశించి రథంబు దిగి యందు

మ. కనె నక్రూరుఁడు పద్మనేత్రులను రంగద్గాత్రులన్ ధేనుదో
హనవాటీగతుల న్నలంకృతుల నుద్యద్బాహులం బీతనీ
లనవీనోజ్జ్వలవాసులన్ గుసుమమాలాధారులన్ ధీరులన్
వనితాకాములఁ గృష్ణరాముల జగద్వంద్యక్రమోద్దాములన్.

కనినంతనే వారిపాదములకు భక్తివినయంబులు పెనఁగొన
నమస్కరించెను. అంత భక్తవత్సలుండగు శ్రీహరి యక్రూరు

నతివాత్సల్యమునఁ గౌఁగిలించుకొనిరి. బలభద్రుండు నతనిఁ గౌఁగిలించుకొని కుశలం బడిగెను. అంత రామకృష్ణులు తమ గృహమున కాతనిం గొనిపోయి యథాతిథేయసత్కారము లాచరించి మృష్టాన్నమున సంతుష్టుం జేసిరి. అంత నందుఁడును యథోచితముగ నాతని నాదరించి ఆర్యా!

క. చెలియలు మొఱ యిడ నల్లుర
 ఖలుఁడై పొరిగొనిన యట్టి కంసుఁడు బ్రదుకం
 గలఁడే మనికి దశార్హుల
 కిలపై మీసేమ మింక నే మని యడుగన్.

అని ప్రశ్నించెను. ఆవల నక్రూరుండు తగినట్లు సంభాషించి తా వచ్చిన కార్యం బెఱింగింప శ్రీహరి సమ్మతించెను. ఆవల ప్రయాణ సన్నాహము చేయఁబడియె. అక్రూరునియరదంబుపై రామకృష్ణులు కూరుచుండి మధురానగరంబుఁ గానఁబోయిరి. అంత నక్రూరుఁడు తన యింటికి వేంచేయుఁ డని ప్రార్థింప శ్రీహరి కంస వధానంతర మరుదెంతు. ఇపుడు పొమ్మని యక్రూరుని సాగనంపి యపరాహ్ణంబున బలభద్రగోపాలురం గూడి మధురం బ్రవేశించుచుండఁగా గోపాలకృష్ణునిఁగన్నుల కఱవుదీఱఁ గాంచిన సుందరు లితరకాంతలం బిల్చుచు మహానందంబునఁ జూచుచుఁ దమలోఁ దమరు.

సీ. వీఁ డటే రక్కసి విగతజీవఁగఁ జన్నుబాలు ద్రావిన మేటి బాలకుండు
 వీఁడటే నందుని వెలఁదికి జగమెల్ల ముఖమందుఁ జూపిన ముద్దుకాఁడు
 వీఁడటే మందలో వెన్నలు దొంగిలి దప్పించి మెక్కిన దాఁపరీఁడు
 వీఁడటే యలయించి వ్రేతలమానంబు చూఱలాడిన లోకసుందరుండు

తే. వీఁడు లేకున్నఁ బుర మటవీస్థలంబు
వీనిఁ బొందనిజన్మంబు విగతఫలము
వీనిఁ బలుకని వచనంబు విహగరుతము
వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు.

అని చెప్పుకొనుచుం దృప్తినొందని నేత్రములం జూచిరి.

ఆతరుణమున నగరద్వారంబునుండి రాగకారుండగు నొక్క రజకుఁడు వచ్చుచుండెను. వానిం జూచి శ్రీహరి.

ఉ. విందులమై నరేశ్వరునిపీటికి వచ్చితి మేము మాకు మా
మందలలోనఁ గట్టుకొన మంచిపటంబులు లేవు నీమడిన్
సుందరధౌతచేలములు శోభిలుచున్నవి తెమ్ము నిమ్ము మే
లందెడు నిమ్ము రాజు దెస నల్గుర మోరజకాన్వయాగ్రణీ.

అన రోషించి వాఁడు తిరస్కరింపఁ గృష్ణుం డతని సంహరించి వలసిన వస్త్రంబుల నన్నయుఁ దానుం గట్టుకొని మిగిలినవానిని గోపకుల కొసంగి నగరమునఁ బోవుచుండ నొక తంతువాయ కులజుఁ డా దేవకీపుత్రరత్నముం గాంచి యతిమృదువస్త్రాభరణముల నొసంగ నాహరి ధరించి వాని నాదరంబునఁ గాంచి యనంతైశ్వర్యంబు ననుగ్రహించి సారూప్యంబుఁ గటాక్షించెను. పిదప వా రటనుండి సుదాముఁ డనుమాలాకారు నింటికిం బోయిరి. వాఁడు భక్తిఁ బూజించి సుగంధికుసుమదామకంబు లొసంగ వానిఁ ధరించిరి. వానిభక్తికి మెచ్చి శ్రీహరి వరమేమికోరెద వనఁగా వాఁడు

క. నీపాదకమలసేవయు, నీపాదార్చకులతోడి నెయ్యమును నితాం
తాపారభూతదయయును, దాపసమందార నాకు దయచేయఁగదే.

అని ప్రార్థింప సంతోషించి బలాయుఃకీర్తిసంపద లొసంగి యట నుండి వెలువడి పయనము సాగించుచుండఁ గుబ్జ యను లేమ కనఁబడెను. కృష్ణుఁ డీలేపన మెవ్వరికిఁ గొనిపోయెదు? నీ వెవ్వ తెవు? మాకిమ్ము. నీవు చక్కనగుచు నివ్వటిల్లెద వన నాకుబ్జయు

ఉ. చక్కనివాఁడవౌదు సరసంబుల నొంపకు మెల్లవారికిం
జక్కఁదనంబు లెక్కఁడివి? చారుశరీర త్రివక్ర యండ్రు నే
నిక్కము కంసుదాసిని వినిర్మలలేపనవిద్యదాన నక్
మిక్కిలి రాజు మెచ్చుఁ దగ మీరు విలేపనముల్ ధరింపరే.

అని యొసంగిన వాని ధరించి వాని పాదములపైఁ దనపాదము లుంచి కృష్ణుఁడు దానిం బట్టి చక్కఁగ నెత్తిన మువ్వంకలు మాని యాలేమ చక్కనై మన్మథబాణముక్రియనలరి మహాత్మా! నాయింటికి విచ్చేయుమని ప్రార్థింప వచ్చిన కార్యముం దీర్చి యవ్వల నరుదెంతు నని మాట యిచ్చి విపణిమార్గంబునఁ బోవుచుఁ బౌరు లొసంగు కానుకల నంగీకరించుచు ధనుశ్శాలకుం బోయి యందొకధనుస్సును గని సంధింపఁబూన నది శబ్దించుచు శకలంబు లయ్యెను. అంత సూర్యుఁ డస్తమించెను. నందాదు లొకచోట విడిసి యారాత్రి గడపిరి.

మఱునాఁడు కాల్యములు తీర్చి నందాదులు తాము తెచ్చిన కానుకలను గంసున కర్పించి తదనుమతులై యథార్హ పీఠముల నుపవిష్టులైరి. రామకృష్ణు లలంకృతులై మల్లదుందుభి నిస్వానంబు విని రంగద్వారముకడకుం జని కువలయాపీడమను మదగజంబును గాంచిరి. అది కంసునిచే శ్రీకృష్ణుం జంపఁ బెంపఁ బడినది. దానిని గుంజరపాలకుఁడు రామకృష్ణులమీఁదికిం

బోలుచుండెను. కృష్ణుండు వానియుద్యమం బెఱింగి పరాక్ర మంబున నొక్కనిమేషమున దానిం బొలియంజేసి రంగస్థలమును బ్రవేశింప వారి నిరువురం గాంచి కంసుఁ డులికిపడియెను. కువలయాపీడవధవార్త మ్ముందే యాతనిచెవులఁ జొరఁబడియే యుండెను.

పుణ్యమూర్తులగు రామకృష్ణులు సభలోనికి వచ్చుచుండఁగాఁ బౌరు లానందపరవశులై వారలం గాంచి హర్షించి వినుతించిరి. వారు సభలోఁ బ్రవేశింపఁగనే వారితోఁ బోరాడఁ జాణూరముష్టికు లనుమల్లు లిర్వురు నిలువఁబడియుండిరి. అందుఁ జాణూరుండు సోదరులం గాంచి గంభీరరవంబున

మ. వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచున్
బెరఁగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ చెప్ప మా
మనుజేంద్రుం డిట మమ్ముఁ జేరఁ బనిచెన్ మల్లాహవక్రీడకున్
జనదే కొంత పరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపఁగన్.

ఇం కొక్కమాట

మ. జవసత్వంబులు మేలె సాము గలదే సత్రాణమే మేను భూ
ప్రవరుం బో నన మిమ్మనంగవలె నే పాళీ లభీష్టంబులే
పవివో కాక కృతాంతదండకమవో ఫాలాక్షునేత్రాగ్నివో
నవనీతంబుల ముద్ద గాదు మెసఁగన్ నాముష్టి గోపార్భకా.

ఇట్లు పలికిన వానిగర్వోక్తులన్ విని శ్రీహరి తనలో నవ్వుకొనుచు

ఉ. సాములు లేవు పిన్నలము సత్వము గల్గవ రాదు మల్లనం
గ్రామవిశారదుల్ కులిశకర్కశదేహులు మీరు మీకడన్

ఏము చరించు టెట్టు ధరణీశుని వేడ్కలు చేయుంవారముం
గాము వినోదముల్ సలుపఁ గా దనవచ్చునె యొక్కమాటికిన్.

అని పలుకఁగా విని చాణూరుం డాగ్రహించి గర్వము తన్ను ముంపఁగా.

క. ప్రల్లద మేఁటికి గోపక, బల్లిదుఁడను లోకమందుఁ బ్రఖ్యాతుఁడ నా
చల్లడము క్రిందఁ దూఱని, వల్లురు లే రెందు ధరణిమండలమందున్.

ఇంతియ గాదు.

సీ. చలమున ననుడాసి జలరాశిఁ జొరరాదు నిగిడి గోత్రము దండ నిలువరాదు
కేడించి కుంభిని క్రిందినిఁ బోరాదు మనుజసింహుఁడ నని మలయరాదు
చేరినఁ బడవైతుఁ జేయి చాఁపఁగరాదు బెరసి బాముండటఁ బెరుఁగరాదు
భూసాధుహింసకుఁ బోరాదు నను మీఱి శోధింతుఁ గానలఁ జొరఁగరాదు
ఆ. ప్రబలమూర్తి ననుచు భాసిల్లఁగా రాదు; ధరఁ బ్రబుద్ధుఁడ నని తలఁపరాదు
కల్కితనము చూపి గర్వింపఁగా రాదు, తరముగాదు కృష్ణ తలఁగు తలఁగు.

అదిగాక నీవు శ్రీహరి నని భావింతువేమో!

సీ. మహిమతో నుండంగ మధురాపురము గాని
బోలుపార వైకుంఠపురము గాదు
గర్వంబుతో నుండఁ గంసునిసభ గాని
సంసారరహితుల సభయుఁ గాదు
ప్రకటించి వినఁగ నా బాహునాదము గాని
నారదువీణాస్వనంబు గాదు
చదురు లాడఁగ మల్లజనవిగ్రహము గాని
రమతోడి ప్రణయవిగ్రహము గాదు
తే. కెలసి తిరుగంగ వేదాంతవీధి గాదు
మొఱఁగి పో మునిమనముల మూల గాదు

సాఁగి నడుపంగ భక్తులజాడ గాదు
శౌరి సామ్రోల నీ వెందుఁ జనియె దింక.

అని భయంకరసింహనాదంబు చెలఁగఁ బలికిన విని శ్రీహరి నవ్వుచు నీతో నేఁ బోరాడెద. బలరాముఁడు ముష్టికునితోఁ బోరాడెడు నని పలికి వానిని మార్కొనియె. ఇట్లు తలఁపడి సభ్యు లచ్చెరు వందఁ బోరాడి ముహూర్తమాత్రంబున హరి చాణూరునిని, బలరాముఁడు ముష్టికునిం బొలియించిరి.

## కంసవధము

ఆకృత్యముం గాంచి కంసుఁడు మంత్రులం జూచి యాగ్రహంబున

ఉ. వల్లవబాలురన్ నగరివాకిటికిన్ వెడలంగఁ ద్రొబ్బుఁడీ
గొల్లల మట్టికొల్ కొనుఁడు క్రూరుని నందునిఁ గట్టు డుర్వికిం
దెల్లముగాఁగ నేఁడు వసుదేవునిఁ జంపుఁడు తండ్రిగాఁడు వీఁ
డెల్లవిధంబులం బరుల కిష్టుఁడు కావకుఁ డుగ్రసేనునిన్.

అని యింక నేమో కాఱులాడుచున్న కంసుని తులువపలుకుల కాగ్రహించి

శా. జంఘాలత్వముతో నగోపరిచరత్సారంగహింసేచ్ఛచు
ల్లంఘింపన్ గమకించు సింహముక్రియన్ లక్షించి పౌరప్రజా
సంఘాతంబులు తల్లడిల్ల హరి కంసప్రాణహింసార్థియై
లంఘించెన్ దమకంబుమీఁదికి రణోల్లాసంబు భాసిల్లఁగన్.

అట్లు లంఘించి యెల్లరు నిశ్చేష్టులై కనుంగొనుచుండఁగా

శా. పక్షీంద్రుం డురగంబుఁ బట్టు విధమొప్పం గేశబంధంబు లో
కక్షోభంబుగఁ బట్టి మౌళిమణు లాకల్పాంతవేళాపత

న్నక్షత్రంబులభంగి రాల రణసంరంభంబు డిందించి రం
గక్షోణిం బడఁ ద్రొబ్బెఁ గృష్ణుఁడు వెసం గంసుక్ నృపోత్తంసునిన్.

క్రిందఁబడి పంచత్వంబునొందినకంసుని శ్రీకృష్ణుఁ డీడ్చెను. కంసునితేజస్సు శ్రీహరిలోఁ బ్రవేశించెను. కంసుసోదరుల న్యగ్రోధగవాహ్వాలనువారల బలరాముఁడు వధించెను. ఆసగుయమున

క. చేతులఁ దాళము లొత్తుచుఁ, జేతోమోదంబుతోడ సిగముడి వీడం
బాతరలాడుచు మింటను, గీతము నారదుఁడు పాడెఁ గృష్ణా యనుచుక్.

ఆవల శ్రీహరి వసుదేవుని జెఱనుండి విముక్తుని గావించి యుగ్రసేనునకుఁ బట్టంబుఁ గట్టి చెఱసాలనున్న రాజుల విడిపించి గోపికలకడ కుద్ధవునిం బంచి తమకుశలవార్తాశ్రవణమున వారిపరితాపంబులు మాన్చి యక్రూరునింటికిం జని యందు మృష్టాన్నంబుల భుజించెను. సంతృప్తి నొందినశ్రీహరింగాంచి యక్రూరుఁడు భక్తిభరంబునఁ జేతులు ముకుళించి

శా. ఏపుణ్యాతిశయప్రభావముననో యీజన్మమం దిక్క దక్
నీపాదంబులు కంటి నిన్నెఱిఁగితిక్ నీవుం గృపాళుండవై
నాపై నర్మిలిఁ జేసి మాన్పఁగదవే నానాథ సాగారకాం
తాపుత్రాదులతోడిబంధనము భక్తవ్రాతచింతామణీ.

అని వినుతించిన శ్రీహరి యతనిం గటాక్షవీక్షణంబుల నీక్షించెను. అంతటఁ గొంతకాల మందే యుండుబుద్ధిపొడమ శ్రీకృష్ణుఁడు నందాదులతో నివసించెను. మధురానగరమున నందాదులు గోపాలబాలుఁడు నివసించియున్నవా రనువార్త యెల్లెడల వ్యాపించెను. జరాసంధునికొలువుకూటమునఁ గంసపత్నులనుండి యావార్త వినఁబడఁగా వాఁడు మండిపడి

## జరాసంధుఁడు మధురాపురిని ముట్టడించుట

శా. ఏమీ కృష్ణుఁడు కంసునిన్ రణములో హింసించెనో చెల్ల నా
సామర్థ్యంబుఁ దలంపఁ డించుకయుఁ దచ్చండప్రతాపానలో
ద్దామార్చుల్ వడి నేఁడు గాల్చు యదుసంతానాటవీవాటికన్
భూమిం గ్రుంగిన నింగిఁ బ్రాఁకిన మహాంభోరాశిలోఁ జొచ్చినన్.

పుత్రికలారా! యాదవు లిఁక భూలోకమున నుండఁ జాలరు పొండు. అని వారి నంతఃపురమున కనిచి చతురంగ బలము లసంఖ్యాకములుగాఁ దన వెంట రాఁగాఁ జని మధురా నగరమును ముట్టడించెను. ఆ వార్త నాలించి శ్రీహరి తనలో

శా. ఐదు న్నాలుగు నాఱు రెండు నిరువూఁ డక్షోహిణుల్ చట్టి సం
ధానించెం బుర మెల్ల మాగధు నెడన్ సామంబు దానంబునం
భేదంబుం బనిలేదు దండవిధి శోభిల్లం బ్రయోగించి యీ
భూదేవీవర (వృథు) భార మెల్ల నుడుపం బోలున్ జయోద్భాసినై.

ఇంతియుఁ గాక,

క. ఏ నవతరించు టెల్లను, మానుగఁ జతురంతధరణిమండలభరముం
మాన్పుటకుం గాదే, పూనెద నిది మొదలు దగిలి భూభరముడుపన్.

అని తలంచి యాకసమున నుండి సపరికరములుగా వచ్చిన రథంబులను రెంటినిం గాంచి దైవయోగంబునఁ దనుం జేరవచ్చిన బలరాముని జూచి

శా. కంటే రామ? రథంబు లాయుధములుం గాఢప్రకాశంబులై
మింటన్ వచ్చెను వీఁక గైకొని సురల్ మెచ్చన్ నృపశ్రేణులన్
బంటింపం బనిలేదు చంపుదము ధరాభారంబు వారింప మీ
మెంటన్ నీ యవతారముల్ సఫలమౌ వేవేగ లెమ్మా జికిన్.

అని పలికి యన్నయుఁ దానును గవచాదిపరికరధరులై రణంబు
నకు వెడలిరి. శ్రీహరి రణాంగణమును జేరి పాంచజన్యమును
బూరింప మాగధుండు చేరవచ్చి శ్రీహరిం గని యనాదరంబున

సీ. అదలించి రొప్పంగ నాలమందలు గావు, గంధగజేంద్రసంఘములు గాని
పరికించి వినఁగ నంభారవంబులు గావు, వాజీంద్రహేషారవములు గాని
పదహతిఁ గూల్పంగఁ బ్రాఁతబండ్లివి కావు, నగసమానస్యందనములు కాని
ప్రియము లాడంగ నాభీరలోకముగాదు, కాలాభవైరివర్గంబు గాని
తే. యార్ప వనవహ్నిగాదు బాణాగ్ని గాని
మరియు బృందావనము గాదు మొనలు గాని
యమునఁ గాదు నటింప ఘోరాజి గాని
పోరు నీకేల గోపాల పొమ్ము పొమ్ము.

ఇఁకొక్కమాట విను.

మ. తరుణిం జంపుటయో బకుం గెడపుటో ధాత్రీజముల్ గూల్చుటో
ఖరముం ద్రుంచుటయో ఫణిం బఱపుటో గాలిన్ నిబంధించుటో
గిరి హస్తంబునఁ దాల్చుటో లయమహాగ్నిస్ఫారదుర్వారవు
ర్ఖరబాణావలి నెట్లు నిల్చెదవు సప్రాణుండవై గోపకా.

ఇంతతోఁ దృప్తి నీకుఁ గాదేని

సీ. గోపికావల్లకీఘోషణంబులు కావు సింజినీరవములు చెవుడుపఱచు
వల్లవీకరముక్తవారిధారలు గావు శరవృష్టిధారలు చక్కఁజేయుఁ
ఘోషాంగసాపాంగకుటిలాహతులుగావు నిశితాసినిహతులు నిగ్రహించ
నాభీరకామినీహస్తాబ్జములు గావు ముష్టిఘాతంబులు మురువు డించు
ఆ. నల్ల ప్రేపల్లె గాదు ఘోరావనీశ, మకరసంఘాతసంపూర్ణమగధరాజ
వాహినీసాగరం బిది వనజనేత్ర, నెఱసి నిను దిబికైవడి నేఁడు ముంచ

అని పలుక శ్రీహరియు వానిం దూలనాడెను. పోరు ఘోరం
బుగా సాగెను. బలరాముఁడు జరాసంధుం బట్టుకొని ముష్టి
ఘాతంబులఁ గంఠగతప్రాణుం జేసి చంప యత్నింప శ్రీహరి వల
దని వారించి మంచిమాటలాడి వాని సాగనంపెను. వాఁడు సిగ్గు
పడి యింటికిం బోయి మరలఁ జతురంగంబులం గూర్చుకొని
వచ్చి యోడిపోయె. ఇట్లు పదునేడుపర్యాయము లోడి పదు
నెనిమిదితడవలు యుద్ధమునకు రా నుద్యోగించుచుండెను.

అంతలో నారదముని కాలయవనుకడకుం బోయి "పరా
క్రమనిధీ! లోకమునఁ గల రాజుల నోడించితి నని డంబములు
పలుకుచుందువుగదా. యాదవులలో నొకవీరుఁడు ప్రతాపమున
నా కెదురు లే దని విఱ్ఱవీఁగుచుండ భీతిల్లితివో! ఏమో కాని
నీ వేల యుద్ధమునకుం బోవకున్నవాఁడ" వని హెచ్చరించెను.
వాఁడు సభలోనుండి వినుటచే మఱింత మండిపడి నారదమునీ!
ఆయాదవవీరునిమహత్త్వ మించుక వినిపింపుమా యని ప్రశ్నింప
నాముని

సీ. నీలజీమూతసన్నిభశరీరమువాఁడు తామరసాభనేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ బోలెడి మోమువాఁ డున్నతదీర్ఘబాహువులవాఁడు
శ్రీవత్సలాంఛనాంచితమహోరము వాఁడు కౌస్తుభమణిపదకంబువాఁడు
శ్రీకరపీతకౌశేయచేలమువాఁడు మకరకుండలదీప్తి మలయువాఁడు [డు.

తే. రాజ! యింతింతవాఁ డన రానివాఁడు, మెఱసి దిక్కుల నెల్లను మెఱయువాఁ
తెలిసి యే వేళలం దైన దిరుగువాఁడు, పట్టనేర్చినఁ గాని లోపడనివాఁడు.

అని పెక్కుభంగుల నుగ్గడించిన లెక్కింపక యారక్కసుండు
మూఁడుకోట్లయవనబలంబుల నెల్ల గూర్చుకొని మధురానగర
మును ముట్టడించెను.

శ్రీహరి తదాగమనంబు నెంచి మధురాపురము నిరంతర శత్రుబాధ్య మని తలంచి సముద్రమధ్యభాగంబున నొక్క నగరంబు నిర్మింప విశ్వకర్మ కాజ్ఞాపించి ద్వారవతి యను పేరు దానికి నిడి తనయోగప్రభావంబున మధురానగరవాసుల నందుఁ జేర్చి కృష్ణుం డొక్కరుఁడ నిరాయుధుండై మధురానగరము వెలువడి కాలయవనున కెదురుగాఁ బోయెను. వాఁ డాతనిం గాంచి యచ్చెరువంది తనయశ్వంబును బురికొలిపి కృష్ణునిపైఁ గవియఁ, బరుగిడుహరిం జూచి వాఁడు నవ్వుచు

మ. బలిమిన్ మాధవ! నేఁడు నిన్ను భువనప్రఖ్యాతిగాఁ బట్టుదున్
జలమున్ చొచ్చిన భూమిక్రిందఁ జనినన్ శైలంబుపై నెక్కినన్
బలిదండన్ విలసించినన్ వికృతరూపంబుం బ్రవేశించినన్
జలధిన్ దాఁటిన నగ్రజన్మహలికాశ్వాటాకృతుల్ తాల్చినన్.

అని పలుకుచుం బాఱినఁ బట్టుపడిన ట్లుండి పట్టుపడక వానిం దీసికొనిపోయి పోయి యొక గుహాంతరాళంబు నొచ్చి యదృశ్యుం డయ్యెను. అందు ముచుకుందుఁ డను యోగి నిద్రించుచుండెను. ఎవ్వఁ డాతనినిద్రకు భంగముచేయునో వాఁడు నశించును. ఆవిషయ మాహారి యెఱింగియే యదృశ్యుం డయ్యెను. కాలయవనుఁ డాతని హరింగాఁ దంచి యార్చుచుఁ గాలఁ దన్నెను.

ఉ. తన్నిన లేచి నీల్గి కనుఁదమ్ములు మెల్లన విచ్చి లోపలన్
సన్నపుఁ గిన్క వర్ధిల దిశల్ గని దృష్టిసమిద్ధవిగ్రహో
త్పన్నమహాగ్నికీలముల భస్మము చేసె నతండు సాయక
చ్ఛిన్నవిరోధికంతవను శ్రీభవనున్ యవనున్ లఘుక్రియన్.

అంతలో శ్రీహరి యాముచుకుందునెదుట నిల్చెను. అప్పుడా యోగి

సీ. వనరుహాలోచను వైజయంతీదాము శోభితు రాకేందుసుందరాస్యు
మకరకుండలకాంతి మహితగండస్థలుఁ గౌస్తుభాలంకృతు ఘనశరీరు
శ్రీవత్సలాంఛనాంచితవక్షు మృగరాజ మధ్యుఁ జతుర్బాహు మందహాసుఁ
గాంచనసన్నిభకౌశేయవాసు గాం భీర్యసౌందర్యశోభితుఁ బ్రసన్ను

ఆ. నమ్మహాత్ముఁ జూచి యాశ్చర్యమునుబొంది, తన్మనోజ్ఞదీప్తి దనకుఁ జూడ
నలవిగాక చకితుఁడై యొట్టకేలకుఁ, బలికెఁ బ్రీతి నవనిపాలకుండు.

మహాత్మా! పరమేశ్వరా!

ఉ. పూని యనేకజన్మములఁ బొంది తుదిం దనపుణ్యకర్మసం
తానము పేర్మిఁ గర్మవసుధాస్థలిఁ బుట్టి ప్రపూర్ణదేహుఁడై
మానవుఁడై గృహస్థుఁ బడు మాడుఁ దజంబు తృణాభిలాషియై
కానకపోయి నూతఁబడుమకైవడి నీపదభక్తిహీనుఁడై.

అని యనేకవిధంబుల వినుతించిన సంతసించి యతని కనేక వరంబు లొసంగి యంతర్ధానంబు నంది ద్వారవతిం జేరెను. అని పలికినఁ బరీక్షిన్నరేంద్రుఁడు యోగీంద్రుం గనుంగొని మహాత్మా! భగవంతునకు రుక్మిణీదేవి పత్నియయ్యె నని వింటిని. ఆమె లక్ష్మీదేవి యనియును నెఱింగితి. ఆగాథం దెలుపవే యని ప్రార్థించెను. శుకయోగి సంతసంబున రాజేంద్రా! చక్కనిప్రశ్న మొనరించితివి. విను మావివాహకథ వినిపించెద.

## రుక్మిణీకల్యాణము

విదర్భదేశమునఁ గుండిననగరము గలదు. భీష్మకుం డను రాజు తత్పురమును బాలించుచుండెను. ఆతని కేవురు కొడు

షులు, ఒక్కపుత్రికయుఁ గలదు. ఆమెయె కడగొట్టు చెల్లెలు. ఆమెపేరు రుక్మిణి. ఆకన్నియ దినదినప్రవర్ధమానయై బాలేందు రేఖవలె నుండెను. కొంత కాలమునకు

సీ. దేవకీసుతుకోర్కి తీఁగెలు వీడంగ
        వెలఁదికి మైఁదీఁగె వీడఁదొడఁగె
గమలనాభునిచిత్తకమలంబు వికసింపఁ
        గాంతి నింతికి ముఖకమల మొప్పె
మధువిరోధికి లోన మదనాగ్ని పొడచూపఁ
        బోలఁతికిఁ జనుదోయి పొడవు చూపె
శౌరికి ధైర్యంబు సన్నమై డయ్యంగ
        జలజాక్షిమధ్యంబు సన్నమయ్యె

ఆ. హరికిఁ బ్రేమబంధ మధికంబుగాఁ గేశ
బంధ మధిక మగుచు బాల కమరెఁ
బద్మనయనువలనఁ బ్రమదంబు నిండార
నెలఁతయౌవనంబు నిండియుండె.

ఈమె యన్నలు రుక్మి రుక్మిరథ రుక్మబాహు రుక్మకేశ రుక్మనేత్రు లనువారు. ఆరుక్మిణి తండ్రిగృహమునకు వచ్చు నతిథిజనులవలన శ్రీకృష్ణుని రూపగుణశౌర్యాదుల విని యా హరిని పెండ్లియాడ మదిఁగోరెను. బంధువు లామెభావ మెఱింగి సంతోషించిరి. అన్న యగు రుక్మిమాత్రము శిశుపాలున కొసంగ నిశ్చయించి వార్త నంపెను. తలిదండ్రు లాతని నేమనఁ జాలక యూరకుండిరి. కొలఁదికాలమునకు వివాహము సాగు నను వార్త రుక్మిణిచెవుల సోఁకెను. ఆమెపరితాపమునొంది యొక్క బ్రాహ్మణప్రవరుని విశ్వాసపాత్రునిం బిలిచి శ్రీహరికి నాయ

భీష్మకుని నెఱింగించి రమ్మని యటఁ జెప్పఁదగుమాటలు చెప్పి పంపెను. ఆభూసురుఁడు ద్వారవతికిం బోయి శ్రీహరిని దర్శించి సత్కారము లొంది కుశలప్రశ్నానంతరము రుక్మిణీదేవివచనములుగా

సీ. ఏనీ గుణములు కర్ణేంద్రియంబులు సోఁక దేహతాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల కఖిలార్థలాభంబు లమరుచుండు
నే నీచరణసేవ లేప్రొద్దు చేసిన భువనోన్నతత్వంబుఁ బొందఁ గలుగు
నే నీశుభనామ మేప్రొద్దు భక్తితోఁ దడవిన బంధసంతతులు వాయు
తే. నట్టి నీయందు నాచిత్త మనవరతము, నచ్చియున్నది నీయాన నాన లేదు
కరుణఁ జూడుము కంసారి ఖలవిదారి, శ్రీయుతాకార మానినీ చిత్తచోర.

శ్రీకృష్ణా! దీనబంధూ!

ఉ. శ్రీయుతమూర్తి యో పురుషసింహమ సింహముపాలిసొమ్ము గో
మాయువు గోరుచందమున మత్తుఁడు చైద్యుఁడు నీపదాంబుజ
ధ్యాయిని యైన నన్ను వడిఁ దాఁ గొనిపోయెద నంచు నున్నవాఁ
డాయధమాధముం డెఱుఁగఁ డద్భుతమైన భవత్ప్రతాపమున్.

ప్రాణేశా! వేసరక నాయీదీనాలాపమును మఱొక్కదాని నాలకింపుము.

ఉ. అంకిలి చెప్పలేదు చతురంగబలంబులతోడ సెల్లి యో
పంకజనాభ నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షసవివాహమునన్ భవదీయశౌర్యమే
యంకువ చేసి కృష్ణ పురుషోత్తమ! చేకొనిపొమ్ము వచ్చెదన్.

శ్రీహరీ! యిట్లు రుక్మిణీకన్యకామణి మనవి చేయఁబంపెను. నా యందుఁ గల ప్రీతిని దీనురాలగు తత్కన్యకామణియందలి

ప్రేమను దయచేసి శిశుపాలాదుల నోడించి యామెకోరికను ఫలింపఁజేయుము. మహాత్మా! ఆమె చెప్పినమాటలలో నొక్క వాక్యమును మఱియు విన్నవింతు. అవధరింపుఁడు.

సీ. ప్రాణేశ! నీమంజుభాషలు వినలేని
కర్ణరంధ్రంబులకలిమి యేల
పురుషరత్నమ! నీవు భోగింపఁగాలేని
తనులతవలసిసౌందర్య మేల
భువనమోహన నిన్నుఁ జూడఁగానఁగా లేని
చక్షురింద్రియములసత్త్వ మేల
దయిత నీయధరామృతం బానఁగా లేని
జిహ్వకు ఫలరససిద్ధియేల
ఆ. నీరజాతనయన నీవనమాలికా, గంధ మబ్బ లేని ఘ్రాణ మేల
ధన్యచరిత నీకు దాస్యంబు చేయని, జన్మ మేల యెన్ని జన్మములకు.

శ్రీహరీ! ఆదినారాయణా! ఇట్లు మొఱ్ఱపెట్టు రుక్మిణియాలాపంబులచెవ సాలంబు చేయక యనుగ్రహింపుఁ డని తెలిపి యామె యసమానరూపసద్గుణాదుల వర్ణించి గోపాలబాలుని యాంధృతి నెఱింగి వచ్చి వివాహము చేసికొందునన్న సత్యవాక్యమును గైకొని బహువిధసమ్మానముల నంది రుక్మిణి కవ్వార్త నెఱింగింపం బోయెను.

అచ్చట వివాహప్రయత్నము చేయఁబడిరెను. శిశుపాలాదులు చతురంగబలములు సముద్రములభంగి ఘూర్ణిల్ల వచ్చి కుండినపురమును జేరిరి. శిశుపాలుని ప్రతిపక్షుల నడంచుపొంటె జరాసంధప్రభృతులు పెక్కుసేనలతో వచ్చి పురము నిండించిరి. శ్రీహరియు నావిప్రునిం బంపి దారుకసన్నద్ధరథవర్యము

నధిష్ఠించి కుండినమునకుం బయనమయ్యెను.॥ బలరామాదులు యాదవవాహినీసాగరపరివృతులై శ్రీహరికి సాయ మొనరింపఁ గూడఁ బోయిరి.

అంతలో రుక్మిణి శిశుపాలురాక నెఱింగి వివాహశుభ దిన మరుదేర భీతిల్లి వివాహము తప్పక సాగఁగల దను వ్యథను మది గుందఁగాఁ దనలో,

మ. ఘనుఁ డాభూసురుఁ డేగెనో నడుమ మార్గశ్రాంతుఁడై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగాఁ దలఁచెనో విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింపఁ దలంచునో కలఁడో యార్యామహాదేవియుం గా
నను రక్షింప నెఱుంగునో యెఱుఁగనో నాభాగ్య మెట్లున్నదో.

అని పలుభంగులఁ బరితపించుచుండునంతలో, ఆ బ్రాహ్మణుండు వచ్చి రుక్మిణీదేవి దుఃఖంబు పోవునట్లుగా శ్రీకృష్ణుని రాకం దెల్పెను. ఆమె నిర్భరానందమున దేహము తెలియక యించుక సేపుండి యానందాశ్రువులు ధారలై ప్రవహించుచుండఁగా

మ. జలజాతేక్షణుఁ దోడి తెచ్చితివి నా సందేశముం జెప్పి న
న్నిలువం బెట్టితి నీకృపన్ బ్రదికితిన్ నీయంతపుణ్యాత్మకుల్
కలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింపఁగా నేర నం
జలి గావించెద భూసురాన్వయమణీ సద్బంధుచింతామణీ.

ఇట్లు లోకన్యకామణి నమస్కరింప నాభూసురుండు పరమా నంద మందెను. అంతలో శ్రీహరిప్రభృతులు నగరముఁ జొచ్చిరి. రుక్మిణి యలంకృతయై కులమర్యాద ననుసరించి పార్వతీ దర్శనమునకు ముత్తైదువులు తోడఁ గా నరిగి దేవాలయముఁ

జొచ్చి సాష్టాంగముగాఁ బ్రణమిల్లి భక్తివినయసంతోషములతో హస్తముల ముకుళించి నిలువంబడి నిశ్చలచిత్తముతో

ఉ. నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ముఁ బురాణదంపతుల మేలు భజింతుఁ గదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరిం బతి చేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నటికి నాశము లేదు గదమ్మ యీశ్వరీ.

అని మ్రొక్కి తత్పదాంబుజముల స్పృశించి మరలెను. త్రోవనే శ్రీహరి యామెరాకకై వేచియుండెను. రుక్మిణి మార్గమున నున్న రాజులం గాంచుచు విఫలమనోరథ యగుచుఁ గొంత దూరము మార్గముఁ గడచి వచ్చి యెక్కుచోఁ దనకోరికలు ఫలింప,

మ. కనియెన్ రుక్మిణి చంద్రమండలముఖున్ కంఠీరవేంద్రావల
గ్నునవాంభోజదళాక్షుఁ జారుతరవక్షున్ మేఘసంకాశదే
హు నగారాతిగజేంద్రహస్తనిభబాహుం జక్రిఁ బీతాంబరున్
ఘనభూషాన్వితుఁ గంబుకంఠు విజయోత్కంఠున్ జగన్మోహనున్.

కని పరమానందంబుఁ బొందుచుండునంతలో శ్రీహరి యామెను తనరథంబుపై నిడుకొని ద్వారకానగరమార్గంబుఁ బట్టి చనుచుండ రాజు లోర్వఁజాలక యొండొరులం బురికొల్పుకొనుచు మార్కొనిరి. బలరామాదులు కొందఱను శ్రీహరి కొందఱను జక్కుపఱచిరి. శిశుపాలుఁడు చేయునది లేక యూరకుండ రాజు లాశ్వాసించిరి. అందఱు వెనుకకు మరలిరి. రుక్మి యాగ్రహించి శ్రీకృష్ణుని మార్కొని పరాభవంబు నొందెను. రుక్మిణీదేవి ప్రార్థింప నాతనిం జంపక శ్రీహరి విడిచిపుచ్చెను. ద్వార

కానగరంబున గోపాలబాలుఁడు బంధుజనులు హర్షింప సాధు రాజలోకంబు కీర్తింప మహామును లాశీర్వదింప దివిజాలు వినుతింప మహావైభవంబున

మ. భువనకీర్తిం హరి పెండ్లియాడె నిజచేతోహారిణిన్ మానవై
భవగాంభీర్యవిహారిణిన్ నిఖిలసంపత్కారిణిన్ సాధుబాం
ధవసత్కారిణి బుణ్యచారిణి మహాదారిద్ర్యసంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీచూడామణిన్ రుక్మిణిన్.

ఆవివాహమునకు దుష్టరాజులు తప్పఁ దక్కనభూపాలురు వచ్చి సత్కృతులై తమతమనెలవుల కరిగిరి. నారదాదిమును లాది లక్ష్మీదేవ్యంశసంభూతురాలు రుక్మిణి రుక్మిణి యని పొగడిరి. ఎవరియానందమునకును మేర లేకుండెను.

ఇది దశమస్కంధమునఁ బూర్వభాగము.



# దశమస్కంధము

## ఉత్తరభాగము

శ్రీకృష్ణునకు రుక్మిణి, జాంబవతి, సత్యభామ, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ యనునామంబులం బరగు నెనమండ్రుగురు నారీరత్నములు భార్యలైరి. శ్రీహరి వారందఱం గూడి ద్వారకానగరంబున వసించి దినములం గాపాడుచుండెను. అని శుకయోగి తెలుపగా నిట్లు ప్రశ్నించెను. మహాత్మా! సత్యభామ హరిం గూడి నరకాసురునితో యుద్ధముచేసె నని వింటిని. దానిని వినఁగోరెద నన యోగి యిట్లు పలికెను. రాజా! వినుము. ఇంద్రుఁడు నరకాసురుని బాధపడఁజాలక శ్రీహరితో విన్నవించెను. హరియు వానిం జంప వాగ్దానము నొసంగెను. లోక కంటకుని వాని వధింపఁగా సమకట్టి కృష్ణుఁడు గరుడవాహ నారూఢుండై చనుసమయంబున సత్యభామ ప్రాణనాథుం జేరి నీవెంట నన్నుం దోడ్కొనిపొమ్మా యని ప్రార్థించుచు నీయుద్ధ ప్రావీణ్యమును గన్నులారఁ గాంచి తక్కుంగల దేవీసమూహ మునకుం దెల్పుదు ననియుఁ దెల్పెను. ఆమాట లాలకించి దరహాసితాననుండై ప్రాణవల్లభుం గాంచి

సీ. సమదపుష్పంధయఝంకారములు గావు, భీషణకుంభీంద్ర బృంహితములు
వాయునిర్ధూతపద్మవనరేణువులు గావు, తురగరింఖాముఖోద్ధూతరజములు
లాకీర్ణజలతరంగాసారములు గావు, శత్రుధనుర్ముక్తసాయకములు
కలహంససారసకాసారములు గావు, దనుజేంద్రసైన్యకదంబకములు.

తే. కమలకష్టోరకుసుమసంఘములు గావు, చటులరిపుశరాలఖడ్గాదిసాధనములు
రవ్య నీవేడ రణరంగగమన మేడ, వత్తు వేగమ నిలువుము వలదు వలదు.

అని యెంతచెప్పినను వినక మఱిమఱి ప్రార్థింప నెట్టకేల కంగీక రించి పిలుచుకొని నరకాసురునగరం బాక్రమించిన నరకాసు రుండు హరి మార్కొన రాఁగా సత్యభామ లేచి యుద్ధోన్ము ఖురా లగుటం గాంచి కృష్ణుఁడు తనశరాసనం బొసంగెను. ఆమెయుఁ జాపంబుఁగొని గుణంబు సారించి

సీ. సౌవర్ణకంకణఝణఝణధ్వనదంబు, శింజినీరవముతోఁ జెలిమి చేయఁ
దాటంకమణిగణధగధగదీప్తులు, గండమండలరుచిఁ గప్పికొనఁగ
ధవళతరాపాంగధళధళరోచులు, బాణజాలప్రభాపటలి నడఁప
శరపాతఘుమఘుమశబ్దంబు పరిపంథి, సైనికకలకలస్వనము నుడుప

తే. వీరశృంగారభయరౌద్రవిస్మయములు
గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
విషువు దొడుగుట తివుచుట యేమియుంటెల్ల
నెఱుఁగరాకుండ నని చేసె నిందువదన.

ఆమహాయుద్ధసమయమందు

మ. పరుఁ జూచున్ వరుఁ జూచు నొంప నలరింపన్ రోషరాగోదయా
విరత భ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారముల్
జరగన్ గన్నులకెంపు సొంపుఁ బరఁగన్ జండాస్త్రసందోహముల్
సరసాలోకసమూహముల్ నెఱపుచుం జంద్రాస్య హేలాగతిన్.

ఆయుద్ధనైపుణ్యము చూచుచున్న శ్రీకృష్ణున కానందబాష్పము లెడతెగక ప్రవహింప సాగెను. ప్రియ యిట్లు శత్రుభయంకర ముగా సమరకేళి సల్పుతఱిఁ బుండరీకాక్షుండు తనమనంబున

సీ. వీణెఁ జెక్కఁగఁ బట్ట వెరవెఱుంగని కొమ్మ
బాణాసనం బెట్టుఁ బట్ట నేర్చె
ప్రాఁకుసఁ దీఁగెఁ గూర్పంగ నేరని లేమ
గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
సరవి ముత్యము గ్రువ్వఁ జాలని యబల యే
నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబుఁ జెప్ప నేరని తన్వి
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ
ఆ. బలుకు మనినఁ బెక్కు పలుకని ముగుదవే, గతి నొనర్చె సింహగర్జనములు
వనిత మెఱసెఁ ద్రిజగదభిరామ, గుణధామ చారు సత్యభామ సత్యభామ.

అత్తఱి నాసాధ్వీమణి ప్రావృట్కాలమేఘాకృతిగఁ దనయాకృతి కనఁబడఁజేయుచు బాణవృష్టి నరివీరుని ముంచుచుండెను.

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు, నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై, యలరుఁబూఁబోఁడి చేలాంచలంబు
భావజుపరిధియై ప్రళయార్కపరిధియై, మెఱయు నాకృష్టమై మెలఁత చాప
మమృతప్రవాహమై యనలసందోహమై, తనరారు నింతి సందర్శనంబు
ఆ. హర్షదాయియై మహారోషదాయియై, పరఁగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార, వీరరసము లొలికి విస్తరిల్లె.

ఆబాణవృష్టి కోర్వఁజాలక సైన్యంబంతయు నరకాసురుని వెనుకఁ జొచ్చెను. ఆకార్యమున కానందించి హరి పరమాదరంబున సత్యభామం గాంచి ధనుస్సు నందుకొని నరకాసురునితో యుద్ధము చేయఁబూనెను. ఆమహాహవంబు భయంకరముగా నుండెను. హరిచక్రము నరకునిశిరసును ఖండించెను. భూదేవి పురుషోత్తముని వినుతించిన సుప్రీతుండై నరకపుత్త్రుం

డగు భగదత్తున కభయహస్తం బొసంగి కారాగారంబున నున్న వారల విముక్తులనుగా నొనరించి హరి ద్వారకానగరంబు చేరి సుఖంబుండెను. అని శుకయోగి పరీక్షిత్తునకుం జెప్పి మరల నిట్లు పలికెను.

మహారాజా! వినుము. శ్రీకృష్ణుగాథల వినిపించెద. బలిచక్రవర్తి పుత్రులు నూర్వురు గలరు. వారిలో బాణాసురుఁడు బలశాలి. వాఁడీశ్వరుంగూర్చి ఘోరతప స్సొనరించినఁ బ్రత్యక్షమైన శివుం డాదరించి వరముం గోరుమన్న వాఁడు గర్వంబున నాభుజాబలము నోర్వఁగలవాఁడ వీవుదక్క నొం డెవ్వఁడైన గలఁడే యని పలికిన నీశ్వరుం డించుక యసూయం జెంది యతనితో,

క. విను మాధవహృదయ నీకే, తన మెప్పు డకారణంబ ధారణిపైఁ గూ
లునో యపుడు నీభుజావలి, దునియఁగ నాయంతవానితో నని కల్గున్.

అని పలికి యంతర్హితుం డయ్యెను.

## ఉషాకన్యచరిత్రము

ఆబాణాసురున కొక్క కూఁతురు గలదు. ఉషాకన్య యని యామె నందఱు పిలుతురు. రూపమున నామె కామెయే సాటి. ఆలలనాతిలక మొకనాఁడు సురుచిరసౌధోపరిభాగంబున శయనించి నిదురించుచుండ నెన్నఁడేఁ గన్నది విన్నదిగాని సౌందర్యమున విఱ్ఱవీఁగుసీటుకాఁ డొకఁడు కనఁబడి తనతోఁ గ్రీడించినట్లు కలఁగనియె. వెంటనే మేల్కాంచి నిజప్రాణేశ్వరుం డగపడమిఁ జింతిల్లుచు బయ లప్పళించుచు వెఱ్ఱియెత్తిన దానిచందమున నుండెను. ఆమె కొక నెచ్చెలి గలదు. దాని

పేరు చిత్రరేఖ యని. ఆచెలికత్తియ యొకనాఁ డుషాకన్య యిట్లుండ నేల యని యూహించి చెంతకుంబోయి

తే. వనిత నాకన్న నెనరైన వారు నీకుఁ, గలుగ నేర్తురె నీకోర్కి, దెలియఁ జెప్పు
కన్న మాయన్న తోఁడన్నఁ గన్నఁ గవఁ, నలరు మసుసిగ్గుతోఁ నగ వాదరింప.

కలలోనివృత్తాంత మంతయు దెలియుం బల్కి తనచింతం దెల్పెను. చిత్రరేఖయు నవ్వి

చ. సరసిజనేత్ర యేటికి విచారము నాకుశలత్వ మేర్పడన్
నరసురయక్షకింపురుషనాగఖభశ్వరసిద్ధసాధ్యకి
న్నరవరముఖ్యులం బటమునన్ లిఖియించినఁ జూచి నీమనో
హరుఁ గని వీఁడె పొమ్మనిన నప్పుడె వానిని నీకుఁ దెచ్చెదన్.

అని యొడంబఱచి తన నేర్పు మెఱయ స్వర్గమర్త్యపాతాళలోక వాసుల సుందరాకారుల నొక్కపటంబున విలిఖించి తెచ్చి సౌధాంతరంబున నుషాకన్యక యెదుటఁ బెట్టి వేఱువేఱ వారి పేరు లుగ్గడించి చెప్పెను. స్వర్గలోకవసతులను, పాతాళలోక వాసులను జేర్కొని మర్త్యలోకస్థులఁ జాలమంది నుగ్గడించుచు నామెసమ్మతిం గానక హలాయుధుం జూపి తద్గుణంబు లుగ్గడించి యామె సంప్రీతి నాదరింపమి నవ్వల

సీ. కమనీయశుభగాత్రుఁ గంజాతదళనేత్రు, వసుధాకళత్రుఁ బావనచరిత్రు
సత్యసంకల్పు నిశాచరోగ్రవికల్పు, నతపన్నగాకల్పు నాగతల్పుఁ
గౌస్తుభమణిభూషు గంభీరమృదుభాషు, శ్రితజనపోషు నంచితవిశేషు
నీలనీరదకాయుఁ నిర్జితదైత్యేయుఁ, ధృతపీతకౌశేయుఁ నతవిధేయుఁ
తే. నఘనుమహాగదవైద్యు వేదాంతవేద్యు, దివ్యమునిసన్నుతామోఘు దీర్ఘబాహు
జిష్ణు వరసద్గుణాలంకరిష్ణుఁ గృష్ణుఁ, జూడు దైతేయకులబాలసుభగలీల.

అమ్మా ! ఈమహానుభావుఁడు కృష్ణకుమారుఁ డని యవ్వాలి వానిం గనఁబఱచుచు

చ. స్ఫురదళిశింజినీరవవిభూషితపుష్పధనుర్విముక్త భా
స్వరనవచూతకోరకనిశాతశిలీముఖపాతభీకపం
కరుహాభవాటిచేతననికాయము మనోజనిజాంశు రుక్మిణీ
వరసుతు రాజకీరపరివారుని మారుని జూడు కోమలీ.

అని చెప్పుచుండఁగనే యుషాకన్యమేను గగుర్పాటు నొందెను. నేత్రపద్మములు వికసించెను. అధర మల్లలనాడెను. ఆ రూపమును బరితాపభరంబునం గాంచికాంచి యల్లన

ఉ. ఇంతి మదీయమానధన మెల్ల హరించిన ముచ్చు నిమ్మెయిం
బంత మెలర్పవ్రాసి పటభాగనిరూపితుఁ జేసి నట్టి నీ
యంతటి పుణ్యమూర్తిఁ గొనియాడఁగ నేర్తునె నీచరిత్రముల్
వింతలె నాకు నీమహితపేరుకులంబుబలంబుఁ జెప్పుమా.

అని ప్రశ్నించెను. చిత్రరేఖయుఁ బూసగూర్చినట్లు తచ్చరిత్ర మంతయుఁ జెప్పెను. పిదప వీని నతివేగమ తెచ్చి నీకడ నునిచెదం జూడు మని చనియెను.

ఆర్యబాలకులారా ! చిత్రరేఖ సకలలోకవాసులఁ బటంబున లిఖించి తెచ్చుట యతిశయోక్తిగా మీకుఁ దోఁపవచ్చును. కాని యది పూర్వకాలమున సహజము. ఈకాలమున విచిత్రముగఁ దోఁచువిషయములు మున్ను మిగుల సులభకార్యములన నమ్ముఁడు. మనరాజకుటుంబములలో నందఱు రాణులు తత్సఖీజనము చిత్రలేఖనమున మిగుల నేర్పు గలవారు. కాళిదాసాదిమహాకవులు నాటకములందు పురుషునిం జూచినంతనే చిత్రఫలకమున విలిఖించినట్లు వ్రాసియున్నవారు. ఆయాచా

రము లేకపోయినచో నట్లు వ్రాయఁగలరా? లోకమునలేని పదార్థముల పేరులు చెప్పువా రుండరు కదా. అట్లే చిత్రరేఖ స్వర్గ పాతాళలోకవాసుల గ్రంథములం బట్టియు మర్త్యలోకవాసులఁ జాఁజూచినట్లు విన్నయట్లు లిఖించె ననుటలో శంకనొందఁదగిన పనియేఁ లేదు. చిత్రరేఖ చమత్కృతిం జూపి మంత్రశక్తి నతనిం గొని తెచ్చుటయు విచిత్రముకాదు. ఈకాలమున మన వారిలో నట్టిమంత్రశక్తి, క్రియాశక్తి లోపించినందునఁ బూర్వ చరిత్రమున శంక తోఁచునంతటిస్థితి గల్గుచున్నందులకే దుఃఖింపవలయుంగాని పూర్వ మిట్టిశక్తి యుండెనా యని వింతనొందఁ బనియే లేదు. ఇఁకఁ గథ వినుఁడు.

చిత్రరేఖ యట్లు పోయి ద్వారవతిం జొచ్చి యొరు లెఱుంగకుండఁ దనశరీరమును మంత్రబలమున మఱుగు కల్పించుకొని సౌధోపరిభాగంబున మృదులతరపుష్పశయ్య నిదురించియున్న ననిరుద్ధకుమారుం గొని శోణపురంబున కరుదెంచి యుషాకన్యయున్న సౌధోర్ధ్వభాగంబున నామెహంస తూలికాతల్పంబున నునిచి యావృత్తాంత మెఱింగించి సెలవంది చనిరెను. ఆవల వారిరువురు మనస్సులలర మాటలాడుచుండిరి. కొంతకాల మీలాగు కాలము సాగెను. కాకొమరిత చూలా లయ్యెను. ఆవార్త దౌవారికు లెట్లో యెఱింగి బాణాసురునకుం జెల్పిరి. వాఁడాగ్రహించి చనుదెంచి దృఢపాశనిబద్ధుం జేసి యనిరుద్ధకుమారుని కారాగారమున నుంపఁ బంచెను. కొలఁదిదినము లిట్లు సాగఁగా నారదముని ద్వారవతికిం బోయి శ్రీహరి దర్శించి యనిరుద్ధకుమారువార్తం దెల్పెను. శ్రీహరి తా నెఱింగియుండియు నెఱుంగనట్లు నారదు

వలన విని చతురంగబలంబుల వెలువడ నియమించి శోణనగ
రంబుమీఁదికి దండయాత్ర సాగఁ బంచెను.

యాదవబలంబులు శోణనగరంబుఁ జేరెను. ఆపురమున
బాణాసురునిపక్షమున శివగణములు యుద్ధమునకు వెడలెను.
పోరు ఘోర మయ్యెను. సమరమున శ్రీకృష్ణుఁడు బాణాసురుని
హస్తపంక్తి ఖండించెను. నాల్గుచేతులు మిగిలియుండఁగా శంకరుఁ
డరుదెంచి శ్రీకృష్ణునిం బొగడెను. హరి యానందించి

క. కరములు నాలుగు చిక్కెం, బరిమార్చితి వీఁడు నీదు భక్తుల కగ్రే
సరుఁడై పొగడొందె జరా, మరణాదిభయంబు దక్కె మను నిటమీఁదన్

అని వరం బిచ్చి యుషాకన్యాసహితంబుగా ననిరుద్ధుం దోడు
కొని ద్వారవతి కరిగి యుషాకన్య నాదరించి విమలమణి
భూషాంబరంబు లొసంగి సంతుష్టం జేసి తాను బుత్రయు
తుండై సుఖం బుండెను.

కొంతకాలమునకు నృగమహారాజు శాపంబున నూసర
వెల్లియై యుండ శ్రీహరి యాతనిశాపంబునకు ముక్తిం బ్రసా
దించి పౌండ్రకవాసుదేవుం డనుదుష్టభూపతి వధించెను. బల
రాముండు ద్వివిదుఁ డను వానరు నతిదుష్టాత్ముని బొరిఁగొని
యెను. అని పలికి శుకయోగి రాజున కిట్లు చెప్పెను.

## నారదముని శ్రీకృష్ణునిమహిమఁ బరీక్షించుట

నరకాసురుం జంపినపిదప శ్రీహరి వానియింటనున్న
పదాఱువేలసుందరీమణులఁ బెండ్లియాడి యందఱకన్నిరూపులై
తనరూపము వెలుంగ నుండెను. ఈవార్త నారదుఁ డాల
కించి దీనిం బరీక్షింపవలయు నని మనంబున నెంచి వీణాపాణియై

ద్వారవతికిం బోయి యొక్కసుందరాంగియింట శ్రీహరిం దిలకించెను. వేఱొక కమలాక్షియింట నట్లే కాంచెను. దివ్యదృష్టిం బరికింప శ్రీకృష్ణుఁ డేక కాలంబునఁ బదాఱువేలసుందరుల కడ నొక్కవిధమున నుండెను. ఆయద్భుతరహస్యంబున కచ్చెరువంది కరములు ముకుళించి

క. నీమాయఁ దెలియంవారలె, తామరసాసనసురేంద్రతాపసులైనన్
ధీమంతులు నీభక్తిసు, ధామాధుర్యమునఁ బొదలు ధన్యులు దక్కన్.

అని కొనియాడి తనదారిం బోయెను.

ఆవల శ్రీహరి ధర్మరాజుచే రాజసూయమును జేయించి దంతవక్త్రునింబరిమార్చి తనప్రతాపము సాధుజనానందకరమగున ట్లొనరించెను. ద్వారకానగరమును బ్రవేశించి బలభద్రసహితుఁడై సుఖం బుండెను.

## కుచేలోపాఖ్యానము

అని పలుక విని పరీక్షిన్నరేంద్రుఁడు శుకయోగివర్యుం జూచి

చ. హరి భజియించుహస్తములు హస్తము లచ్యుతుఁగోరి మ్రొక్కుత
చ్ఛిరము శిరంబు చక్రధరుఁ జేరినచిత్తము చిత్త మిందిరా
వరుఁ గనుదృష్టి దృష్టి మురవైరి నుతించినవాణి వాణి య
ఈరుకథ లానుకర్ణములు కర్ణములై విలసిల్లుఁ బో భువిన్.

కాఁబట్టి,

క. హరిపాదతీర్థసేవా, పరుఁడై విలసిల్లునట్టి భాగవతులవి
స్ఫురితాంగము లంగము లా, పరమేశ్వరు దెలుఁగ నాతఁ బలుకు మునీంద్రా.

అన విని యోగీంద్రుఁ డారాజేంద్రు నాదరంబునం జూచి నీయడిగిన ప్రశ్నమున కుదాహరణముగా నొక్కపరమభాగవతశేఖరుని చరిత్రము వచింతు. ఆలకింపు మని చెప్పఁ దొడఁగెను.

శ్రీహరిసఖుఁడు కుచేలుఁ డనుభూసురుఁడు కలఁడు. పరమశాంతుఁడై జ్ఞానియై యోగియై సంసారబంధములం జిక్కక జితేంద్రియుఁడై యతఁ డుండు. ఎంత దారిద్ర్యము తన్ను బాధించుచున్నను దాని కతఁడు లొంగక యొరుల దీనవృత్తి యాచింపఁ బోక లభించిన యల్పవస్తువును మేరువుగా భావించి సంసారయాత్ర సాగించుచుండును. ఆతనికి సత్కులప్రసూత యమలస్వాంత భార్య కలదు. ఆమె పతివ్రతాశిరోమణి యను విఖ్యాతిం గాంచెను. పెక్కుమంది పుత్రు లామెకుం గల్గిరి. వారెల్ల క్షుద్బాధచేఁ గలఁగి తన్నుఁ జేరి, అమ్మా! అన్నము పెట్టుమాయని ఆకులు చేతులలోనునుచుకొని వేఁడఁగా నామాటలు తనకర్ణరంధ్రముల బ్రద్దలు చేయ బదులు చెప్పఁజాలక పెట్టఁ బదార్థము లేక దుఃఖించుచుండుట యామెకు వాడుకయే గాని యొక్కనాటిది కాదు. క్రొత్తదియుఁ గాదు. పాప మాసాధ్వి యెంతకాల మూరకుండఁ గలదు? ఒక్కనాఁడు ప్రాణనాథుం జేరి "జీవితేశ, తట్టుముట్టాడు నిట్టి పేదఱిక మిట్లు నొంప దీని కుపాయ మూహింప వైతి" అని వేఁడుచు

తే. బాలసఖుఁడైన యప్పద్మపత్రనేత్రుఁ, గాన నేఁగి దారిద్ర్యాంధకారమగ్ను
లైన మ మ్ముద్ధరింపుము హరి కృపాక, టాక్షరవిదీప్తిఁ బడసిమహాత్మ! నీవుఁ

అనియుఁ బ్రార్థించెను. అంతతో నూరకుండక బాలురం దలంచు. కొని కడుపు బగ్గు మనఁగా, మహాత్మా!

మ. కలలోనం దను మున్నెఱుంగని మహాకష్టాత్ముఁ డైనట్టి దు
ర్బలుఁ డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులోఁ
దలఁపం దోడనె మెచ్చి యార్తిహరుఁడై తన్నైన నిచ్చున్ మని
శ్చలభక్తిన్ భజియించువారి కిడఁడే సంపద్విశేషోన్నతుల్.

ఆకర్ణనమున సమ్మృతధారలవలె నాపలుకులు శ్రుతుల సోకఁగా నలరి శ్రీకృష్ణునిఁ జూడఁబోవుట యిహపరసాధన మని తలంచి సాధ్విం గాంచి

తే. నీవు చెప్పినయట్ల రాజీవనేత్రు, పాదపద్మంబు లాశ్రయింపఁగ జనట
పరమశోభన మాచక్రపాణి కిపుడు, కాను కేమైనఁ గొంపోవఁగలదె మనకు!

అని పలుకఁగా విని సంతోషమున నాయింతిమిన్న విభునికొంగున నడుకులు మూటఁగట్టి పయనము చేయింప నమ్ముని ద్వారకకుం బోవుచు, ద్వారవతికిం బోయిన నంతఃపురమునకుం బోనిత్తురో దౌవారికు లడ్డుపెట్టుదురో యని పలుభంగులఁ జింతించుచుఁ బోయెను. ఎట్లో ద్వారవతిం జేరెను. రాజగృహమును బ్రవేశించెను. అందొకరమ్యతల్పంబున రుక్మిణి పాదము లొత్త బరుండియున్న పుండరీకాక్షుని

సీ. ఇందీవరశ్యాము వందితసుత్రాముఁ, గరుణాలవాలు భాసురకపోలు
గౌస్తుభాలంకారుఁ గామితమందారు, సురుచిరలావణ్యు సురశరణ్యు
హార్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు, ఘనచక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగకులాధిపయానుఁ గౌశేయపరిధానుఁ, బన్నగశయను నబ్జాతనయను

తే. మకరకుండలసద్భూషు మంజుభాషు
నిరుపమాకారు దుగ్ధసాగరవిహారు
భూరిగుణసాంద్రు యదుకులాంభోధిచంద్రు
విష్ణు రోచిష్ణు జిష్ణు సహిష్ణుఁ గృష్ణు.

కన్నులారఁ గాంచి సమీపమునకుఁ బోవునంతలో శ్రీహరి దిగ్గున లేచి తల్పముునుండి డిగి యెదురు చని బంధుస్నేహమునఁ గౌఁగిలించుకొని పరమాదృతిఁ దనతల్పమునఁ గూరుచుండఁ జేసెను. పరిమళవస్తుమిళితచందనములంది మార్గశ్రమము పాయునట్లు తాళవృంతమున విసరి ధూప మొసఁగి మణిగణదీపముల నివాళించి తాంబూలం బిడి సురభికుసుమంబులు సిగముడి నలంకరించి స్వాగతం బడిగి గారవించెను.

ఇట్లనూనప్రేమమున గారవింపఁగా నాపేదవిప్రుఁడు మేనం బులకాంకురంబు లంకురింప మహానందసాగరమ్మున మునింగియుండెను. అంతలో శ్రీహరి ప్రియపత్ని రుక్మిణి చామరము చేనంది విసరుచునిలువంబడెను. ఆయద్భుతగౌరవప్రీతులం జూపుటఁ గాంచి శుద్ధాంత కాంతాజనంబులు తమమనంబుల యందు

ఉ. ఏమితపంబు చేసెనొకొ యీధరణీదివిజోత్తముండు తొ
ల్లీజనుమ యోగివిస్ఫురదుపాస్యుఁడై తనరారు నీజగ
త్స్వామి రమాధినాథు నిజతల్పమునన్ వసియించి యున్నవాఁ
డీమహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్.

అని వేనవేలువిధంబులఁదలపోయుచుండిరి. అప్పుడు శ్రీరమణుఁడాభూసురరమణుకరమును దనకరంబునఁ దెమల్చి చిన్ననాటి వృత్తాంతముల నడిగి సంసారవిషయప్రశ్నములు చేసి విద్యాభ్యాసము చేయుతఱి జరగిన చర్యలఁ బ్రస్తావించి వీని మఱువవు కదా యని ప్రశ్నింపఁగాఁ గుచేలుఁడు భక్తిభరితుఁడై

క. గురుమతిఁ దలఁపఁగ ద్విజగ, ద్గురుఁడ వనం దగిన నీకు గురుఁ డనఁగా నొం
డొరుఁ డెవ్వఁ డింతయును నీ, కరయంగ విడంబనంబు లగుఁ గాదె హరీ.

అని సాభిప్రాయంబుగాఁ బలికెను. అంత శ్రీకృష్ణుఁడు కుచేలుం గాంచి నీ విచ్చటికి వచ్చునపుడు నాకుఁ గానుకగా నేపదార్థంబుఁ దెచ్చితివి. అప్పదార్థంబు లేశమాత్రమైనను బదివేలుగా నంగీకరింతును. మఱియు,

క. దళమైనఁ బుష్పమైనను, ఫలమైనను సలిలమైనఁ బాయనిభక్తిన్
గొలిచిన జను లర్పించిన, నెలమిన్ రుచిరాన్నముగనె యేను భుజింతున్.

అని వినయమునఁ బ్రార్థించెను. కుచేలుఁ డామాటలకు బదులు పలుక నేరకుంట యొఱింగి యతని జీర్ణవస్త్రంబుకొంగున ముడిచిన యడుకులముడియ మెల్లన విచ్చి పుచ్చుకొని యివియ సకల లోకంబుల నన్నును బరితృప్తిం బొందింపఁ జాలు నని పలుకుచు మఱియుఁ బిడికెడడుకులు భక్షించి యింకను బిడికిటఁ గొనుచుండ రుక్మిణి తనకరములఁ బట్టుకొని మెల్లఁగా

క. సొంపారఁగ నతనికి బహు, సంపద లందింప నివియ చాలును నిఁక భ
క్షింపఁగ వలవదు త్రిజగ, త్సంపత్కర దేవదేవ సర్వాత్మ! హరీ.

అని వారించెను.

ఆరాత్రి కుచేలుఁడు గోవిందుమందిరమున నివసించి బహువిధపక్వాన్నంబుల భుజించి సుఖనిద్ర చేసి మేల్కాంచి కాలోచితకృత్యంబులం దీర్చి యిందిరాసుందరు ననుమతిం బడసి పోవుచుఁ దనమనంబున

ఉ. శ్రీనిధి యిట్టు నన్నుఁ బచరించి ధనంబుగ విత్త మింత యే
నీని తెఱంగు గానఁబడె నెన్న దరిద్రుఁడు సంపదంధుఁడై
కానక తన్నుఁ జేరఁడని కాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తుపరిపూర్ణునిగా ననుఁ జేయకుండునే.

అని తలంచుచుం బోయిపోయి తనయాశ్రమంబు మహత్తర నగరాకృతి నుండం గాంచి యందుం బ్రవేశించి భార్య సకలోప చారములు చేయ వానిం బాటింపక శ్రీమన్నారాయణపాదార విందముల ధ్యానించుచు విగతబంధనుండై చిరకాలముండి కడ పట నపవర్గమును బొందెను. అని పలికిన శుకయోగినిం జూచి రాజు 'మహాయోగి! ఇంకను శ్రీహరిమహిమము వినఁగోరు నా చెవులకుం బండువుసేయుమా' యన యోగి నవ్వుచు 'రాజా! పరమపావనచిత్తుఁడవు. ఎంతవిన్నను భగవత్కథాజాలమున సంతృప్తియౌఁడకుండుట స్వభావము. అది నీయందుం బొడ చూపెడిని. వినుము వచించెద.'

## శ్రీహరి మృతవిప్రకుమారులం దెచ్చి యిచ్చుట

రాజేంద్రా! ఒక్కనాఁడు శ్రీబాలగోపాలుఁడు ద్వారవతీ నగరమున సుఖం బుండఁగా, ఒకబ్రాహ్మణుఁడు మృతుఁడయిన బాలకుం గొనివచ్చి రాజద్వారమునం బెట్టి యేడ్చుచు రాజు అధర్మపరుఁడుకాఁబట్టి నాకొడుకు మృతుఁడయ్యె. లేకున్న నిట్టి యకార్యంబు సాగునే అని దూఱుచు నింటికిం బోయెను. మరల నొక్కకొడుకు కలిగి మృతుం డయ్యెను. ఇట్లు లెవ మండుగురు కొడుకులు మృతులైరి. రాజగృహము ముందటం బెట్టి విలపించుచు రాజుం దూఱుచుం బోవుచుండెను. తొమ్మిదవకుమారుండును మృతుఁడు కాఁగా యథాపూర్వ ముగం గొనివచ్చి రాజగృహప్రాంగణమునం బెట్టి పలవరించు చుండఁగా నాకాలమున శ్రీహరిం జూడవచ్చియున్న యర్జునుం డాతనిం జూచి కరుణతో

క. ఈఱగిది నీవు పగలక్, వాపోవఁగం జూచి యకట వారింపంగా

నోఁపిన విలుకాఁ డొక్కఁడుం, డీపురి లేఁడయ్యె నయ్య యిది పాడి మగున్.

అని పలికెను. అంతతో నూరకుండక నీతనయుని నే బ్రది
కించెద. అటు చేయలేకపోతినే హుతవహుం జొచ్చెద నన
నావిప్రుఁడు బలరామకృష్ణులింకుండ నట్టు లనుట పాడిగాదనఁగా
నర్జునుఁ డాగ్రహంబున

మ. బలుఁడంగాను మురాసురాంతకుఁడఁ గాఁ బ్రద్యుమ్నుఁడం గాను నేఁ
డెలియం దత్తనయుండఁగా నని విరోధివ్రాతముల్ భీషణో
జ్జ్వల గాండీవధనుర్విముక్తనిశితాస్త్రశ్రేణిచేఁ జీర్ణువెం
టలు గావించుపరాక్రమప్రకటచండస్ఫూర్తి నేఁ బార్థుఁడన్.

ఇంతియ కాదు,

వ. బలిమిఁ బురాంతకుం దొడరి బాహువిజృంభణ మొప్ప నెక్కటిం
బలఁపడి పోరినట్టి రణస్థైర్యుని నన్ను నెఱుంగ వక్కటా!
పెలుకుఱ మృత్యుదేవతను బిఁక మడంచి భవత్తనూజులన్
అలవుఁ జలంబుఁ జూపి కొనియాడఁగ నిప్పుడ తెచ్చి యిచ్చెదన్.

అని నమ్మం బలికెను. ఆప్రతిజ్ఞకు బ్రాహ్మణుం డానందించి యతనిం బొగడుచుం బోయి కొంతకాలమునకు వెండియుఁ బత్నికిఁ బ్రసూతిసమయంబు వచ్చిన వచ్చి వివ్వాచ్చు దర్శించి యావిధం బెఱింగించెను. విజయుండు వేగంబ కోదండంబు చేనంది సుగుణంబుచేసి పరిశుద్ధుఁడై యాభూసురునివెంటఁ బోయి సూతికాగృహముచుట్టును బాణవితతి నరికట్టి కాచి యుండఁగా నాభూదివిజానింతి మగశిశువును బ్రసవించెను. అందున్నవారు పోయెఁబోయె ననుచుండఁగా నాశిశువు బొందితోడన ఆకాశమున కెగిరిపోయెను. ఆవార్త నాలించి విప్రుఁడు ముకుందుకడకుం జని యర్జునుని వృథాజల్పంబు లెఱింగించి జరిగినవార్తం దెలిపి మహానుభావా! కృపానిధీ! శ్రీకృష్ణా!

క. ఎక్కడి పాండుతనూభవుఁ, డెక్కడి విలుకాఁడు వీని కెక్కడి సత్త్వం
బెక్కడిగాండీవము తన, కెక్కడిదివ్యాస్త్రసమితి యే మనవచ్చున్.

అని దూఱెను. ఆపలుకులకు విసిగి యర్జునుఁడు విడివడి పడుచుఁ దనవిద్యాతిశయమున యమపురమును జేరి యందు మృతపుత్త్రులు కనరాకయుంట శతమఖాదినగరంబుల కరిగి యందును వారిం గానక మఱియు వెదకి యేచోటను విప్రసుతులం బరికింపనేరక తనప్రతిజ్ఞ నెఱవేర్ప నగ్నిం బ్రజ్వలించి యందుఁ బడ సంకల్పించెను. ఆవిధము శ్రీకృష్ణునిమనస్సునఁ దట్టెను. వెంటనే యచట నామహనీయమూర్తి పొడసూపెను. విజయా! అగ్నిఁ బ్రవేశింప వలదు. ఆవిప్రకుమారులం జూపెద నని వారించి యర్జునుఁ దోడ్కొని కాంచనరథ మెక్కి యుత్తరదిక్కునకుం బోయిపోయి కులపర్వతంబులు దాటి మేరునగం బతిక్రమించి యేమియు గోచరింపని తమఃప్రదేశమును జొచ్చి గుఱ్ఱములు అవ్వలం బోవఁ గాళ్లురాక నిలువంబడ నాతమఃపటల మడంగఁ దనదివ్యతేజస్సును వెలయించి దాని కర్జునుండు వెఱగంద నావారాశిమధ్యభాగంబున నొకసుందరహర్మ్యంబుం గాంచి యందుఁ బ్రవేశించెను. అం దొకతావున భోగీంద్రభోగతల్పంబున సుఖాసీనుండై యున్నపురుషుని డాయంబోయి

సీ. సజలనీలాంబుదశ్యామాయమానాంగు నాశ్రితావనముదితాంతరంగు
సనకాదియోగిహృద్వనజమదాళీంద్రు ముఖపద్మరుచిజితపూర్ణచంద్రుఁ
గమనీయనిఖిలజగద్ధితచారిత్రు బ్రత్యూషసంఫుల్లపద్మనేత్రు
నిందిరాహృదయారవిందారుణోల్లాసు శ్రీకరపీతకౌశేయవాసు
తే. హారకుండలకటకకేయూరమకుట, కంకణాంగదమణిముద్రికావినూత్న
రత్ననూపురకాంచీవిరాజమాను, భవమహార్ణవశోషు సద్భక్తపోషు.

అమ్మహాత్ముం గాంచి దండప్రణామంబులు చేసి నిలువంబడెను. అయ్యాదిదేవుండు విజయకృష్ణులంగాంచి కృపారసము దళుకొత్తఁగా

క. ధరణికి వ్రేఁగగు దైత్యుల, బోరిఁబోరి వధియించి ధర్మమున్ నిలుపుటకై
  ధర జనియించితి రిరువురు, నరనారాయణు లనంగ నాయంశమునన్.

నా చెంత నుండు నీమునులు మిమ్ముం జూడం గోరిన మిమ్ముఁ రప్పించుటకై యీబ్రాహ్మణపుత్రుల నిటకుం దెప్పించితి. వీరిందోడుకొని పొండని యాజ్ఞాపించెను. అమహానీయునానతి శిరసావహించి వారిం దోడ్కొని ద్వారక కరుదెంచి బ్రాహ్మణునిఁ బిలిపించి పుత్రుల నప్పగింప నతఁడు మహానందంబున వారిం గొనియాడి పుత్రులం దోడుకొనిపోయి సుఖం బుండెను. అర్జునుఁడు తన యహంకారము నశింపఁజేసినందులకై గోవిందుం గొనియాడెను. అవ్వల,

మ. హరి సర్వేశుఁ డనంతుఁ డాద్యుఁ డభవుం డామ్నాయసంవేది భూ
  సురముఖ్యప్రజలన్ సమస్తధనవస్తుశ్రేణి నొప్పారఁగాఁ
  బరిరక్షించుచు ధర్మమున్ నిలుపుచున్ బాపాత్ములం ద్రుంచుచున్
  బరమోత్సాహ మెలర్ప భూరిశుభవిభ్రాజిష్ణుఁడై ద్వారకన్.

నివసించి మునీంద్రులు తన్ను దర్శించి కృతార్థులగుచుండ సుఖం బుండెను. అని పలికి శుకయోగీంద్రుఁడు రాజుం గాంచి

మ. మనుజేంద్రోత్తమ! యేను నీకుఁ ద్రిజగన్మాంగల్యమై యొప్పఁ జె
  ప్పిన యీకృష్ణకథాసుధారసము సంప్రీతాత్ములై భక్తిఁ గ్రో
  లిన పుణ్యాత్ములు కాంతు రిందు సుఖముల్ నిర్ధూతసర్వాఘులై
  యనయంబుం దుదిఁ గాంతు రచ్యుతపదం బైనట్టి కైవల్యమున్.

అని పలికి శ్రీకృష్ణపాదారవిందధ్యాననిమగ్నుఁడై యుండెను.

# ఏకాదశస్కంధము

## వసిష్ఠాదులు శ్రీహరిం గానవచ్చుట

పరీక్షిత్తు శుకయోగిధ్యానపయోధి నుండి నమస్కరించి మహాత్మా! శ్రీకృష్ణచరితంబుఁ జెప్పవే యని వేఁడెను. యోగిచంద్రుఁడు కన్నులు తెఱచి సంతసంబున నిట్లనియె. రాజచంద్రమా! విను మవ్వలిహరికథ వచియింతు. ఒక్కతఱి వసిష్ఠాదులు శ్రీకృష్ణుదర్శింప నరుదెంచి

సీ. ఘనుని శ్రీకృష్ణునిఁ గౌస్తుభాభరణునిఁ గర్ణకుండలయుగ్మఘనకపోలుఁ
బుండరీకాక్షు శంఖోద్ధరశ్యామునిఁ గలితనానారత్నఘనకిరీటు
నాజానుబాహు నిరర్గళాయుధహస్తు శ్రీకరపీతకౌశేయవాసు
రుక్మిణీనయనసరోజదివాకరు బ్రహ్మాదిసురసేవ్యపాదపద్ము

తే. దుష్టనిగ్రహశిష్టసంతోషకరుఁ, గోటిమన్మథలావణ్యకోమలాంగు
నార్తజనరక్షణైకవిఖ్యాతచరితుఁ, గనిరి కరుణాసముద్రుని ఘనులు మునులు.

భగవంతుఁ డవ్వారి సమానసత్కారముల నాదరించెను. వారును గృతాంజలులై గోపాలకృష్ణా! మహాకరుణాసింధూ! దీనరక్షకా!

క. తరణంబులు భవజలధికి, హరణంబులు దురితలతల కాగమముల కా
భరణంబు లార్తజనులకు, శరణంబులు నీదుదివ్యచరణంబు లిలన్.

అని మఱియుఁ బెక్కురీతులఁ గొనియాడి తమవచ్చిన కార్యమును రహస్యముగా నెఱింగించి పనివినిరి.

అంతఁ గొలఁదిదినములకే బ్రహ్మాదిదేవత లరుదెంచి కృష్ణుని దర్శించి మహాత్మా! భూభారహరణార్థ మవతరించితివి. ఆపని ముగిసినది. ఇఁక నిట నుండ నేల? వైకుంఠమున కరుదెమ్మా

యని ప్రార్థించిరి. శ్రీహరియుఁ దనసమ్మతిం దెల్పెను. కొంతకాల
మునకు భగవంతునకు నూర్ధ్వలోకగమన మిష్టపడెను. అప్పుడ
ద్వారకానగరమున మహోత్పాతములు చూపట్టెను. ఆవిప
రీతముల నెల్ల యదువులకుం జెప్పి మీ రిక నిం దుండవలదు.
ప్రభాసతీర్థమున కరుగుఁ డని యానతిచ్చెను. వారెల్లఁ దదుక్త
ప్రకారము వెడలి ప్రభాసతీర్థమును జేరిరి. అప్పుడు శ్రీహరి
యుద్ధవుండు తనచెంతకుం జనుదెంచిన నతనికి ధర్మంబు లుపదే
శించి రాఁగలకాలమును దెలిసి యోగతపం బూని బలరాముండు
కానను ద్వారకానగరంబు వెడలి యాదవులు మదిరాపాన
మత్తులై తమలోఁ దారుకలహించి మృతినొంది రిఁక నుండఁ బని
లేదని వైకుంఠమున కరిగిరి. అప్పుడె కలియుగ మారంభ
మయ్యెను.

ఇది ఏకాదశస్కంధము.

---

# ద్వాదశస్కంధము

---

పరీక్షిన్మహారాజు వాసుదేవునిర్యాణంబు విని కాలగ
తులం దలంచి శుకయోగిం గాంచి పరమహర్షంబున, మహాత్మా!
భావికాలగతుల నెఱింగించి నన్నుఁ గృతకృత్యుం జేయవే, యని
ప్రార్థించిన నాయోగిపుంగవుం డిట్లనియె. రాజా! నీప్రశ్నము
లోకోపకారక్షమము వినుము. సంగ్రహించి వివరించెద.
సూర్యచంద్రవంశంబులం బుట్టఁగల రాజులు తమతమ శక్తి
నగపఱచి రక్షణంబు సేయుదురు. కలియుగం బగుట ధర్మంబు

క్రమంబుగ క్షీణించి నామమాత్రంబుగా నుండు. పాపంబు క్రమవృద్ధిఁ గాంచుచుండు. నరపతులబాహుబలపరాక్రమం బులు ఫలింపకుండు. జనుల కన్యాయంబు మంచిదిగాఁ దోఁచు. ఇంకొక్క విశేషంబు గలదు.

చ. నరవర తొంటిభూపతుల నామగుణంబులు వృత్తచిహ్నముల్
సిరిలయును రూపసంపదలుఁ జెన్నగురాజ్యము లాత్మవిత్తముల్
వరుస నడంగెఁ గాని యట వారలకీర్తులు నిర్మలంబులై
యొరవడి భూమిలో నిలిచి యున్నవి నేఁడును రాజశేఖరా.

శంతనునియనుజన్ముఁడగు దేవాపియునిక్ష్వాకువంశజుండగు మరుత్తుండును యోగనిరతులై కలాపగ్రామనివాసులై కలియుగాంతంబున వాసుదేవుండు పురికొల్పఁ బ్రజల నాశ్రమాచారంబులు తప్పకుండ నడపుచు నారాయణస్మరణంబు నిత్యంబొనర్చి కైవల్యంబున కరుగుదురు. అని మఱియు ననేకవిషయంబు లెఱింగించి సంసారసాగరంబు దాఁట హరికథయనుమహానౌక సహాయంబు గాని వేఱొక్కటి కానరా దని తెలుపుచు నాపరమయోగిచంద్రుండు భూపేంద్రుం గాంచి భగవంతుని లోఁ దలంచి కరకమలంబులు మోడ్చి శ్రీకృష్ణపరమాత్మకు నమస్కరించి, రాజచంద్రా!

ఉ. ఏను మృతుండ నౌదు నని యింత భయంబు మనంబులోపలన్
మానుము సంభవంబు గల మానవకోట్లకుఁ జావు నిత్య మౌఁ
గాన హరిం దలంపు మిఁకఁ గల్గదు జన్మము నీకు ధాత్రిపై
మానవనాథ! పొందెదవు మాధవలోకనివాససౌఖ్యముల్.

అని యుపదేశించెను. పరీక్షిత్తు తదుక్తప్రకారంబున శ్రీకృష్ణుని మానసవీథి నిలిపి ధ్యానించి పుత్రుఁడగుజనమేజయునిభూపాలుం

నిగా నభిషిక్తుం జేయఁదగువారి నియోగించెను. శుకమహర్షియు నాతనిసంపూర్ణజ్ఞానిగా నొనరించి తనయిచ్ఛం జనియె. శాపకాలంబు సమీపింపఁ దత్ఫలంబు పరీక్షిత్తనుభవించెను. మంత్రులాభూపాలకుమారుని బ్రాహ్మణపురస్సరులై సకలరాజ్యపాలనదక్షుంగా నెంచి పట్టభద్రునిగఁ జేసిరి.

సీ. సకలగుణాతీతుఁ సర్వజ్ఞు సర్వేశు నఖిలలోకాధారు నాదిదేవుఁ
బరమదయాసారసోద్భాసితుఁ ద్రిదశాభి వందితపాదాబ్జు వనధిశయను
నాశ్రితమందారు నాద్యంతశూన్యుని వేదాంతవేద్యుని విశ్వమయునిఁ
గౌస్తుభశ్రీవత్సకమనీయవక్షుని శంఖచక్రగదాసిశార్ఙ్గధరుని

తే. శోభనాకారుఁ బీతాంబరాభిరాము
రత్నరాజితమకుటవిభ్రాజమానుఁ
బుండరీకాక్షు మహనీయపుణ్యదేహుఁ
దలఁతు నుతియింతు దేవకీతనయుం బెపుడు.

ఇది ద్వాదశస్కంధము.

గద్య. ఇది శ్రీ కాశ్యపగోత్రపవిత్ర జనమంచివంశ ప్రభవ
సుబ్రహ్మణ్యతనూభవ తాండవకృష్ణాపరాభిధేయ
శేషాద్రినామధేయ ప్రణీతకృతులయందు
సంగ్రహభాగవతము సంపూర్ణము.

శ్రీ కృష్ణార్పణమస్తు.



చెన్నపురి : వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1951